లలితమైన ప్రేమగాథకు
లలిత లలితమైన
రూపకల్పన!!

శ్రీ శంభు ఫిలింస్

# పూజాఫలము

నిర్మాత దగ్గుబాటి లక్ష్మీనారాయణ చౌదరి
దర్శకత్వం బి.యన్.రెడ్డి



నవయుగ



*Keep your skin smooth and clear with creams by*

# MAX FACTOR

**DRY SKIN CREAM • INVISIBLE MAKE-UP FOUNDATION • CLEANSING COLD CREAM**




Lanolin-enriched *Dry Skin Cream* is 'moisturised' to penetrate deep into your skin and preserve that soft, youthful glow.

Smooth and creamy, *Invisible Make-up Foundation* is absorbed quickly into the skin. A perfect powder base, it retains life-giving moisture and protects your skin from dust and sun.

*Cleansing Cold Cream* leaves pores clean, unclogged and free of blemish impurities.

*Sole Selling Agents:*

**T. T. KRISHNAMACHARI & CO.**

Bombay • Calcutta • Delhi • Madras



ME 391

# ఉత్తరాలు

## కథలు

మధురాంతకం రాజారాంగారి కథకోసం చాలా రోజులనుంచి యెదురు చూస్తున్నాను. వారి 'తృప్తి' అనే కథ చదివిన తరువాత గాని తృప్తి కలుగలేదు. వ్యంగ్య ధోరణిలో రచించిన బడిన ఈ కథ నాకు బాగా నచ్చింది. వారికి నా అభివంద నలు. ఈ సారి 'మనిషీ—మిథ్య' సీరియల్ కథ లోని సన్నివేశాలు రసవత్తరంగా ఉన్నవి. నిరంజన్ రేణుకతో "నాకు నేనే అర్థం కావడం లేదు రేణూ ! క్షమించు" అన్న వాక్యం యెంత సహ జంగా ఉంది ! నిజంగా తనకు తానే అర్థంగా గాకుండా పొయ్యే పరిస్థితి ప్రతి ఒక్కరి జీవితంలో యెన్నోసార్లు యేర్పడుతుంటుంది.

యు. రంగాచార్యులు (నెల్లూరు)

* * *

"సిరజపెళ్లి" నూతన పంథాలో సాగిన కథ. సిరజ తల్లిలో జరిగిన ఘర్షణ ఒక ప్రత్యేక పద్ధతిలో చిత్రించారు.

యెమ్మెస్సార్ (సి. ఆర్. పల్లె)

## హైదరాబాదు సినిమా

13—12—63 పత్రిక చాలా అందముగా వెలువడినందుకు సంతోషముగా నున్నది. హైద్రా బాదు సినిమా వార్తల శీర్షిక చాలా గొప్పగా వెలు వడుచున్నది. కాని ఈ వారం శ్రీ అక్కినేని నాగే శ్వరరావు గారి అమెరికా పర్యటన సందర్భములో శ్రీ వాశిరాజు ప్రకాశంగారు, నాగేశ్వరరావును రవీంద్రునితో పోల్చుట చాలా అసందర్భముగా నున్నది.

జగద్విఖ్యాతి గాంచిన షేక్స్పియర్, టాల్ స్టాయల వంటి మహాకవుల కోవకు చెందిన విశ్వ కవి రవీంద్రునితో శ్రీ అక్కినేనిని పోల్చుట అసందర్భముగా నున్నది. కావున ఇటువంటి పొరపాట్లు ఇకముందు పత్రికలో కనబడవని ఆశించుచున్నాను.

బండా వెంకట్రావు (హైద్రాబాదు)

* * *

హైదరాబాద్ సినిమా వార్తలలో వాశిరాజు ప్రకాశంగారు అక్కినేని నాగేశ్వరరావుగారి మీద ఎనలేని అభిమానం చూపించారు. వారు అమెరికా వెళ్తున్న సందర్భంలో ప్రభుత్వంవారు ఘనంగా సన్మానించాలన్నారు. అంతవరకు బాగానే ఉంది. కాని వాలెంటీనా తెరిష్కోవా మొదలగు గగన యాత్రీకులకు పౌరసన్మానం చేయడాన్ని విమ ర్శించాల్సిన అవసరం ఏమొచ్చిందో అర్థం కావడం లేదు. అంతేకాదు వారి ముక్కూ మొహం తెలియ దట. వారు గగనంలో విహరించారో లేదో ఎవరికీ తెలియకుండా సన్మానించడం అనుచితమట— అయితే వారు నిజంగా గగన విహారం చేశారో లేదో తెలుసుకోవాలంటే ప్రతీవారు గగన విహారం చెయ్యాలన్న మాట. పంపించిన రష్యాదేశం వారు మూర్ఖులా ? నిజంగా గగన విహారం జరిగి నట్లు పాంకేతికంగా కనుగొన్న రష్యేతర దేశాల వారు మూర్ఖులా ? వైజ్ఞానికంగా అభివృద్ధిని సాధించిన వారిని సన్మానించడంలో ఎంతో ఔచి త్యం ఉంది. విదేశాలతోడి సత్సంబంధాలు అందులో ఇమిడి ఉన్నాయి. ఒకరికి సన్మానం చేయ మనడం కోసం తను వ్రాస్తున్న విషయానికి సంబంధం లేని అంశాలను అర్థం లేకుండా, ఏదో రాయాలని విమర్శించడంలో ఔచిత్యం ఎంత ? అసలు నాగేశ్వరరావుగారు ఇప్పటికే యోగ్యతకు, వయః పరిపాకానికి మించిన సన్మానాన్ని పొందారు. హైదరాబాద్ పురపాలక సంఘంవారు ఏనుగు మీద ఊరేగింపుతో 1958వ సంవత్సరంలోనే సన్మానించి ఎవరికీ లేని గౌరవం ఇచ్చారు. వారి సన్మానాల్ని గురించి ఎంత మంది ఆలోచిస్తున్నారు? నటన విషయం ఆలోచిస్తే ఆయన నటన రోజురోజుకీ మరీ కృతకంగా మారుతున్న సంగతి అందరికీ తెలిసిందే. అవసరంగా యుగ పురుషు లకూ, మహాత్ములకూ, దేశ నాయకులకూ లేని ప్రాధాన్యాల్ని ఇలాంటి వారికి ఇవ్వటాన్ని ఇకనైనా వ్యాసకర్తలు విరమించాలి.

కె. రంగనాథం (హైదరాబాదు)

## జాతి విచక్షణ

13—12—63 వారపత్రికలో "అమెరి కాలో జాతి విచక్షణ" గూర్చి ప్రచురించిన వ్యాసం చదివినాను. శ్రీ కెన్నెడీ హత్య సందర్భములో అమెరికాలోని జాతివిచక్షణను తెలుపు చూ ఈ వ్యాసము ప్రచురించుట చాల సమంజసముగా యున్నది. బానిస పద్ధతి నిర్మూలన ఉద్యమాలకు కేంద్రమైన "బాస్టన్"నివాసి శ్రీ కెన్నెడీ. తన తండ్రి గొప్ప ధనవంతుడు, మేయరు అయినప్ప టికీ, ఐర్లెండు నుంచి వలస వచ్చిన కారణాన వారిని తక్కువగా చూసి వెలివేసిన ఆ దేశములోనే, మొత్తము దేశానికి కంతకూ ప్రెసిడెంట్ అయ్యారు శ్రీ జాన్ ఫిట్జెరాల్డు కెన్నెడీ. లింకన్ తరువాత జాతి విచక్షణను నిర్మూలించడానికి కంకణం కట్టుకొని ఆ ఉద్యమంలోనే ఆహుతి అయిపోయిన అమరజీవి. ఆ మహనీయుని ఆకస్మిక మరణవార్త విని విలపించని వారుండరు. భారత దేశముపై కమ్యూనిస్టు చైనా దురాక్రమణ కాలములో శ్రీ కెన్నెడీ మనకు చేసిన సహాయము మరువ రానిది. ఆయన ప్రెసిడెంటు అయిన అతి స్వల్ప కాలములో ప్రపంచాధినేతల్లో అగ్రగణ్యుడై, అందరి ఆదరాభిమానాలను చూరగొన్నారు. ఈ మహావ్యక్తి, మహాత్మా గాంధీ, అబ్రహాం లింకన్‌ల సాటివారనుటకు సందేహములేదు. ఆ మహాత్ముని ఆశయాలు ఫలించగలవని ఆశించ చున్నాను. అమరజీవియైన శ్రీ జాన్ ఫిట్జెరాల్డ్ కెన్నెడీకు, ఒక భారతీయునిగా నా జోహార్లర్పిస్తు న్నాను.

శ్రీ. వెంకటేశ్వర్లు (రాజమండ్రి)

## సీరియల్ కథ

"ప్రేమకు పగ్గాలు" చాలా బాగుంది. సంస్కా రానికి భంగం కలగకుండా, ప్రేమలో నెగ్గుకు రావాలంటే— కలిగే సున్నితమైన బాధని చక్కగా చిత్రించారు రచయిత.

వి. ఎస్. వాణి (బంది)

1950 1955 1960

1963 1978 1980

P.LIC-SZ-35

# కుటుంబ చిత్రాలు

ఆ చివరి రెండు చిత్రాల్లోనూ కూడా మీరు వుండాలని ఆశిస్తారు కదా! మీరు, లేకపోతే ఆ రెండు చిత్రాలు తుంచిన పువ్వులా వాడిపోవలసిందేనా?

లేదు - మీరు అలా కోరరని మాకు తెలుసు. కాని రేపు ఏం జరుగుతుందో ఎవ్వరూ చెప్పలేరు.

ఆరు చిత్రాల్లోను మీరు వుండాలనుకున్నప్పుడు ఒకవేళ మీరు లేకపోయినా ఆ చిత్రాలను తీయడానికి సాధ్యపడేలా మీరు చేయాలి. అదే దూరదృష్టిగల వివేకుల లక్షణం.

అవసరమొస్తే బాధ్యతలను తీసుకోడానికి జీవిత భీమాను సదా దగ్గరగావుంచుకోండి. కొడుకు చదువు కావచ్చు, కూతురు పెళ్లి కావచ్చు, మరేదైనా కావచ్చు అదృష్టమంటూ పూరుకోవద్దు. మొదట జీవిత భీమాను తీసుకునే బాధ్యతను మీరు నిర్వహిస్తే మీ యితర బాధ్యతలన్ను జీవిత భీమా తీసుకుంటుంది.
మీ నెలసరి ఖర్చులో జీవిత భీమా ప్రీమియములకే మొదటి స్థానమివ్వండి.

మీరు ఆరోగ్యంగావుండి సంపాదిస్తూ వున్నప్పుడే—నేడే భీమా చేయండి.



**జీవిత భీమాకు**
**ప్రతిగా మరొకటి లేదు**

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 27—12—63
శోభకృన్నామ సం॥ పౌష శు॥ ద్వాదశి
సంపుటము : 56 సంచిక : 17
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఒక సంవత్సరం చందా
వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా : 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1





నటి ఇ. వి. సరోజ. ప్రత్యేక చిత్రం.

## మనలోమాట

క్రైస్తవ పాఠకు లందరికీ ఆంధ్ర సచిత్ర వారపత్రిక క్రిస్‌మస్ శుభాకాంక్షలు!

* * *

వచ్చేవారం సంచికతో 'ఆసియా కథలు' అయిపోతాయి. చివరి కథ మాత్రం భారత దేశానికి సంబంధించినది! మన దేశంలో వెలువడే కథల 'స్థాయి' కన్నా ఫిలిపైన్స్ మొదలయిన దేశాల కథల 'స్థాయి' తక్కువగానే ఉన్నట్లు మాకు అనిపించింది. జపాన్ కథ మాత్రం కొంచెం బాగా ఉన్నట్లు తోస్తుంది.

* * *

క్రొత్త క్రిస్టిన్ కీలర్ శీర్షిక ఈవారం మొదలవుతోంది. నిజానికి మేము ఇంతకు మునుపు వేసిన వ్యాసాలు (హోగన్‌వి) వీటికి తర్వాత వ్రాసినవి. కాని పాఠకులు చూపిన ఆసక్తినిబట్టి వీటిని కూడా తెప్పించాము. ఇవి కాపీరైటు వ్యాసాలు.

## లోకంపోకడ



'ఆయనకి యీ (త్రాగే) అలవాటు జైపూర్‌లో ఏ. ఐ. సి. సీ. సమావేశంనుంచివచ్చాకా అలవాటైనట్లుంది.'

---

మహిళల పొదుపు రక్షణ నిధికి మదుపు
పురుషుల శక్తి దేశానికి రక్షణ నిధి

---

## విషయానుక్రమణిక


చెల్లించు!
ఏయ్ ఆగు!
అధికారం
స్వతంత్ర పార్టీ
విస్తార పన్నుల వ్యతిరేక సత్యా గ్రహం చేద్దామను కుంటోంది!


యుద్ధ విరమణ రేఖ
ఎవరు దాటుతున్నా రబ్బాయ్!
భారత్


కెన్నెడీ హత్యా విషయంలో నీ ప్రవర్తన నీ మొహం నల్లగా చేసింది చూడు!


పంజాబ్ లో కైరాన్
ప్రతిపక్షం వారికి ఉపకార హామీలు

శ్రీకృష్ణ

# లంచగొండితనం అరికట్టడం సరే, కాంగ్రెస్ నాయకుల ఆస్తి వివరాల ఆరా తీయవద్దా?

హోంమంత్రి శ్రీలాలాజీ నందాగారి సుగుణాలలో లంచగొండితనం నిర్మూలించాలన్నది ఒక్కటే గాక, తన లోపాలను ఒప్పుకోడం అనేది కూడా ఉన్నది. ప్రణాళికా నిర్వహణలో అనేక తవకలున్నాయన్నది, ఆయన ఒప్పుకున్నారు. అంతేకాదు ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం నిర్మూలించడానికి ఆయన భారత సేవక సమాజం ప్రారంభించారు. దరిమిలాన అది పి. డబ్ల్యు. డి. కంట్రాక్టర్ అయి, చాలామందిని ఇంజనీర్లను ఆకర్షించింది అంటే అది వేరే మాట! శ్రీ నందాజీ అవినీతి పై నిఘా సంఘం (తస్మాత్ జాగ్రత్త సంఘం అందాం) అంటే సెంట్రల్ విజిలెన్స్ కమిషన్‌ను కూడా సదుద్దేశంతోనే వేశారు. దీనికి తోడుగా ప్రజల మొరాలకించి ప్రభుత్వోద్యోగుల లోపాలను నేరాలను సవరించి శిక్షించగల మరో సంస్థ (ఏజన్సీ) ని కూడా ఆయన ప్రతిపాదించారు.

ఇవన్నీ మంచి పనులే! కాదనగలమా? కాని ప్రభుత్వోద్యోగులలోని అవినీతి విషయంలో ఇన్ని జాగ్రత్తలు, భద్రతలు పెంపొందించాలనుకుంటున్న శ్రీ లాలాజీ ఢిల్లీ కాంగ్రెస్ నాయకుల లంచగొండితనం లేదా, అవినీతిని అరికట్టడానికి ఏం చేస్తున్నది? ఇదో ప్రశ్న.

పైగా లాలాజీ ఆర్థిక సమత్వాన్ని ప్రవచించే పెద్ద మనిషి కదా '47 ఆగస్టునుంచి' 63 ఆగస్టు వరకూ గల మధ్యకాలంలో కాంగ్రెసు నాయకుల ఆదాయాలు ఆస్తులు ఏ విధంగా ఎంత జోరుగా పెరిగాయో అవి అలా ఎందుకు పెరిగాయో పరిశీలించే నిష్పాక్షిక సంఘాన్ని వేయగలరా? నిజంగా ఆలోచిస్తే ఒకరికి అట్లూ, ఒకరికి ముక్కా అన్నట్లు ఉద్యోగులకో నీతి, నాయకులకింకో నీతి ఉండకూడదు కదూ? ఏమంటారు? అది అలా ఉంచి ఈ అవినీతి, లంచగొండి నిర్మూలక సంస్థ ఎలా పని చేస్తుంది? రాజ్యాంగంలో దీని నెలా నిర్వచిస్తారు. కర్మంచాలక ఈ సంఘం దర్యాప్తులో ఒక సాధారణ ప్రభుత్వోద్యోగితోపాటు ఒక మంత్రిగారు లేదా మంత్రి గారి భార్య యొక్క బంధువులు, లేదా ఇతర సన్నిహితులు ఇరుక్కుంటే ఏం చెయ్యాలి?

''చాల్లెండి ఇక ఆ దర్యాప్తు సంగతి మరిచిపొండి'' అని చెప్తారా ఈ సంఘానికి? ఇంకో సందేహం! ఈ సంఘం ఏ చట్టం ప్రకారం సాక్ష్యాన్ని సంధర్భాన్నికోరి, విచారణ జరుపుతుంది? ఏదేనా చట్టం చేసి, దీనికి కావల్సిన అధికారాలు ఇస్తారా? అలాగే ఈ అవినీతి నిరోధక (ఏంటీగ్రాఫ్ట్ కమిషన్) సంఘం ఎవరికి బాధ్యురాలై ఉండాలి?

సరే ఇదంతా ఇంత బాగా లాలాజీ ఆలోచించి ఉండక పోవచ్చును కాని ఏది అవినీతి, ఏది లంచగొండితనం — దీని నెలా నిర్వచిస్తారు? ఒక ఉద్యోగంలో అందుకు కొరగాని తన బంధువుని ఒకణ్ణి వేస్తే అది కూడా నూరు రూపాయలు పుచ్చుకుని — ఒక పని చేసిపెట్టడం నేరం ఔతుందా కాదా?



అస్సాం, నేఫా ప్రాంతాలలో పాములు, జలగలు, కొల్లలు. జలగ నెత్తురు పీల్చి క్రింద పడితేగాని నెత్తురు నష్టం తెలియదు. ఒక సైనికుని మేజోడులో దూరిన జలగను అతని నేస్తం లాగి వేస్తున్నాడు [సరిహద్దులలో]

# న్యూఢిల్లీ లేఖ

... నెహ్రూజీ లాలాజీ ఇద్దరూ పరిపాలనా యంత్రాంగాన్ని ముఖ్యంగా (సర్వీసస్) ను దువ్యుబట్టడంలో నిపుణులేకాని—ఈ పరిపాలనా వ్యవస్థకు పూర్తిగా ఈ పదహారు సంవత్సరాలలోను ఎవరు నిర్ణేతలు? వారే కదా? అంచాత చెప్పవల్సింది ఏమిటయ్యాఅంటే వీళ్లను అద్యాతనభావిలో ప్రక్కకి తప్పించినా ముంచుకు రాగల ప్రమాదం ఏమీ ఉండదనే...!

## చైనా ఔదార్యం?

రష్యా చైనా వివాదంవల్ల ప్రపంచమంతటా ఇంచుమించు కమ్యూనిస్టు పార్టీలో చీలికలు వచ్చాయి. చైనావారివల్ల పెకింగ్ పక్షాలకు బాగా మద్దత్తు— ప్రచారంకూడా వచ్చాయి. సాయం కూడా లభించింది.

చైనా ప్రచారం విపరీతంగా పెరుగుతున్నందువన గా రెండుపక్షాల మధ్య భేదాభిప్రాయాలు ఎక్కువై పోయాయనే చెప్పాలి. ఆసియాలో మాత్రం చైనా పక్షాలే ఎక్కువగా వస్తున్నాయి. ముఖ్యంగా జపాన్, ఇండియా, సిలన్‌లలో ఇది చూస్తున్నాం.

పోతే ఇక ఇండొనేషియా కమ్యూనిస్టులు కూడా చైనా మొగ్గు చూపుతూ, మా 'సొంత పంథా' ఉన్న దంటూ చెబుతున్నారు. చైనా -రష్యా చీలిక విషయంలో తన పక్షంగా మద్దత్తు తెచ్చుకొనేటందుకు ప్రపంచ స్థాయిన ప్రచారం ప్రారంభించింది. తన రేడియో ప్రచారాలను బాగా వినమని (ఆయా భాషలలో) క్రొత్తగా వస్తున్న ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికా దేశాలలో 1963 సం. లో చైనా కొత్తగా ప్రకటనల ప్రచారాన్ని ముమ్మరంగా చేసింది: ఉదాహరణకి 1963 సెప్టెంబర్‌లో చైనా ఒక కొత్త భారీ ప్రచారోద్యమం ప్రారంభించింది.

ఎక్కడేనా తమకు మంచి అవకాశం రాగలదూ అనుకున్న చైనా అక్కడ వెంటనే ఆర్థిక సాయం హామీ ఇస్తోంది. చైనా చాలా ఆఫ్రోఆసియన్ ప్రాజెక్టులకు సహాయ నిధుల నిస్తున్నట్లు తెలుస్తోంది.

ప్రస్తుత పరిస్థితుల్లో ఆయాచోట్ల సి.పి.ఆర్. ఇస్తున్న ఈ సహాయ సంపత్తి చైనా ఆర్థిక దృష్ట్యా చూస్తే చాలా ఘనమైంది. 1958 నుంచి గూడా చైనా గోధుమలు, జొన్నలు మొదలగు ధాన్యాలు కమ్యూనిస్టేతర రాజ్యాలనుంచి కొంటున్నది కూడా. కాని 11,000 టన్నుల గోధుమలను చైనా క్యూబా గాలి వాన బాధితులకు ఇచ్చింది ఇంకా ఇలాంటివి ఇస్తానని చెపుతున్నది. అది ఈ బహుమతులన్నింటికి మించుమలే చైనాక పారిశ్రామికంగా అవసరమైన వస్తు సామగ్రి లభ్యం కాకపోతే, చైనా ఇంత ఉదారంగా ఉండదని గ్రహించవచ్చును. ★

# శాసన సభ విశేషాలు!

శాసన సభా సమావేశాల్లో, సభ్యులు ప్రశ్నలు వేస్తూ ఉండటం, మంత్రులు వాటికి సమాధానం చెపుతూ ఉండటం చూడ ముచ్చటగా ఉంటుంది. ప్రశ్నలు ఎప్పుడో ముందుగానే పంపించటం, వాటికి సమాధానాలు ఏరి కూర్చి చెప్పటం పరిపాటే. అయితే మంత్రులు ఆ సమాధానం చెప్పటానే, అప్పటితో ఆ బాధ్యత తీరిపోదు. వెంటనే మరొక సభ్యుడు ఇంకో ప్రశ్న అత్యాత్తుగా వేసెయ్యటం, మళ్లీ ఆయన సమాధాన చెప్పేలోగానే ప్రశ్నల వర్షం కురవటం మామూలే. వీటికి తట్టుకుని మంత్రులు సమయోచితమైన సమాధానాలు ఇవ్వటంలోనే వారి చాకచక్యం బైట పడుతుంది. ఒక్కొక్కప్పుడు మంత్రివర్యులకు సమాధానాలు తట్టకో, లేక ప్రభుత్వ విధానాన్ని ఇదమిద్ధంగా చెప్పాలసి వచ్చినప్పుడో ముఖ్యమంత్రిగారివైపుకు తిరగటం కూడా మనం చూస్తూనే ఉంటాం. అప్పుడు ముఖ్యమంత్రిగారు గంభీరంగా ప్రభుత్వం తరఫున పూర్తి బాధ్యత తీసుకుని, నిర్దుష్టంగా సమాధానాలు చెపుతారు. కాని ఒక్కొక్కప్పుడు పెద్ద చిక్కే వచ్చి పడుతుంది. ప్రశ్నలకు తగ్గ సమాధానాలు దొరకవు. అంటే అవునని కాని, కాదనికాని తేల్చి చెప్పే అవకాశం ఉండదు. అప్పుడు ఆ సమయానికి తప్పనిసరిగా తప్పించుకోవలసిన అవసరం కలుగుతుంది. ఈ సందర్భంలో ప్రభుత్వంవారు చెప్పే సమాధానం చాలా తమాషాగా ఉంటుంది. సభ్యులకు చిరాకు కలిగిస్తుంది. చూడ వచ్చిన ప్రేక్షకులకు, మంత్రులు సమాధానం చెప్పలేక పోయారనిపిస్తుంది. 'ఈ విషయం ప్రభుత్వం వారు తప్పక పరిశీలిస్తారు. అలాంటి అన్యాయం జరగకుండా ప్రభుత్వంవారు చూస్తారు. దీనిమీద ఎట్టి నిర్ణయం తీసుకోలేదు. అలాంటి నిర్ణయం తీసుకుంటున్నప్పుడు గౌరవనీయులైన సభ్యుల సూచనలను తప్పక గమనిస్తాము. ఈ విషయంలో అలాంటివి జరగకుండా చూస్తామని హామీ ఇస్తున్నాం. ఇలాంటివే ఎన్నో సమాధానాలుంటూ ఉంటాయి.

ప్రభుత్వంవారు శాసన సభలో ఇస్తున్న హామీలు ఏంతవరకు ఆచరణలో పెట్టుతున్నారు అనే దాని మీద ఒక కమిటీ కూడా ఉంది. ఆ కమిటీవారు ఈ హామీలన్నీ పరిశీలించి, ప్రభుత్వంవారు తీసుకున్న చర్యలను పర్యవేక్షిస్తారు. వీరి మొదటి రిపోర్టు బైట పడింది. దాని ప్రకారం ప్రభుత్వంవారు ఇస్తున్న ఈ హామీల్లో నూటికి 20 వంతులు కూడా అమలు జరగలేదుని ఉంది.

శాసనసభా సమావేశాలు ప్రారంభమయినప్పటి నుంచి, హైదరాబాదు చాలా 'బిజీ'గా ఉంటోంది. చాలామంది ఇతర ప్రాంతాల్నుంచి యిక్కడికి వచ్చేసి అంటిపెట్టుకుని ఉన్నారు. తమ ప్రజా ప్రతినిధులకు అండదండలుగా ఉండటానికిగాను. ఈ నెలరోజులపాటు యిక్కడ కాలక్షేపం చెయ్యడానికి తమ తమ నియోజకవర్గాలనుంచి నాయకులు, ఉపనాయకులు కూడా విచ్చేసి ఉన్నారు. రాజధాని నగరం అంటే మాటలా. అన్నింటికి ఆయువు పట్టు. ఇక్కడ కాగితం కదిలితేనే అక్కడెక్కడో మారుమూల ఫ్యాక్టరీ చక్రాలు కదలటం, పరిశ్రమల స్థాపనవ్వటం, విద్యుద్దీపాలు వెలగటం, నీరు పారుదలవటం, డబ్బు 'రిలీజ్' అవటం ఒకటేమిటి ఇన్నీ యిక్కడ కాగితాల సంచలనంమీద ఆధారపడి ఉంటాయి. మరి యీ కాగితాలయితే మామూలుగా కదలవు. అతిబద్ధకంగా ఎన్నో నెలలబట్టీ, ఎన్నో ఏళ్లబట్టీ కూడా అట్లాగే మొండికేసి కూర్చుని ఉంటాయి. వాటి కదలికకు చెయ్యాల్సిన కర్మకాండ ఎంతో ఉంది. పరిచయాలతో కొన్ని ముందుకొస్తే మరికొన్ని ముందుకు ఇంకో విధాన వస్తాయి. వీటికి సామ దాన భేద దండోపాయాలు ఉపయోగించాల్సిందే! ఎవరి చోటున వాళ్లు కూర్చుంటే, ఎక్కడి వక్కడే ఉండిపోతాయి. ఎవరి తాహతునుబట్టీ, శక్తి సామర్థ్యాలనుబట్టీ పనులు అవుతూ ఉండటం సహజమే!

ఇక శాసన సభలో ప్రశ్నోత్తర సమయాల్లో అనేకం బైట పడుతూ ఉంటాయి. సమయోచితమైన ఛలోక్తులతో మంత్రివర్యుల సమర్థనను యిట్టే ఖండించే సభ్యులు ఉన్నారు. ప్రతిపక్ష సభ్యుల ఆరోపణలలో సత్యాసత్యాలు యిట్టే చాటగల మంత్రులూ ఉన్నారు. ఈసారి ఎన్నో విషయాలమీద చర్చలు సాగినాయి. ప్రతిపక్ష సభ్యులు అదనపు భూమిశిస్తు చట్టాన్ని రద్దు చెయ్యటాన్ని గురించి పదే పదే నొక్కి చెప్పారు. ఇది బిల్లు రూపంలో ఉన్నప్పటి నుంచి నిశితమైన విమర్శలు వస్తూనే ఉన్నాయి. అయితే పాలకవర్గంవారి ధోరణిలో మార్పేమీ లేదు. ప్రతిపక్ష సభ్యుల ఆందోళనలోనూ మార్పు లేదు. ప్రస్తుతము ప్రణాళికలు అమలుపర్చాలి. అవి ముఖ్యం. రైతులకు కొంచెంగా యిబ్బంది కలిగినప్పటికీ 15 కోట్ల ఆదాయం వచ్చే యీ చట్టాన్ని రద్దు చెయ్య దల్చుకోలేదని ముఖ్యమంత్రిగారు గట్టిగానే సమాధానం యిచ్చారు. ఇంకా చేసేదేమీ లేక ప్రతిపక్ష సభ్యులు అంతా 'వాకౌట్' చేశారు.

రాజమండ్రి పేపరు మిల్లును ప్రయివేటు రంగానికి అప్పజెప్పాలని ప్రభుత్వంవారు తహతహ. ప్రతిపక్ష సభ్యులు దీన్ని గురించిన ఏకీభావం లేదు. కొంతమంది అవుతే ప్రభుత్వంవారే దీన్ని నడిపించాలని పట్టుదల పట్టుతున్నారు. ఈ సమావేశాల్లో దీన్ని గురించిన తర్జన భర్జనలు ఎక్కువయినాయి. అయితే ఇది కేవలం పేపరు మిల్లుకు మాత్రమే సంబంధించినదిగా లేదు. ప్రయివేటు రంగం, పబ్లిక్ రంగం ఈ రెంటిలో ఏది ఎక్కువ ఉపయోగం? ప్రభుత్వంవారి నిర్దుష్టమైన విధానం ఏమిటి? అందువలననే కాంగ్రెసు శాసన సభ్యుల లోనే భేదాభిప్రాయా లున్నాయని తెలుస్తోంది. ఏమైనా ప్రభుత్వంవారి విధానం ప్రకటించిన తర్వాత అంతా ఒకటే!

ఇక ధరలు పెరుగుదల అరికట్టటానికి చర్యలు తీసుకోవాలని సభ్యులు కోరటం, ప్రభుత్వంవారు సమాధానం చెప్పటం. ఇది మామూలే. అయితే ఇంకా అదనంగా చౌక దుకాణాలు నెలకొల్పి ధరలను అదుపులోకి తీసుకురావటానికి ప్రభుత్వం వారి ఆలోచన ఉన్నట్లు వెల్లడి అయింది. అయితే ఈ పెరుగుదల తాత్కాలికమేనని ఈ ఏడు ధాన్యం మార్కెట్టులోకి రాంగానే ధరలు కంట్రోలు కాగలవని ముఖ్యమంత్రిగారు ఆశాభావం వెలిబుచ్చారు. ధరల పెరుగుదల అదుపుకు చర్యలు తీసుకుంటున్నారు కాబట్టి నాన్ గెజిటెడ్ ఉద్యోగస్థుల కోర్కెలను అంటే జీతాలను పెంచాలని, ప్రస్తుతం తీర్చే అవకాశం లేదని కూడా స్పష్టం చేశారు ప్రభుత్వంవారు, బాగానే ఉంది. అయితే ప్రభుత్వ వ్యయంలో ఎన్నో అవకతవకలు బయట పడ్డాయని ఆర్థికమంత్రిగారే వప్పుకున్నారు. వీటిలో దుబారా ఖర్చులు, తగిన అనుమతి లేకుండా చేసిన ఖర్చులు, ఇవిగాక దుర్వినియోగం చెయ్యటం ఇలాంటివి ఉన్నాయట. ఏటేటా జరిగే ఆడిట్ రిపోర్టులో యిలాంటివి బైటపడుతూనే ఉంటాయి. చర్యలు తీసుకుంటూనే ఉంటారు.

ధరలు పెరుగుదలతోపాటు ప్రజల్ని బాధించేది యింకోటి ఉంది. అదే కల్తీ వస్తువులు కొనుక్కోవల్సి వచ్చిన దుర్గతి. డబ్బు పోయి శని పట్టినట్టవుతుంది. డబ్బు వదలటం, ఆరోగ్యం చెడటం. కేవలం ఇలాంటి కల్తీ వస్తువులను అమ్మే వ్యాపారస్థులను శిక్షించటమే కాకుండా ఇంకా ఇతర చర్యలు కూడా తీసుకోదలచినట్లు దానికి అదనంగా కొంతమంది ఉద్యోగస్థులను నియమించాలన్నట్లు ఆరోగ్యశాఖ మంత్రిగారు చెప్పారు. 'లాబరేటరీస్' రాష్ట్రమంతా స్థాపించాలంటే ఎక్కువ ఖర్చు అవుతుంది. అందువలన ఈ అదనపు ఉద్యోగస్థులే సత్వరమైన చర్యలు తీసుకొనటానికి అవకాశ ముంటుందీ అన్నారు. ఇలాంటి చర్యలు కొన్ని పురపాలక సంఘంవారూ తీసుకుంటున్నారు. అయితే దానివలన అట్టే ప్రయోజనమేమీ కనిపించటంలేదు. రాజధాని నగరంలో ప్రతిరోజూ కూడా కల్తీ వ్యాపారస్థులకు శిక్షలు విధించటం పరిపాటే. మిరప పొడిలో చిత్రికపొడి కలిపారని, వెన్నలో మైదాపిండి కలిపారని, కాఫీ పొడిలో చింతగింజల పొడి, పప్పుల్లో రంగులు, టీలో తారు, ఒకటేమిటి, ఆఖరికి పాలలో నీళ్లు కలిపారని కూడా శిక్షలు విధిస్తూనే ఉన్నారు. దేని కదే! రాజధానిలో ఈమధ్య రెండు రోజులపాటు పురపాలక సంఘ పరిపాలనా నిర్వాహకుల సమావేశం ఒకటి జరిగింది. వారంతా చర్చించారు. అందరూ ఏకీభావంతోనే ఉంటారు. అమలులోనే వస్తుంది చిక్కంతా.

సహకార సంఘాల బిల్లు, పంచాయితీల బిల్లు రెండూ పెద్దవే ముఖ్యమైనవే కూడా. వీటి

# రాజధాని కబుర్లు

మీద చర్చలు హోరా హోరీ సాగినాయి. సహకార సంఘాల బిల్లులో, రిజిస్ట్రారుకు ఇచ్చిన విస్తృతమైన అధికారాల పట్ల తీవ్రమైన ఆక్షేపణలు తెలియజేస్తూ సభ్యులు ప్రసంగించారు. నిరంకుశ విధానానికి దారి తీస్తుందని, సహకారోద్యమానికి దోహదకారిగా ఉండదని, కేవలం సహకారమనే పదం, ప్రభుత్వ పరమయి పోతుందని అన్నారు. అయితే ఇప్పుడున్న సహకార సంఘాలలో జరుగుతున్న అత్యాచారాల దృష్ట్యా, రిజిస్ట్రారుకు ఆ మాత్రం అధికారాలు కనక ఇవ్వకపోతే వాటిని అరికట్టటం సాధ్యం కాదని ఆర్థిక మంత్రి వివరించారు. చివ్వరికి ఈ బిల్లును శాసన సభ వారు ఆమోదించారు. అట్లాగే పంచాయితీ బిల్లు, దీనిమీద కూడా తీవ్రమైన చర్చలు సాగినాయి. నిర్బంధ సేవకోసం గ్రామంలోని పురుషులందర్నీ ఆదేశించే అధికారం గ్రామ సర్వెంట్‌కు సంక్రమించే ఒకనిబంధన ఈ బిలులో పొందు పరచారు దీన్ని గురించి అభ్యంతరం తెలియజేశారు. ప్రభుత్వం వారుకూడా ఈ నిబంధన మంచిదికాదని తీశేశారు. పంచాయితీ సభ్యులు అయిదేళ్ల దాకా పదవీ కాలంలో ఉండే ఏర్పాటు చేశారు. ప్రస్తుతం మూడేళ్ల కాలపరిమితే. కోర్టు దావాలు తగ్గించటానికిగాను న్యాయ పంచాయతీలు ఏర్పాటు చేశారు. వీరికి తగిన అధికారాలు ఇవ్వడం జరిగింది. గ్రామ పంచాయితీ పరిపాలనా నిర్వహణ ఈ బిల్లు అమలు జరిగితే అతి సమర్థవంతంగా ఉండ దగలదనే ఆశాభావం పంచాయితీ మంత్రిగారు వ్యక్త పరిచారు. ఇవన్నీ శాసన సభా సమావేశాల్లో జరిగిన వాటిలో కొన్ని.

ఇంకా ఇతరత్రా రాజధానిలో చాలా విశేషా లున్నాయి. కమ్యూనిస్టు పార్టీవారు మద్య నిషేధ చట్టాన్ని పూర్తిగా రద్దు చెయ్యమని కోరు తున్నారు. కోస్తా జిల్లాలలోనూ, రాయలసీమలోనూ మద్యనిషేధం అమలులోనే ఉంది. తెలంగాణా ప్రాంతంలోనే ఇది అమలులో లేదు. కొంతమంది, ఆ నిషేధ చట్టాన్ని అమలు పరచమంటే, అసలే తీసెయ్యాలని కొంత మంది అంటున్నారు. మొదట్లో ప్రభుత్వంవారు కూడా, 'డబ్బు కక్కూర్తి' కోసం, ఈ చట్టాన్ని తీసేస్తే బాగుం టుందని అనుకున్నారుట. తర్వాత కాంగ్రెసు వారి సిద్ధాంతాలు, గాంధీజీ ప్రబోధాలు కలవర పెట్టేసినాయి. ప్రస్తుతం విరమించుకున్నారు.

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగారు సేవా ధర్మాన్ని చేపట్టారు. ప్రతి జిల్లాలోనూ ఒక వారం పర్యటించి ప్రజల కష్టనష్టాలను స్వయంగా విచారించ దలచినట్లు ప్రకటించారు. ఇందుకుగాను, తనకున్న కొన్ని శాఖలను ఇతరు లకు అప్పచెప్పాలని ఆలోచిస్తున్నారు. అభివృద్ధి ప్రణాళికలు యెన్ని చేపట్టినా, గ్రామాల్లోని ప్రజల ఇక్కట్లు తీరలేదని దీనికి తగిన చర్యలు తీసుకోవాలని అభిప్రాయపడ్డారు. ఈ చర్యలు తీసుకునే ముందర తానే స్వయంగా తిరిగి ప్రజలనే అడిగి తెలుసుకోవటం మంచి దనుకున్నారు. వీరు జిల్లాల్లో పర్యటించినప్పుడు ప్రజలు యేవేమి అడుగుతారో, వీరు మరి యేవేమి చేస్తారో చూడాలి.

టెలిఫోన్ల గడబిడ యెక్కువయింది. ఈ డిసెంబరు చివరికి నగరంలో అదనంగా 1500 కొత్త టెలిఫోన్ల సౌకర్యం కలుగ చేస్తామని ఈ మధ్యనే, ఒక అధికారి అన్నారు. ఈ ముక్క అన్న తర్వాత లిస్టులో ఉన్న వ్యక్తులకు కాస్త ఓపిక వచ్చింది. హఠాత్తుగా ఒక్కరోజునే టెలిఫోన్ సౌకర్యాలు యెంతో మందికి ఇట్టే ఆగిపోయినాయి. దీనికి కారణం అధికారుల దోషం కాదు. అది కేవలం ఆయా వ్యక్తులదే! వ్యక్తు లేమిటి కొన్ని ప్రభుత్వ కార్యాలయాలే ఉన్నాయి. ఇదంతా యేమిటి? సకాలంలో బిల్లులు చెల్లించక పోవటం, అధికారులు నోటీసులు ఇచ్చినా ఖాతరు కొంచెంగా తప్పించారు. దాంతో అందరూ కళ్లు తెరిచారు. నూటికి 95 మంది దాకా 24 గంటల్లో డబ్బు చెల్లించారట. అయితే వ్యక్తుల విషయం వేరు. అనేక రకాల ఇబ్బందులుంటాయి. మరి ప్రభుత్వ కార్యాలయాల మాటో! కేవలం అశ్రద్ధ, బద్ధకం, సమర్థవంతమైన పరిపాలనా నిర్వహ

54 వ పేజీ చూడండి

# సరాగమాల

వి.ఏ.కె. రంగారావు

ఘంటసాల మొట్టమొదట సంగీత దర్శకత్వం వహించిన చిత్రం "కీలుగుర్రం" అని అందరికీ తెలుసు ననుకుంటాను. కాని, అంతకుముందే రెండు, మూడు సినిమాలలో ఘంటసాల స్వంత వరుసలు దాదాపు ఇరవై దాకా వినిపించినవంటే చాలమందికి ఆశ్చర్యంగానే ఉండవచ్చును. ఆ కథ వినండి.

"రత్నమాల" చిత్రంలో భరణీ రామకృష్ణ, డి. ఎల్. కోరగా మూడు పాటలు చేశారు. కీర్తిశేషులు సి. ఎస్సార్ పాడిన "ఆగవే మరదలా" ఉడత సరోజిని పాడిన "దారితెలియ దేమిసేతు" అన్నదీ, దొంగలపాట. ఇందులో రాజేశ్వరరావు వరస ఒకటి ఉన్నది. పల్లవి గుర్తులేదు. కాని, "ఝుంఝుం" అని వస్తుందా బృందగానం. తక్కినవన్నీ సుబ్బరామన్ చేసినవే. ఈ "రత్నమాల" చిత్రంలో సహాయ సంగీత దర్శకుడిగా పేరు వేసినట్టు జ్ఞాపకం.

ప్రతిభావారి "బాలరాజు" చిత్రంలో, కూడ ముగ్గురు సంగీత దర్శకులు పనిచేశారు. "తేలి చూడుము హాయి", "ప్రేమే ఎరుగవవా", "తీయని వెన్నెల రేయి" సుబ్బరామన్ గారివి. "పతిరూపము నీయరయా" రాగమాలికలో మొదటి రెండు రాగాల చరణాలు, దేవాలయంలో పాడిన ఒక పాట గాలిపెంచలవి. మిగిలినవి ఘంటసాలవి. ఇందులో ఏవిధంగా పేరు వేశారో గుర్తులేదు. కాని, అప్పట్లో పత్రికలలో చాల దుమారం ఈ సంగీత కర్తల విషయంపై జరగటం, ఆ పాటలు పాడిన ఎస్వరలక్ష్మి తుదకు ఘంటసాల పక్షాన తీర్పు చెప్పడం జరిగిందని వినికిడి.

ఈ సమయంలోనే మహతీ పతాకం క్రింద తయారవబోతున్న "లక్ష్మమ్మ" చిత్రానికి ఘంటసాల బుక్ అవటం జరిగింది. దీనికి కారణం కృష్ణవేణి. కొన్ని వారాల క్రిందట ఒక ప్రశ్న అడిగాను. "తెలియ వశమా" గురించి. ఆ పాటను అంజలీదేవికి నేపథ్యం పాడిన కృష్ణవేణి ఆ నిర్మాతలను ఘంటసాలను ఆ పనికి నియోగించమని కోరటం, చివరికి తిరిగి తిరిగి ఆ చిత్ర నిర్మాణం ఆమె చేతికే రావటం జరిగింది.



శ్రీమతి భానుమతి.

"బాలరాజు" పాటలలో మరొక విశేషం ఏమిటంటే, ఆ పాటలకు వరసలు కట్టింది మాత్రం ఘంటసాల, గాలిపెంచల. బ్యాక్‌గ్రౌండ్, అంటే వాద్యానుసరణలు వేసింది సుబ్బరామన్. ఈ చిత్రమైన పద్ధతి అప్పట్లో అమల్లో ఉండేది. అందుకోసమే ఆ పాటలు వింటుంటే అందులో సుబ్బరామన్ పోకడలే కనపడుతుంటాయి.

*  *  *

రామవరపు కేశవరావు విజయనగరం నుంచి వ్రాశారు రిపబ్లిక్‌వారి "బొబ్బిలి యుద్ధం" లో అన్నీ భానుమతి పాడిన పాటలేనా, అన్నీ శాస్త్రీయ గీతాలేనా అని. కాదు. ఎంతమాత్రం కాదు. ఇదేం 'మల్లీశ్వరి" అనుకున్నారా అన్ని శాస్త్రీయ' గీతాలు, అన్నీ భానుమతి పాటలు కావటానికి?

ఇందులో భానుమతికి ఉన్నవి రెండే పాటలు. "శ్రీకర కరుణాలవాల వేణుగోపాల" అన్నది. జూనియర్ సముద్రాల రచన. తిలక కామోద్ రాగం. రెండవది సి. నారాయణరెడ్డి రచన "ఊయల లూగినదీ నా మనసే" అన్నది. కల్యాణి రాగ చ్ఛాయలతో మిమ్మల్ని ఉయ్యాల లూపగలదీ పాట. ఈ రెండు పాటలే భానుమతి మల్లమ్మగా పాడుతుంది. ఇవి శాస్త్రీయ గీతాలు అని చెప్పడం కన్న లలిత శాస్త్రీయ గీతాలంటే బాగుంటుంది. శాస్త్రీయమైన జావళి ఒకటున్నది సుశీల ఎల్విజయలక్ష్మి నృత్యానికి పాడినది. ఈ పాట కూడా చాల హాయిగా ఉన్నది. మరో రెండు యుగళ గీతాలు సుశీల, ఘంటసాల, కంఠాలతో సుభద్రా వెంగళ్రావుల పాత్రధారులు జమునా, సీతారాం పాడతారు. ఇందులో నేను ఒకటే విన్నాను. అది హాయిగా, విన సొంపుగా, శ్రీనాథుని పద్యంతో కూడి ఉన్నది. తక్కిన పాటలు నేను వినలేదు.

అయినా మీ కెందుకంత తొందర, భానుమతి పాటలనా, మరేదైనా కారణం ఉన్నదా ?

*  *  *

ఈడూ—జోడూ ఎస్. 69750.

ఒకసారి ఎంతో మంచి పాటలను పరిచయం చేయడం ఆలస్యమై పోతుంటుంది. విడుదలైన కొత్తలో "ఈడూ — జోడు" లో నాలుగు పాటలనుకుంటాను. పరిచయం చేశాను. ఇన్ని రోజులైన తరువాత మళ్లీ పఠితలు ఈ పాటను గురించి వ్రాయుమని కోరారు! వారికోసం.

"చిరుగాలి వంటిది అరుదైన చిన్నది" అన్న ఆరుద్ర రచన సినిమాలో రెండుసార్లు వినిపిస్తుంది. మొదటిసారి సంతోష గీతంగా. సుశీల "ఊహూ" లతో ఘంటసాల గాత్రం కలసిన మోహన గీతంగా. ఇందులో అకార్డియన్ భలే అల్లరి పెడుతుంది.. వాద్యగోష్ఠి అంతా పాశ్చాత్య ధోరణిలోనే ఉంది. మధ్య మధ్య ఉన్న బిట్స్ టాంగో పద్ధతిలో "కిస్ ఆఫ్ ఫైర్" అనే ఆంగ్ల కృతి ఛాయామాత్రంగా అనుసరిస్తూ ఉన్నవి. లీలగా వెనుక వినపడే బొంగో డ్రమ్స్ హుషారెక్కిస్తూ జోరుగా ప్రయోగినవి. అకార్డియన్ ఎవరు వాయించారో గాని అద్భుతంగా ఉంది.

దీని వెనుక ప్రక్కనే ఉన్నది విషాద గీతం. ఇందులో సంతోషం విరిసించే సుశీల కంఠం బదులు విషాదం వెదజల్లే ఒకే ఒక సన్నాయి ఉంది. ఆ ఆర్తనాదం వింటుంటే విచారంతో మనసు ప్రయ్యలవుతుంది. విరుద్ధ భావ స్ఫోరకమైన ఈ రెండు గీతాలు ఒక రచనతో ఇంత అందంగా తయారవటానికి కారణం పెండ్యాల. మొదటిది వింటే ఎంత సంతోషంగా సంబరంగా ఉంటుందో రెండవది వింటే అంత భారంగా ఉంటుంది. దీనికి కారణం పెండ్యాల ఘనతే. ఆరుద్ర రచన రెండు ప్రక్కలా పదునైన కత్తిలా అదునుకు తగినట్లు ఉన్నది.



## హైదరాబాద్ సినిమా వార్తలు

హనుమంతునికి తన శక్తి తెలియదట ! ఎవరన్నా చెప్పేవరకు తెలిసేది గాదట!!!

తెలుగు నిర్మాతల పోకడలు కూడా అలానే ఉన్నాయి. తెలుగువారి రాజధాని ఇంతగా అందంగా, పసందుగా ఉన్నా చాలామంది తెలుగు నిర్మాతలు ఇంకెక్కడో తమ చిత్రాన్ని షూటింగు జరపాలని అనుకొంటూ ఉంటారు. మరో వైపు నుంచి, హిందీ నిర్మాతలు, బెంగాలీ దర్శకులు హైదరాబాదు వచ్చి తమ చిత్రాలను ఇక్కడనే షూటింగు చేసి వెళుతున్నారు.

ఈ నెలలో రెండు హిందీ చిత్రాలు, రాజధానికి షూటింగు నిమిత్తం వచ్చాయంటే, విస్తుపోనవసరంలేదు. ముకుల్ మూవీస్ వారి రంగు చిత్రం "బాఫి" కూడా ఆ రెండిట్లో ఒకటి.

ఈమధ్య దాదాపు 15 రోజులపాటు రాజధాని నగరంలో కొన్ని ప్రాంతాలు "బాఫి" చిత్ర నిర్మాణ కార్యక్రమంతో క్రిక్కిరిసి పోయాయి. హైదరాబాదులో ఈనాడు కూడా మహమ్మదీయ

47 వ పేజీ చూడండి



'చిగురాకుల పందిరి మీ సదనం!
చిరుగాలుల అలజడి మీ వదనం!
చిరకాలము నిలుచును మీ కథనం!

నాకు నవ్వొచ్చింది.

'అదేమిటి వదినా, నీకు కవిత్వం కూడా వచ్చునని ఇన్నాళ్ళూ నాకు తెలీదే! కొంపతీసి పిచ్చిగాని ఎత్తలేదుకదా!'

'నీ కెలా తెలుస్తుంది సీతా, తెలీదు! వర్షం వచ్చినపుడు కొండ గుహయినా ఆశ్రయం ఇవ్వగలదు. ఎండొచ్చినపుడు అడవి చెట్టయినా నీడ యివ్వగలదు .... ఇలా చెయ్యగలమని కొండకీ, చెట్టుకీ తెలుస్తుందంటావా? .... ఇనుముతో చేసిన వంతెనకి తను రోజుకి వేలకొద్దీ మనుష్యుల్ని అట్నుంచి యిటు తర్లిస్తున్నానని తెలుసునంటావా? కర్రతో చేసిన పడవ ఎంతోమందిని ఆ ఒడ్డు నుంచి ఈ ఒడ్డు చేరుస్తున్నానని ఎరుగునంటావా? ....'

మాటాడుతుండగానే వదిన గొంతుక బొంగురుపోయింది.

'ఏ పువ్వు అయినా, ఏ పండ్లు అయినా కొన్ని కాలాలలోనే లభిస్తాయి. వెన్నెల కయినా వెలుగు కయినా వేళ లున్నాయి. కాని అన్ని కాలాలలోనూ లభించేది ఒక్కటే ఉంది .... అది ....'

వదిన వెక్కివెక్కి ఏడుస్తూ నా ఒళ్లో తల

దాచుకొంది. పూర్తిగా సహజసిద్ధమైన, పూర్తిగా సామాన్యమైన గుణాల్ని చూసి ఈవిడెందుకు ఇంత విచలిత అవుతుందో అర్థంకాదు. ఏమిటో వీళ్ల తీరే అంత చిత్రమైన మనుషులు !

*           *           *

ఆరోజు ఎనిమిదో, ఎనిమిదిన్నరో అయి ఉంటుంది. నా వంటగదిలో నేను 'చుంయ్' మని చారు పోపులో మునిగిపోయి ఉన్నాను. వీధి గుమ్మంలో 'భోంయ్' మని కారాగడం గాని, మా జగన్నాథం కారు హారను 'పెమ్ పాం' అని వాయించడం గాని వాళ్ల డ్రైవరు 'అంయ్' అని తిరగబడ్డంగాని నే నెరుగను.

'అన్నయ్య క్యాంపు నుంచి వచ్చేసినట్టున్నాడు'.. అని వదిన ఓ కేకెట్టింది. చేతులు కడుక్కొని పై చెంగుతో తుడుచుకుంటూ వీధిలోకి వస్తున్నాను.

'ఇదుగో ఈ గదిలో పడుకోబెట్టండి' అంటున్నారు ఆయన.

'ఇదిగో ఇక్కడా .... ఒసే పద్మా నువ్వెళ్లి ఆ కిటికీ తలుపు తెరు. చూడు రంగా వెంటనే నువ్వు వెళ్లి సుబ్బారాయుడు డాక్టరుగార్ని నేను రమ్మన్నానని చెప్పి వెంటనే తీసుకురా .... ఏమోయ్ వెంకట్రమణా, నువ్వు పెరట్లోకెళ్లి మొహం కడుక్కో .... ఒసే కాంతం నువ్వు కాఫీలు కలుపు .... మీరలా లోపలికి వెళ్లండమ్మా .. .... ఏది, మీ అమ్మేదిరా? ఎంతసేపూ ఆ వంటింట్లో అఘోరిస్తుంది.... సీతా .... ఏమేవ్' ఏమీ అర్థమవక నేను నెమ్మదిగా ముందు కొచ్చాను.....

'చూడూ ఈవిడెవరో గుర్తుకొచ్చారా ?'

వస్తూనే నమస్కారం చేశాను. కూర్చోండన్నాను. ఎక్కడో ఎప్పుడో ఏదో పేరంటంలో చూసినట్టుంది. మొహం, జ్ఞాపకం రాలేదు.

'ఓసి వెర్రిమొహమా, మన కాంభోట్ల మేష్టారి పెళ్లమే ! నేను మేజిస్ట్రేటుగా ఉన్నప్పుడూ ..... ఎక్కడా .... తునిలో .... మన రాజగోపాలుడికి సంస్కృతం చెప్పేవారూ .... ఆయనన్నమాట .... మరోలా అనుకోకండమ్మా, ఉత్తి మందమరుపు మనిషి !'

'అయినా ఒక ఊరా, ఒక లోకమా బాబూ ! ఆ ఉద్యోగంలోంచి ఈ ఉద్యోగంలోకి వచ్చారా మరి...'

'మొన్న నేను క్యాంపు కెళ్లినపుడు యథాలాపంగా వీళ్లింటికి వెళ్లాను .... పాపం వీళ్ల సుబ్బన్నకి నాటుమూడు దాకా జ్వరం ఉంది .... వారం రోజుల్నుంచి మూసిన కన్ను ఎరగడట ..... అలాంటిచోట వైద్యమేం జరుగుతుంది చెప్పు ? ఇక్కడ మంచి వైద్యులున్నారుగా చూపిద్దామని అప్పటికప్పుడు బలవంతంచేసి తీసుకొచ్చేశాను. ఒకపట్టాన మేష్టారు ఒప్పుకోలేదనుకో .... మేష్టారు రాడానికి శలవు కుదర్లేదుట .... సాయంగా ఉంటాడని వాళ్ల తమ్ముడు వెంకట్రమణని పంపించారు ....'

'లోపలికి రండమ్మా స్నానం చేద్దురుగాని' అన్నాను. ఆదుకోనూ వచ్చు, అవసరానికి అడ్డు పడనూ వచ్చు.... ముందు చెప్పడం, చెయ్యడం ఏం ఉండదు, వీళ్ల పద్ధతే అంత .... హడావిడి మనుషులు !

*           *           *

కున్నవాళ్లు లేరు. అత్తాలింట పైపున ఇంటట ఉద్యోగాలు చేసినవాళ్లూ లేరు. డబ్బు విలువా, కాలం విలువా గ్రహించి క్రమశిక్షణకి ప్రాణమిచ్చే ఆనాటి ఆంగ్లేయుల దగ్గిర జొనపించుకుని ఉద్యోగాలలో ఉన్నత పదవులను మేడ మెట్లెక్కినట్టు ఎక్కేశారీయన..

'సీకేమే, అబ్బో గవర్నమెంటు ఆఫీసరు భార్యారత్నానివి ! వేలకి వేలకి జీతమే ఉంటుంది..... ఇక బళ్లకొద్దీ పై రాబళ్లు, అవి లెక్కేమిటిలే !' అనేవారు మావాళ్లు. పై రాబళ్లంటే జ్ఞాపకం వచ్చింది, జీవితంలో ఒకే ఒకసారి ఇలాంటి వాటికి ఎగబడడమూ, మరి లేవకుండా దిగబడడమూ కూడా జరిగింది.

ఒకరోజున కన్నుకుట్టే కమలాఫలాల నిండు బుట్ట మా యింటికి చేరింది .....

పిల్లలు యింకా ఇంటికి రాలేదు. వదిన వంటింట్లో ఉంది. ఈయన ఆఫీసు నుండి వచ్చారు. రాగానే బుట్ట చూశారు. చూడగానే ముగ్గుబుట్టలాంటి ఆయన మొహం బొగ్గు తట్ట అయిపోయింది. ఖాండ్రించి ఉమ్మేశారు, గర్జించి కదలేశారు.

'ఇదెవరు తెచ్చారు ? ఎవరు లోపల పెట్టించారు.'

'ఉంచండి పిల్లలు తింటారు.'

'ఈ ఏడుపు కూడా ?'

'ఇది ఏడుపు కూడనా?'

'కాదా ? ఇది ఎవరు ఎందుకు ఏ ఉద్దేశంతో మన కిచ్చారు ?'

మనం ఎందుకు పుచ్చుకున్నాం ? మనకీ, వాళ్లకీ ఏమిటి ఒప్పందం ?

'ఇది చిరుతిండి కాదా, చిల్లర బతుకు కాదా, సిగ్గుచేటు కాదా ?' వదిన వంటింట్లోంచి పరుగెత్తుకొచ్చింది.

'చాల్లేరా .... ఇంకో నాలుగు పేర్చు .... ఇంతోటి మహాపరాధానికి ఉరిశిక్ష విధిస్తే సరి .... అక్కడికి ప్రపంచంలో అందరూ మడిగట్టుకున్నట్టు....'

ఫ్రీగా సినిమాకి వచ్చిన 'సర్కిలు ఇనస్పెక్టరు' పెళ్లాన్ని చూస్తే. 'దీన్ని తీసుకెళ్లిపోతే విలువ దోపిడీ యిస్తాను' అని మొక్కుకోని సినిమా మేనేజరు ఉండడు. సరాసరి షాపుకి వచ్చేసి 'వెనక నించి పంపిస్తాం సామ్మ' అని పది పట్టు చీరలు ఏరి పట్టుకుపోయే 'సేల్సు టేక్సు ఆఫీసరు' కూతుర్ని చూస్తే 'దీని ఏడేడు తరాలూ ఏకమై ఎప్పు డేడుస్తారో' అని ఎదురుచూడని బట్టల షాపు యజమాని ఉండడు .... వద్దు .... మనకీ లంచాలు వద్దు .... ఉచితంగా వచ్చిందేమీ ఉచితమైంది కాదు .... అది పళ్లగంప కాదు .... ముళ్ల కంప .... ముందవతలికి సాగనంపండి.'

'రాబళ్లు కావవి బళ్లు' అంటారు మావాళ్లు 'మామూళ్లు కావివి ముళ్లు' అంటారు మావారు.

ఏదైతే మా కెందుకు గాని నా పిల్లలకు పెట్టుకుందా మనుకున్న గంపెడాశా నా ముందు నుంచి చూస్తుండగా కదలిపోయింది !

ఇక నెలకి వచ్చే మూడొందల రూపాయల్లోనూ ఒకటో తారీఖుకే వందా ముందు మనియార్డర్లు వెళ్లిపోవల్సిందేకదా .... మరి .... ఈయన్ని పెంచి పెద్దచేసిన పింతల్లి ఉందిట కదా, అతి హీన స్థితిలో ఉన్న ఇద్దరు ముగ్గురు స్నేహితులట కదా, ఇవన్నీ పంపకపోతే వీళ్లందరి నోరూ కొట్టి వచ్చే కదా .... కట్టుకున్న పెళ్లాం, బిడ్డలూ మాత్రం ఏమీ అనడానికి లేదుకదా .... ఇదేకదా ఈయన కథా .... పైవాళ్లకి ఇచ్చేటప్పుడు మాత్రం ఈయన చేతికి ఎముక ఉండదు. ఇంట్లో ఖర్చు పెట్టేటప్పుడే విపరీతమైన పొదుపూ, బ్రహ్మాండమైన జాగ్రత్తాను !

పెద్ద పండుగ కయినా ఆడపిల్లలకి బట్టలకని చవక రకం ఏక రంగు సైను తాను తెస్తే ఇది ఛస్తే మాకొద్దని వాళ్లు గెంతుతున్నప్పుడూ, వరసపెట్టి ఏకబిగిని, మొగపిల్లలకి సమ్మర్ క్రాపు చేయిద్దా మనుకుంటే మంగలాడికి దొరక్కుండా గంటకి అరవైమైళ్ల స్పీడులో పిల్లలు పరుగెడుతున్నప్పుడూ .....



## కరుణాత్మురాలు

ఈ చేతకాని అమ్మే ఆ అమాయకులకి శరణాగతి!

ఇంకా ఏం చెప్పను ఈయన లీలలు!

వీళ్ల స్వభావమే ఇంత .... అసాధ్యపు మనుషులు.

* * *

'నువ్విలాంటివి వెంటనే నిలదీసి అన్నయ్యనెందు కడుగవు?' అంది వదిన. ఏమిటన్నట్టు చూశాను.

'ఇవాళకి వారంరోజు లయింది వాళ్లొచ్చి. ఆవిడా, ఆవిడ చంటిపిల్లా, మరిదీను .... ఒకళ్లా ఇద్దరా? వీళ్లందరూ కాక ఆ జ్వరం పిల్లాడొకడూ .... ఏం రోగమో ఏమిటో. ఆ కుర్రాణ్ణి చూస్తూంటే నాకు భయమేస్తోంది .... నాకీ ఇంట్లోంచి పారిపోదామని పిస్తోంది. దేన్ని చూసి నువ్వు సహిస్తున్నావో నాకేం అర్థంకావడంలేదు.'

'తీరా తీసుకొచ్చారు .... ఆసుపత్రిలో 'బెడ్' దొరకలేదుట .... మధ్యలో ఎక్కడికి పొమ్మంటాం పాపం?' అని ఆవిణ్ని అప్పటికి ఊరుకోబెట్టేను. ఆ రాత్రి పదకొండున్నర అయింది. నా పనులన్నీ అయేసరికి .... వదిన ఈ రెండ్రోజుల నుండీ యింట్లోకి రాక పని మరీ ఎక్కువై పోయింది. పిల్లలూ ఆయనా భోంచేశాక వదినకి వేరే తీసి కెళ్లి వడ్డించాను. వెంకట్రమణ సినిమాకెళ్లి వచ్చాడు. పదయింది. ఆయనగారికి పెట్టి, తర్వాత నే తిని వరహాలమ్మగారి చంటిపిల్లకి వేణ్ణీళ్లు ఫ్లాస్కులో పోసి—వంటిళ్లు కడిగి .... పొయ్యి అలికేసి .... పెరటి తలుపూ, వీధి తలుపూ తాళాలు వేసుకుని .... మరచెంబుతో నీళ్లు పట్టుకుని యివతల పడేసరికి పన్నెండు టంగని కొట్టింది.

'అమ్మా, అబ్బా .... అయ్యో .... బాధ ....'

నా గుండె దడదడ కొట్టుకొంది. పాపం సుబ్బన్న మూలుగుతున్నాడు. కిటికీలోంచి చూశాను. బాధతో పిల్లాడు అటూ యిటూ పొర్లుతున్నాడు. పిల్లాడి కాళ్ల దగ్గర బుర్ర పెట్టుకుని వరహాలమ్మగారు పడుకుని ఉంది .... ఆవిడ కాళ్ల దగ్గర చంటిపిల్ల గుర్రెట్టి నిద్దరోతోంది. ఇదే నిశి రాత్రి వేళ .... ఇంట్లో అందరూ పడుకునే వేళ .... ఇలా ఓ వారం వరకూ ప్రతిరోజూ .... నే నొక్కర్తెనే మేలుకుని తీవ్ర జ్వర పీడితుడైన ఆ రోగి హృదయ విదారకమైన దీనాలాపన వినేదాన్ని ....

ముచ్చెమటలు పోసేవి, కాళ్ళూ, చేతులూ వణికేవి .... దేనికి నా భయం?

'అమ్మా, ఆ పాప నా పుస్తకాలన్నీ చింపేస్తోంది. మా మేష్టారు కొడుతున్నారు .... వీళ్లింకా ఎన్నాళ్లుంటారే అమ్మా .... పొమ్మని నాన్నతో చెప్పించవే' అనేది మా అమ్మాయి పద్మ—చిన్నది దీనికేం తెలుసు?

'ఆ వరహాలమ్మగారు నన్ను 'వెధవా' అని తిడుతోందే అమ్మా ..... ఉన్న మూడు గదుల్లోనూ ఓ గది వీళ్లే ఆక్రమించారు..... నా ఆట సామాను. తన అలమార్లో పెడితే పెద్దక్క విసిరేసింది. చూడవే అమ్మా .... వీళ్లని ఎప్పుడు పంపించేస్తావే బాబూ' అనేవాడు మా జగన్నాథం — కుర్రాడు, వీడేం ఎరుగు?

'మరి అన్నయ్యకి ఇంత ఇంగిత జ్ఞానం లేకపోయిందేం సీతా .... అయినా పూర్తిగా వాణ్ణి నేను .... కానీ ఆడిం దాటగా. పాడింది పాటగా

తయారుచేసింది నువ్వు. నీదీ తప్పు." అనేది వదిన—నామీద అభిమానంగాని, పాపం ఈవిడేం చేను ?

'ఓ యబ్బో సేసేవోళ్ళుండాలే గాని, ఇంకో ఇంతమంది మనుషుల్ని నేనూ ఇల్లు నింపేద్దును. మా రాజు ఆయన తీస్కొస్తే ఒచ్చాడు గాని ఈయమ్మ ఎలా ఒప్పుకుందీ అంట ? సేతులరి గేలా తోమిపారెయ్యడానికీ దాసీపీనుగ అగోరిత్తోం దనా ? ఓ యబ్బో ఎవరికి తెలియని ఎవ్వార మిది .. ఏమాట కామాటే సెప్పుకోవాల. మునుపు సిక్కని కాపీ నీళ్ళేసేదీ సీతమ్మ .... ఈ ఒరాలమ్మగోరి కుటుంబం దిగడ్డాక నారాయణ నీల్లు నీల్లు ! .... అయినా ఈ సీతమ్మగోరికి ఎంతోపిక యిచ్చాడో ఆ బగుమంతుడు.' అనేది దాసీది అప్పాయమ్మ. వెర్రి పీనుగ, దీనికేం ఒరుగు ?

'సీతా, రెండ్రోజు లనగా బత్తాయిపళ్ళు అయి పోయాయిట .... వీళ్ల పాపకి రెండోమాటుకు హార్లిక్సు అలవాటుట .... అన్నీ నేనే కనుక్కోక పోతే కాస్త నువ్వు కూడ భారం వహించకూడదూ? వాళ్ళు మనింటి కెందుకొస్తారు చెప్పు ?' అనే వారు ఆయన. తెలివితక్కువ మనిషి, నా బాధ ఈయనేం పసికట్టు ? వీటన్నిటినీ మించినవి వరహా లమ్మగారి విమర్శలు.

'ఎలా ఉందే పిల్లాడి ఒంట్లో' అనుకుంటూ పది రోజులనాడు వచ్చారు కాంభోట్లు మేష్టారు.

'శలవు దొరికింది కాదు.... తమ్ముడు కూడా ఉన్నాడు గదా అని తెగించి రాలేకపోయాను .... ఎలా ఉంది సుబ్బన్నకి ?'

వరహాలమ్మగారి తరవాతి అవతారం ఎత్తింది.

'ఎలా ఉందా, ఏడిసినట్టుంది .... ఇక్కడెలా ఉందా, ఆఘోరించినట్టే ఉంది. మే మెలా ఉన్నామా, అడుక్కుతిన్నట్టే ఉన్నాము !'

'మమ్మల్నిక్కడికి వంపేసి మడదుక్కలా కాలం వెళ్ళబుచ్చుదామన్న దుర్బుద్ధి కాకపోతే .... ఈ పాడు కొంపలోకి మమ్మల్నెందుకు పంపించారు చెప్పండి ?

సమయానికి పిల్లలు ఎవరూ యింట్లో లేరు... వదిన కూడా అదృష్టవశాత్తూగా యింట్లో లేదు... నేను పెరట్లో ఆవిడ అంట్లు గిన్నెలు తోము తున్నాను. ఆవిడ గిన్నెలు వేర్పు, అవి దాసీది తోమ డానికి వల్లకాదు. ఆవిడకి అన్నీ అక్కడ అమర్చి పెడితే అదీ ఆచారం ఒలకబోస్తూ కుంపటిమీదకి గిన్నెలు ఎక్కించి దింపుకుంటుంది. ఆవిడ శ్రీ కూర్మంలో వీరవైష్ణవం పుచ్చుకొందిట .... ఎవళ్లచేతా మీ తినదు. (.... 'చీవాట్లూ, చెప్పు దెబ్బలూ తప్ప' అంటుంది వదిన !')

'ఏమిటంత పెద్ద గొంతుక, ఎవరేనా విన గలరు .... బాగుండదు, ఊరుకో'

'ఏం చేస్తారేం గాడిద గుడ్డు ? నాకు ఒళ్ళు మండిపోయాక నా నోటికి ఇంకేమిటి అడ్డు ?'

కాంభోట్లుగారి ప్రయత్నమేం కలసిరాలేదు కాబోలు ......

'ఏం పిల్లలు, ఏమి అల్లరి ! అయ్యోరామ ! ఆ పడింది పిడుగా, పిప్పళ్ల బస్తానా అనుకొనే టంతగా దుబ్బుని గెంతులు, ఆ అరిచింది ఉరుమా, ఉలూకమా అన్నంతగా కూతలు, నా ముందు నుంచే తైలాటలు, నా మీదనుంచే వాలు మొగ్గలు... పిల్లలుటండీ బాబూ పిశాచాలు గానీ !'

ఈ మాటలు వింటున్న నాకు ఒళ్ళు మండి పోయింది. నా యింటికే [illegible]

కుంటూ నా పిల్లల్ని దుమ్మెత్తిపొయ్యడానికి ఇదె వర్తి ? ఇంచుమించు లేచి రాబోయాను. నా ఇంగితం నన్ను చెయ్యి పట్టుకు కూచోపెట్టింది.

'ఇక ఈయనగారి వెధవ చెల్లెలుంది .... 'తూ' అంటే తుపాకి నేస్తుంది. మనతో మాట్లా డదు. భూమికి అల్లంత ఎత్తున నడుస్తుంది.... దేన్ని చూసుకునో ఆ గర్వం నాకు అర్థంకాదు.'

'వీళ్ళందరితో మనకేం వని .... సమయానికి వచ్చి సదుపాయం చేసినవాడు ఆయన .... ఇంట్లో చాకిరీ చేసేది యిల్లాలు .... వీళ్లిద్దరూ మన్ని చల్లగా చూస్తే చాలదూ ?'

'ఓ చూడకేం ? ఈ యింటి ఛాయలకు రాడా నికి భయపడి ఆ మొగాయన దగ్గిరుండి వేయించు కుని క్యాంపులమ్మట తిరుగుతూ ఉంటాడా .... ఇక ఇల్లాలినే చెప్పుకోవాలి .... పైకలా చాపకింద నీరులా ఉంటుంది కాని చెప్పదగిన చుప్పనాతి .... పది మాటలకి ఒక్క చూపు చూస్తుంది...... అంతే .... అందరూ భస్మం కావలసిందే. ఏదో చేసుకుపోతాం దనుకుంటే ఆ మనసులో నామీద ఎంత అక్కసుందని !'

'అన్నిట్నీ భరించగలను. ఉడయవరుల దగ్గర ఒప్పందమే, అనాచారపు కూడు. ఎలా సహించను? ఆ బజారు గుడ్డలతోనే అందరూ భోజనానికి కూచుంటారు. ఈ చాకింటి మడతలతోనే ఈ సుకుమారి వడ్డిస్తుంది. (శ్రీమన్నారాయణమూర్తీ, తండ్రీ ఆఖరికి ఎలాంటి మాలకొంపలోకి తెచ్చి పారేశావయ్యా !

'ఇవన్నీ ఒక ఎత్తు .... సుబ్బడి జ్వరం ఒక ఎత్తు .... బంతిలాంటి పిల్లడు బల్లిలా అయిపోయాడు .... వెర్రినాన్న లేవడ మెప్పుడో .... జ్వరం హెచ్చడమే గాని తగ్గు మొహం పట్టేట్టు లేదు ..... ఆ వైద్యుడు వచ్చి వాడు వంద కబుర్లు పంపినా వచ్చి చావడు.

'ఇంతకీ ఎప్పుడేం కావాలో కనుక్కునే దిక్కు లేదిలెండి ?'

ఆవిడ ఏడుస్తోంది .... కాంభోట్లుగారు ఓదారుస్తున్నారు.

అప్పుడే వచ్చారు కాబోలు, ఆయన గొంతుక వినిపిస్తోంది.

'అయినా యీ డాక్టరుతో ఇంక లాభం లేదమ్మా .... మొదట మలేరియా అన్నాడు. తర్వాత న్యుమోనియా అన్నాడు. ఇంకో అతను ఈ ఊళ్లో ఉన్నాడు. ఫారెన్ రిటర్న్‌డ్. వెళ్లి పిలుచుకువస్తాను. మరేం భయపడకండి, తగ్గి పోతుంది....'

ఆయన క్యాంపు నుంచి ఎప్పుడొచ్చారో నాకు తెలియదు. కొత్త డాక్టర్ని పిలవడానికి ఎప్పుడెళ్లారో నాకు తెలీదు, ఏం చెప్పను !

వీళ్ల వాలకమే అంత, కంగారు మనుషులు !

* * *

కొత్త డాక్టరుగారు రెండ్రోజులకిగాని రాలేదు. అప్పటికి కాంభోట్లుగారు వెళ్లిపోయారు, ఏదో పనుందిట .... తమ్ముణ్ణి కూడా తీసుకెళ్లి పోయారు. .... అవాళ మధ్యాహ్నమే ఈయనా కేంపుకి వెళ్లారు .... ఆ సాయంకాలపువేళ ఆ డాక్టరు గారు వచ్చి అరగంటసేపు రోగిని పరీక్షించారు. మర్నాడు మధ్యాహ్నం కంపౌండరును వెంట బెట్టుకు వచ్చారు. డాక్టరుగారు రోగికి ఏం మె.దం జేశాడో నాకు తెలీదుగాని కంపౌండరు మాత్రం మా కందరికీ చిటుకూ, చిటుకూ మని తలో ఇంజక్షనూ పొడిచేశాడు.

డాక్టరుగారు నన్ను పెరట్లోకి తీసుకెళ్లారు....

'చూడండమ్మా—నాకు మొదట్నుంచీ అను మానంగానే ఉంది, ఈ రోగం యిదీ అని .... కాని నిదానంగా పరీక్షిస్తేగాని చెప్పలేం గదా .... ఇవా ళ్టికి రూఢిగా తెలిసింది .... పంతులుగారు చూస్తే ఊళ్లో ఉన్నట్టు లేరు, మీరు చూస్తే పిల్లా జల్లతో ఉన్నట్టున్నారు. అందుకే ఎందుకేనా మంచిదని ఇంట్లో అందరికీ ఇంజక్షన్లు యిప్పిం చాను. అయినా ఈసారి వచ్చిన మందులు అంత 'పవర్‌ఫుల్' గా ఉన్నట్టు కనబడవు ... ఇంజక్షన్ల దారి ఇంజక్షన్లదే. రోగాల దారి రోగాలదే .....కొని తెచ్చుకున్నట్టు ఈ భయంకర వ్యాధిని ఇంట్లో తెచ్చి ఎందుకు పెట్టుకున్నారమ్మా నాకు తెలీక అడుగుతాను ? సరేగాని, ఇప్పుడు మూడోవారమా, ఇంకో పది రోజులలోగా యిటో అటో తేల్చే స్తుంది .... ఇప్పుడే వ్యాధి ఎక్కువగా సంక్రమించ డానికి అవకాశం కూడా ఉంది .... కాచి చల్లా ర్చిన నీళ్ళుగాని ముట్టుకోవద్దు. పిల్లల్ని ఆ దరి దాపులకి వెళ్లనియ్యొద్దు .... ఏంజబ్బో విన్నారు కదూ, టైఫాయిడు !'

నా శరీరం ఒక బట్ట అయినట్టూ ఎవరో ఒక చుక్క జీవరసం లేకుండా పిండేసినట్టూ అయిపో యింది, ఈమాట వింటూంటే. నేనా పెరట్లోనే, చీకట్లోనే, ఆ చెట్టు మొదట్లోనే కూలబడిపో యాను. ఒక్కొక్క పేరు వింటే, ఒక్కొక్క తీరు చూస్తే బ్రతికున్నవాళ్లూ కొంద రికి భయోత్పాతాలు ఉంటాయి మరి !

నేను పుట్టిన పన్నెండేళ్లకి మా తమ్ముడు పుట్టేడుట ..... అమ్మా, నాన్నా వాణ్ణి కంటికి రెప్పలా కాపాడ్డంలో చిత్రమేమీ లేదు ! నేను ఎత్తుకుమోసి ఉత్తుత్తిపాలు పోసే రబ్బరు

31 వ పేజీ చూడండి




'మీ రూంమ్మేటు నిద్రలో మహా స్వరాజ్యం స్వరాజ్యం అంటున్నాడు ... దేశభక్తుడా?...'

'కాదు; అది వాడి ప్రేయసి పేరు ;;...'

# రకరకాల కుర్మాలు

యం. ప్రభరాయల్

కుర్మా మనం రోజూ చేసుకోవాలి అంటే కుదరదు. చెయ్యడమూ ఆలస్యము అవుతుంది. ఖర్చు ఎక్కువ. డిన్నరు టైములో కుర్మా ఒక అయిటముగా పెడితే చాల బావుంటుంది. కుర్మా చెయ్యడానికి అన్ని రకాల కూరలు బావుండవు. బంగాళాదుంపలు, లేత ముప్వ వంకాయలు, కాలీప్లవర్, బఠాణీ, చిక్కుడుకాయలు కుర్మాకు బావుంటాయి.

కుర్మా కారంగా, ఘాటుగా ఉండా లనుకొనేవారు మసాలా సామాను నూరి వేసుకోవాలి. కారం అక్కరలేనివారు నూరకుండా విడిగా వేయవచ్చును. కుర్మాకు కొబ్బరిపాలు వేస్తే రుచిగా, కమ్మగా బావుంటుంది. మజ్జిగ కూడా చిక్కగా ఉండాలి. ముందు బంగాళాదుంపల కుర్మా చెయ్యడం చెపుతాము.

కావలసిన పదార్థములు :—

- ½ వీశె బంగాళాదుంపలు.
- 3 పెద్ద నీరు ఉల్లిపాయలు,
- 6 పచ్చిమిరపకాయలు.
- 4 లవంగాలు.
- 4 యాలక్కాయలు.
- 4 దాల్చించెక్క ముక్కలు.
- ఆకుపత్రి కొంచెము.
- చిన్న వెల్లుల్లిపాయ.
- చిన్న అల్లంముక్క.
- 2 టేబుల్‌స్పూన్‌లు నెయ్యి.
- 2 టేబుల్‌స్పూన్‌లు నూనె.
- 1 గ్లాసు మజ్జిగ.
- 1 చిన్న కొబ్బరిముక్క.

ముందు బంగాళాదుంపలు ఉడకబెట్టాలి. అవి ఉడికాక తొక్కలు వొలచి ముక్కలుగా తరిగి ఉంచుకోవాలి. ఉల్లిపాయలు పొడుగ్గా, సన్నగా తరుక్కు ఉంచుకోవాలి. పచ్చిమిరపకాయలు కూడా మధ్యకు చీల్చి ఉంచుకోవాలి. వెల్లుల్లిపాయ, అల్లం ముక్క మెత్తగా నూరి ఉంచుకోవాలి. కొబ్బరిచిప్ప కోరుకుని, ఆ కోరును రోట్లో వేసి మెత్తగా రుబ్బాలి. రుబ్బగా వచ్చిన గుజ్జుని తెల్లని గుడ్డలో వేసి పిండితే పాలు వస్తాయి. అవి ఒక గిన్నెలో ఉంచుకోవాలి.

పొయ్యిమీద వెడల్పాటి కళాయి గిన్నెను ఉంచి అందులో నూనె, నెయ్యి వేసి కాగాక యాలక్కాయలు, లవంగాలు, దాల్చిం చెక్క, ఆకుపత్రి ఆ నూనెలో వేసి వేగనివ్వాలి. అవి వేగినప్పుడు కమ్మని వాసన వస్తుంది. అప్పుడు తరిగి ఉంచుకున్న ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిరప ముక్కలు వెయ్యాలి. ఉల్లిపాయ ముక్కలు దోరగా వేగాక బంగాళాదుంప ముక్కలు వేసి తర్వాత గ్లాసుడు మజ్జిగ, కొబ్బరిపాలు వెయ్యాలి. నూరివుంచిన అల్లం, వెల్లుల్లి ముద్ద, తగినంత ఉప్పు, పసుపు అందులో వెయ్యాలి. గరిటతో కలియబెడితే ముక్కలు, మసాలా సామాను అన్నీ కలుస్తాయి. మూతవేసి సన్నని సెగమీద ఉడకనివ్వాలి. కొంచెం దగ్గరగా మగ్గనిచ్చి క్రిందకు దించాలి.




## వంకాయ కుర్మా

వంకాయ కుర్మా చెయ్యడానికి లేతవి, చిన్నవి, ముప్వ వంకాయలు బావుంటాయి. వంకాయలు గుత్తి వంకాయకు కోసినట్లే కాయ విడిపోకుండా నిలువుగా రెండు వైపులా కొయ్యాలి. బంగాళాదుంపకు కుర్మాకు చెప్పిన మాదిరిగా అన్ని సరుకులు అమర్చుకోవాలి.

పొయ్యిమీద కళాయి గిన్నె పెట్టి నూనె, నెయ్యి వేసి కాగినాక యాలక్కాయలు, దాల్చిం చెక్క, లవంగాలు, ఆకుపత్రి వేసి వేగాక ఉల్లిపాయ ముక్కలు, పచ్చిమిరప ముక్కలువేసి దోరగా వేగనిచ్చి వంకాయలు వెయ్యాలి. తర్వాత మజ్జిగ, కొబ్బరిపాలు పోసి అందులో నూరిన అల్లం, వెల్లుల్లి ముద్ద, ఉప్పు, పసుపు వేసి వంకాయలు, మసాలా సామాను కలసేలాగ కలిపి మూత వెయ్యాలి. సెగమీద ఉడకనివ్వాలి. మంటమీద అయితే వంకాయ లోపల ఉడకకుండా మాడు అంతా మరిగిపోయి కుర్మా రుచి ఉండదు. కూర కొంచెం దగ్గరగా మగ్గనిచ్చి క్రిందకు దించాలి.

## కాలీఫ్లవరు, బఠానీ (లేక) చిక్కుడు కుర్మాలు

కాలీఫ్లవర్ పువ్వు చిన్న చిన్న పువ్వులుగా కోసుకొని ఉంచుకోవాలి. పచ్చి బఠానీ ఉంటే గుప్పెడు పచ్చిబఠానీలు లేదా కాసిని చిక్కుడుకాయలు మంచివి ఏరి ఉంచుకోవాలి. బంగాళాదుంపల కుర్మాకు చెప్పిన మాదిరిగా సరుకులు అన్నీ అమర్చుకోవాలి.

పొయ్యిమీద కళాయి గిన్నె పెట్టి నూనె, నెయ్యి వేసి కాగాక యాలక్కాయలు, లవంగాలు, దాల్చినచెక్క ముక్కలు వేసి దోరగా వేగాక కాలీఫ్లవర్ ముక్కలు, బఠానీ లేక చిక్కుడుకాయలు వెయ్యాలి. మజ్జిగ, కొబ్బరిపాలు పోసి అందులో అల్లం, వెల్లుల్లి నూరిన ముద్ద, ఉప్పు, పసుపు వేసి కలియబెట్టి మూత వెయ్యాలి. సన్నని సెగమీద ఉడకనిచ్చి దగ్గరగా మగ్గనిచ్చి దించాలి.

కుర్మాలో కారం ఎక్కువగా కావాలనేవారు మసాలా నూరి వేసుకొని కారం కూడా వేస్తే బాగా కారంగా ఉంటుంది. కుర్మా చెయ్యడం కొంచెం [illegible] రుచిగాను, [illegible]

## బొట్టుమచ్చ : చికిత్స

బొట్టుమచ్చ కుంకుమశరీరతత్వానికి పడకపోవటం వల్ల వస్తుంది. బయట చిలర అంగళ్ళల్లో అమ్మేకుంకుమలు వాడితే కూడా వస్తుంది. ప్రతి సోదరీమణి కుంకుమ తయారు చేయటం నేర్చుకోవాలి. మనం తయారు చేసుకున్న కుంకుమ వాడితే ఆ విధంగా పుళ్ళు పడవు అని నా అనుభవంతో చెప్తున్నాను.

ఈ పుండు పడుతూంటే గనుక వెంటనే మీరు పెట్టుకొనే కుంకుమ మార్చి ఇంకొక రకం కుంకుమ పెట్టుకోండి ఈ పుండుపడితే త్వరగా మానాలి లేకపోతే అసహ్యకరంగా కనపడుతుంది అశ్వత్థామకుమల్లే. ఈ పుండు మానటానికి మందు చెప్తాను. ప్రతి ఇంట్లోను ఏదో ఒక రోజు కొబ్బరికాయ కొడ్తారు. ఆ కొబ్బరి పెంకు చిప్ప)ను తీసి కడి నిప్పులలో వేయండి. అది కొద్ది సేపటికి అంటే రెండు, మూడు నిముషాలకు మండుతుంది దానిని తీసి అంటే మండుతుండగానే ఒక పేటులో బోర్లించండి. ఆవిధంగా బోర్లించినప్పుడు మధ్యలోంచి నూనె కారుతుంది. ఆ నూనెను తీసి పుండుమీద రాయండి. అయిదు ఆరు రోజులకి పుండు తగ్గుముఖం పడ్తుంది. దానికి తగ్గకపోతే ఇంకొకటి చెప్తాను.

వసకొమ్ము కాల్చి పొడిచేయండి. పొడి మెత్తగా ఉండాలి. ఆ పొడిని తమలపాకు రసంలో కలిపి రాయండి. దీనితో అయితే పదిరోజులలో పూర్తిగా తగ్గుతుంది. ఈ విధంగా పుండు తగ్గేటప్పుడు మచ్చపడే అవకాశం ఉంది. ఈ మచ్చ పడకుండా అంటే పుండు పెచ్చు ఊడినతరువాత కొద్దిగా తేనె రాయండి. తేనె కనుబొమ్మలకి కాని, తల వెంట్రుకలకి కాని తగలకూడదు తగిలాయా తెల్లగా అవుతాయి. ఆ వెంట్రుకలన్నీ అది మాత్రం జాగ్రత్త వహించాలి. సయంగా తయారు చేసుకున్న కుంకుమ అయితే పుండు పడదని వ్రాశానుకదూ అది తయారు చేయుటం కూడా ఇలాగే చెప్తాను. వీశ పసుపు కొమ్ములకి చెప్తాను. ఏకంగా ఒక పెళ్లికి సరిపోయేటంతగా చెప్తున్నాను అని అనకోవద్దు. మీకు కావలసిన పాళ్ళల్లో కలుపుకోండి.

కావలసిన వస్తువులు : 1 వీశ పసుపు కొమ్ములు, ఒకటిన్నర తులం కుంకుమ రాళ్ళు, (చిన్నాలు రంగు అన్నా కూడా బజార్లో ఇస్తారు) కొద్దిగా ఇష్టమైన రంగు.

తయారుచేసే విధం : వీశ పసుపుకొమ్ములు రాత్రి నీళ్ళల్లో నానబోయాలి. ప్రొద్దుటే నీరెండలో ఎండ పోయాలి. ఆరినతరువాత ఆ పసుపు కొమ్ముల పొట్టు గీసేయాలి. సామాన్యమైన రోలు అయితే వీశ పసుపు కొమ్ములు అయిదు ఆరు, వాయిలలో నలుగుతాయి. అంటే పసుపు కొమ్ములు ఆరుభాగాలు చెయ్యాలి. ఒక వాయి వేసి మెత్తగా దంపాలి. కొద్దిగా పొడి అయింతరువాత ఈ కుంకుమ రాళ్ళల్లో ఆరవ వంతు వేసి దంపాలి. పొడి చాలా మెత్తగా నలగాలి. ఆ విధంగా ఆరు వాయిలు దంపాలి. ఆరు వాయిలు దంపటం అయిపోయేటప్పటికి కుంకుమ రంగు అంతా అయిపోవాలి. ఆ పొడి అంతా కలిపి ఒక పళ్లెంలో పోయాలి.




ఒక మూతి వెడల్పుగిన్నె తీసుకొని దానికి ఒక పల్చని గుడ్డ వాసిన కట్టాలి. గ్లాస్కో గుడ్డగాని 80 నెంబరు చీరలో ముక్కగాని అయితే బాగుంటుంది. పొడి కొద్దికొద్దిగా తీసి గుడ్డమీద పోసి చేతిలో బాగా రాయాలి. ఈ విధంగా గుండ (పొడి) అంతా వస్త్రకాయం చెయ్యాలి. మొత్తం అంతా వస్త్రకాయం చేసింతరువాత కొద్దిగా మొరుం మిగుల్తుంది. దానినితీసి ప్రక్కన పెట్టండి. కుంకుమకి తగినంత సెంటు (ఇష్టమైన వాసనది) కలిపి మళ్లీ వస్త్రకాయం చేసిన గుడ్డ బిగించి మూతకట్టెయ్యాలి. ఒక వారం తరువాత తీసి సీసాలో పోసుకొని ఉంచుకోవాలి. దీనిని ఇంకా రకరకాలుగా తయారు చేస్తారు. మొరుం కొద్దిగా మిగిలింది కదూ దానిని మెత్తగావిసిరి దేముని పూజకి వినియోగిస్తే మొరుం కూడా వృధాపోదు. ఈ విధంగా తయారుచేసిన కుంకుమ అయితే పుళ్ళు పడవు.

ముందలపర్తి ప్రభ (కర్నూలు)

## స్త్రీలూ సమానహక్కులు

స్త్రీలకు గాని, మరెవరికి గాని హక్కులను ఒకరు ఇవ్వటం మరొకరు పుచ్చుకోవటం అంటూ ఉండదు. హక్కు అనే దానికి అర్థం అది. ప్రతి జీవికి హక్కులతో బాటు బాధ్యతలు కూడా ఉంటవి. ఈ రెంటికి సామరస్యం కుదుర్చుకొని జీవితయాత్ర సౌఖ్యదాయకంగా గడుపుకొనుటకు చతురత అవసరం.

పురుషులకంటె స్త్రీలకు హక్కులు తక్కువగా ఉన్నాయనటం కంటె స్త్రీలు తమ హక్కులను నిలదొక్కోగి ఉండలేక పోతున్నారనటం వాస్తవం. ఈ పరిస్థితికి సమాజమే బాధ్యత వహించ వలసి ఉంటుంది. 'సిరజ పెళ్లి'లో వివరములు చాలా స్పష్టంగా ఉన్నవి.

స్వతంత్రంగా ఆలోచించగల సామర్థ్యం మన దేశంలో వి కొద్ది మంది వ్యక్తులతో తప్ప మరి ఎవ్వరికి లేదనటంలో అతిశయోక్తి బొత్తిగా లేదు. ఆడ పిల్లలను ఏదో ఒక బజారు వస్తువు మాదిరి చూస్తున్నారు తలిదండ్రులు. వీలైనంత వరకు చదివించి తమకు మంచిగా తోచిన సంబంధం చూసి పెళ్లి చేసేయుటం తప్ప మరొక మార్గం వారికి తెలియదు. ఈ పద్ధతి వల్ల స్త్రీ, పురుషుడి మీద పూర్తిగా ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. దానివలన ఎన్ని అనర్థము లయినా సంభవింప వచ్చును.

సమాన హక్కులను చలాయించ దలచు ప్రతి స్త్రీకి కొన్ని విషయములు అత్యవసరములు.

(1) వీలైనంత పెద్ద చదువు.

(2) చదువుకు తగిన ఉద్యోగం. లేదా స్వతంత్రంగా జీవితము గడుపుటకు కావలసిన ఆర్థిక స్తోమత.

(3) వివాహం అవసరమా ? అను ప్రశ్నకు సమాధానం కుదుర్చుకోగల బుద్ధి.

4 పెండ్లి చేసుకోదలచిన ఎడల తగిన వరుని కనుగొనగల నైపుణ్యము.

(5) దాంపత్య జీవితంలోని ఒడుదుడుకులను పూర్తిగా విమర్శించి సర్దుకు పోగల చతురత.

వీటిలో ఏది లోపించినా 'రథంబు డింగె'! (1), (2) తల్లి దండ్రుల బాధ్యత. మిగతవితనవి.

ఈ సమస్యను వేరే సులభ మార్గాలు గాని ప్రభుత్వ శాసనాలు గాని పరిష్కరించలేవని నా అభిప్రాయం.

అనంత (మద్రాసు)

* * *

స్త్రీలకు సమాన అవకాశములు సంఘములో, లేకుండుటయ్యే ఇందుకు మూల కారణము. విద్య, వృత్తి మొదలయిన సమస్త రంగాల లోనూ స్త్రీలకి సమాన అవకాశములు కలిగించి స్త్రీలకు సంఘములో విలువ ఇచ్చిన నాడు పై సమస్యలు పరిష్కార మవుటకు అవకాశ మున్నది. అయితే ఈ హక్కులు కొందరి విషయములో వమ్మై పోవడానికి కారణం, ఆ స్త్రీలు ఆ హక్కులను అర్థం చేసుకోవడం, బాధ్యతా రహితులుగా ప్రవర్తించడం, సంఘములో ప్రోత్సాహ కరమైన వాతావరణం లేక పోవడమే.

అంతేకాక స్త్రీలు, పురుషులు కూడ గమనించ వలసిన విషయ మేమిటంటే—

స్త్రీకి సమాన హక్కులు ఇచ్చినా, వాటిని దుర్వినియోగ పరుస్తున్నారని పురుషులు, పురుషులు మాకు సమాన హక్కులు ఇచ్చుట లేదని స్త్రీలూ, ఒకరిపై నొకరు విమర్శించు కొనుట కంటే, ఇరువురు కూడ తమ బాధ్యతల నెరిగిన వారై ఒకరి నొకరు అర్థం చేసుకొని ప్రవర్తించిన నాడు ఈ సమాన హక్కులలో, నిరంకుశత్వములు అన్న వాటిని వేరే పరిష్కరించ వలసిన పనేలేదు. ఇవి నా అభిప్రాయాలు. వాటో రచయిత్రి, పాఠకులూ ఏకీభవిస్తారనుకుంటాను.

కొట్టిక్కి మాలతీ పట్నాయక్ (సాలూరు) ★

## గ్రహస్థితి

మిధునంలో రాహువు, ధనుస్సులో సూర్య అంగారక బుధ కేతువులు, మకరంలో శుక్ర శనులు, మీనంలో గురువు, మేష, వృషభ మిథున కర్కాటకాలలో చంద్రుడు.

**27-12-1963 శుక్రవారము మొదలు 2-1-1964 గురువారము వరకు**




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

### మేషం:

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

ప్రస్తుతం మీ గ్రహస్థితి పూర్తి బలంగా కనుపించదు. క్రొత్త ఆలోచనలను అమలు జరపటంతో ఆటంకాలు వస్తవి. సంఘంలో తోటివారు మీ మాటను సాగనీయకుండా అడ్డుపడతారు. ధనాదాయం మామూలుగా ఉంటుంది. మీ పార పొట్లు చాలావరకు సర్దుబాటు అవుతవి. మొత్తం మీద ప్రోత్సాహం తక్కువ. చిన్న చిన్న కార్యక్రమాలే క్రమంగా పెరుగుతవి. మీ ఆరోగ్యం తృప్తికరంగా ఉండదు. ప్రస్తుతం విలువగల వస్తువులు, ముఖ్యమైన కాగితాలు మొదలైనవి ఇతరుల చేతికి అందకుండా జాగ్రత్తపడటం అవసరం. వ్యవహార సందర్భాలలో ఎదటివారి అభిప్రాయాన్ని అనుసరించవలసిన పరిస్థితి ఏర్పడగలదు. అధికంగా ధనం వినియోగించే పనులలో ప్రవేశించి బాధ పడతారు. 27, 28 తేదీలలో మిత్రలాభం, శుభ కార్య ప్రయత్నాలు.

* * *

### వృషభం:

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

క్రమంగా కాలం కలిసి వస్తుంది. మీ అభివృద్ధికి, అనుకూలానికి అభ్యంతరం కలిగించేవారు తొలగిపోతారు. అధికారుల ప్రాపకం లభిస్తుంది. స్నేహితుల ప్రసంగాలలో అనుకోకుండా జరిగే సంఘటనలు మీ మనస్సును బాధిస్తవి. పుణ్య కార్యాలు నెరవేరుతవి. ఆస్థివృద్ధి ప్రయత్నాలు అనుకూలిస్తవి. బంధు మిత్రుల వద్ద నుంచి ఎదురు చూస్తున్న వార్తలు ఆలస్యం కాదగిన సమయం. ఇతరులకు సలహా చెప్పటం, భారం పైన వేసుకొని సహాయం చేయటం మొదలైన పనులు ఎక్కువ. మీ వృత్తిలో శ్రమకరమైన పనులు ఉంటవి. మనోధైర్యంతో అన్ని రంగాలలోను ముందుకు పోగలుగుతారు. ప్రీతిగా పలకరించి అయినవారి మధ్య కలహాలు రేపేవారు ఉంటారు. జాగ్రత్తగా ఉండండి. పోటీ వ్యాపారం /ంటి పనులకు పోవద్దు. 28, 29 తేదీలలో విలువగల వస్తువులు కొంటారు. గృహలాభం.

* * *

### మిధునం:

**(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. ఏ సందర్భంలో ఎవరిని కలవబోయినా అభిప్రాయ భేదాలకు అవకాశం ఏర్పడుతుంది. ఈ సమయంలో ఒకటికి రెండుగా ఖర్చుపెట్టినాకూడా సంతృప్తిగా పనులు జరుగకపోవచ్చు. వీలు ఉన్నంతలో ప్రశాంతంగా గడపటానికి ప్రయత్నించండి. మీ స్థానంలో మీకు గౌరవ ప్రతిపత్తులు లభిస్తవి. వృత్తి వ్యాపారాలలో ప్రత్యేకత ఉండదు. కాని, శ్రమ, చిక్కులు ఉండవు. కుటుంబంలో శుభకార్య ప్రయత్నాలు అనుకూలిస్తవి. క్రొత్త వ్యాపార, వ్యవహారాలలో దిగవలసిన సందర్భాలలో ముందు యోచన, విదానము అవసరం. సుఖ సౌఖ్యాల కోసం ఖర్చులు పెరుగుతవి. ఏ సందర్భంలోను అధికానికి ఆశపడి అందుబాటులోనున్న దానిని వదులుకోవద్దు. కష్టవార్తలు తెలియు సూచనలున్నవి. యంత్రాలు, ఆయుధాలు మొదలైనవానిని వినియోగించటంలో అలక్ష్యంగా ఉండవద్దు. 29, 30 తేదీలలో అధిక శ్రమ, దండుగ ఖర్చు.

* * *

### కర్కాటకం:

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

ప్రస్తుతం ముఖ్యమైన కొన్ని మార్పులు రాతగిన కాలం. సాధారణంగా శ్రమ కనుపించినా ముందు ముందు మేలు కలుగుతుందనే ఆశాభావం తోస్తుంది. పెట్టుబడి రూపంలో ధనం వినియోగిస్తారు. ప్రయాణం చేయవలసి వస్తుంది. అతి స్వల్ప శ్రమతో అత్యధిక లాభాన్ని పొందే చట్టా వ్యాపారం వంటి పనులలో ప్రవేశించవద్దు. కుటుంబంలో మాట పట్టింపులు, అభిప్రాయ భేదాలు వస్తూ ఉంటవి. అయితే అప్పుడప్పుడే సర్దుబాటు అవుతూ ఉంటవి. పై అధికారులతో స్నేహ సంబంధాలను వృద్ధి చేసుకొన గలుగుతారు. బాహ్య విషయాలలో పరాయి వ్యక్తుల వల్లనే ఉపకారం లభిస్తుంది. వృత్తిలో ధైర్యము, సమయంలో వెంటనే ఒక నిర్ణయం చేయగల శక్తి అవసరం. 30, 31 తేదీలలో అకస్మాత్తుగా వస్తు నష్టము, పరములయందు బాధ.

* * *

## ఈ వారము ధరలు

కందుల ధర పెరుగుతుంది. మిర్చి ధర కూడా సాధారణమైన తేజీవచ్చి నిలుస్తుంది. బెల్లం ధర పెరుగుతుంది. నెన్న, నేయి రకాల ధరలు తగ్గుముఖంలో ఉంటవి. నూనెల ధరలలో పెద్దమార్పు ఉండదు.

### సింహం:

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

ప్రస్తుతం సాటివారిలో, సంఘంలో మీ మాటా, మీ చేయి పైగా ఉంటుంది. దైవానుగ్రహంవల్ల మానసికంగా సహనము, సమయంలో ఎలా నడుచుకొనవలయునో ఆ యోచన లభిస్తవి. బంధు మిత్రులు తాము పడే చిక్కులకు మిమ్ములను కారణంగా భావించగల సమయం. ఆ విషయంలో జాగ్రత్త అవసరం. కుటుంబంలో అనారోగ్య కారణాలవల్ల ఖర్చులు పెరుగుతవి. ఉద్యోగ వృత్తులలో మీరు ముందు జాగ్రత్తలో వ్యవహరించ గలుగుతారు. గౌరవపూర్వకంగా పని పెరుగుతుంది. కుటుంబములో శుభము, సంతోషము కలసి రాతగిన సమయము. ఇంతకుముందు ఉంటున్న ఆందోళన, అసంతృప్తి తొలగి మానసికంగా ధైర్యము, కార్యరంగంలో ఉత్సాహము కలుగుతవి. 31, 1 తేదీలలో ధన వ్యయము, సంతోష వార్తలు.

* * *

### కన్య:

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా.)**

గ్రహబలం బాగున్నది. ఒకప్పుడు ఏర్పడిన ప్రతిబంధకాలు, విరోధాలు తొలగిపోయి మీ ముందు కార్యక్రమాలకు ఒక మార్గం లభిస్తుంది. స్నేహితుల సహాయం లభిస్తుంది. కోర్టు కచేరీలలో వ్యతిరేక వాతావరణంలో మార్పు వస్తుంది. చేతికి రావలసిన ధనం సకాలంలో అందుకో గలుగుతారు. పిల్లలమూలంగా సంతోషము, సంతృప్తి లభిస్తవి. వృత్తి వ్యాపారాలలో అభివృద్ధికి మార్గం కలుగుతుంది. స్వవిషయంలో సుఖం తగ్గే అవకాశాలున్నవి. ఇతరులకు అప్పులు ఇచ్చి అవస్థ పడవలసిన అవసరం రాకుండా చూచుకొనండి. ఒకరిద్దరు స్నేహితులతో కలహసూచనలకు అవకాశాలున్నవి. సాటివారిలో మీ మాటకు విలువ లభిస్తుంది. అలంకారాలు, ఆభరణాలు మొదలయినవి కొంటారు. అనుకొన్నవన్నీ అనుకూలించకపోయినా జరిగేవి ఉపయోగంగా ఉంటవి. 1, 2 తేదీలలో ఆదాయంలో పెరుగుదల, ప్రయాణ సూచన, మిత్రలాభము.

## తుల :

(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

ప్రస్తుతం మానసికంగా సంఘర్షణ అధికం అవుతుంది. వృత్తిలో శ్రమ పెరుగుతుంది. అంత కన్నా ఈ సమయంలో తటస్థపడే మనుష్యులతో పేచీలు రాకుండా చూచుకొనటం అవసరం. మీవల్ల పని జరుపుకొంటు నిష్ఠురం మాట్లాడేవారు ఉంటారు. ఆదాయం కొన్ని సమయాలలో విశేషంగా ఉన్నట్లు తోచినా మధ్య మధ్య ఆటంకాలు ఏర్పడుతూ ఉండటంవల్ల సర్దుబాట్లు విషయంలో శ్రమపడవలసి ఉంటుంది. మాట పట్టింపులవల్ల మనశ్శాంతి తగ్గే అవకాశాలున్నవి. శుభకార్య ప్రయత్నాలు, ప్రసంగాలు సాగుతవి. బంధువులవద్దనుంచి వార్తలు తెలుస్తవి. గౌరవప్రదమైన బాధ్యతలను పైన వేసుకొని నిర్వహించగలుగుతారు. ప్రయాణాలు చేస్తారు. 1, 2 తేదీలలో వృత్తిలో అభివృద్ధి, వ్యవహార అనుకూలత.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

వృత్తిలో గాని, కుటుంబ విషయాలలో గాని ఏవిధంగాను లోటుపాట్లు అనేవి ఉండవు. ఆదాయ వ్యవహారాలలో శ్రమపడకుండా పనులు జరుగుతవి. ధనం విశేషంగా పెట్టుబడి పెట్టతగిన భారీ కార్యక్రమాలకు అవకాశం లభిస్తుంది. ఆలోచనలు కూడా చాలావరకు ముందుకు సాగుతవి. మనస్సు డోలాయమానంగా ఉంటుంది. కార్యక్రమాలు సాగుతూ ఉంటవి. ఒక సమయంలో చాలా ఉత్సాహం, మరొక సమయంలో చాలా నిరుత్సాహం తోచగల సమయం. శారీరకంగా అశక్తత, అనారోగ్యము సూచించతగిన కాలం. మంచి స్నేహం లభిస్తుంది. చాలా కాలంగా సాధించజాలని ప్రయత్నాలకు పర్యవసానం కనుపిస్తుంది. ఇతరుల భారం పైన వేసుకొనవద్దు. 31, 1 తేదీలలో కార్యసిద్ధి, పదిమందిలో గౌరవం.

## ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

చాలాభాగం బరువు బాధ్యతలు తగ్గుతవి. వృత్తిలో సాటివారి సహాయము, ఆదరణ లభిస్తవి. ఏమవుతుందోనని ఆందోళనపడే వ్యవహారాలలో క్రొత్త మార్గం కనుపిస్తుంది. దుబారా తగ్గుతుంది. సమయంలో సలహా, ఉపాయం చెప్పి ఉత్సాహం కలిగించేవారు లభిస్తారు. పరిశ్రమ చేసినా ఫలితం ఉంటుంది. నౌకరులు మొదలయిన వారితో చిన్నచిన్న పేచీలు వచ్చి సమసిపోతవి. అయితే ప్రతి విషయంలోను జాగ్రత్త, జ్ఞాపకము అవసరం. విలువగల ఆస్తులు మొదలయినవి కొనే విషయంలో ముందు వెనుకలు ఆలోచించి చేయవలసిన సమయం. దైవకార్యాలు నెరవేరుతవి. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. ఈ సమయంలో ఆత్యాశకు పోవటంవల్ల పశ్చాత్తాప పడవలసి ఉంటుంది. ఇచ్చిన మాట నెరవేర్చటం కష్టం. 30, 31 తేదీలలో అయినవారితో పేచీలు, ఆలోచనలకు అభ్యంతరాలు.

* * *

## మకరం :

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

ఏ పనిలో దిగినా వేసుకొనవలసిన బాధ్యత పెద్దది. వచ్చే ఫలితం సర్వ సాధారణంగా ఉంటుంది. అయితే మొత్తంమీద కష్టనష్టాలు మాత్రం ఉండవు. అధికారులవల్ల ప్రస్తుతం పెద్దగా అపకార, ఉపకారాలు ఏవీ ఉండవు. సాధారణంగా మీ ఆలోచనలు, అంచనాలు తమారమిగా కలసి వస్తూనే ఉంటవి. ప్రయాణం చేస్తారు. మీ అవకాశాన్ని తెలుసుకోకుండా మీమీద కార్యభారం మోపేవారు ఉంటారు. ఉత్తర దిక్కునుంచి సంతోషవార్తలు తెలుస్తవి. క్రొత్తవారితో కలిసి చేయు వ్యాపార, వ్యవహారాలు క్రమక్రమంగా వృద్ధికి రాగల అవకాశా లున్నవి. అవసరాలకు కావలసిన ధనం ఏదోవిధంగా లభిస్తూ ఉంటుంది. అయితే బాహ్య ఆడంబరం, రాజకీయాలలో పేరు ప్రతిష్టల వంటి వానికోసం ఎదురు చూడతగిన సమయం కాదు.

## కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

సుఖ, సంతోషాలు లభిస్తవి. మీరు ముందు ముందు చేయబోవు పనులకు ఒక మార్గం కనుపిస్తుంది. ఆదాయం బాగుంటుంది. అనేక సందర్భాలలో మీ చేతిక్రింద ఉండవలసినవారు మీ మాటను ఎదిరించకుండా జాగ్రత్తపడటం అవసరం. సుఖం, వినోదం నిమిత్తం ధన వ్యయం చేస్తారు. ప్రయాణ సూచన లున్నవి. బంధువుల వల్ల నిష్ఠుర ప్రసంగాలు వస్తవి. ఇంతకు ముందుకన్నా కార్యక్రమాలు పెరుగుతవి. అయితే అలసట, అసంతృప్తి తోచవు. అధికారులను కలుసుకొనే సందర్భాలలో జాగ్రత్తగా ఉండండి. ఇతరుల మాటను త్రోసివేయలేక శ్రమ పైన వేసుకొంటారు. వారాంతంలో క్రొత్త సమస్యలు ఎదురుపడటంవల్ల తాత్కాలికంగా కంగారు పడతారు. 28, 29 తేదీలలో గౌరవం, ఇష్టవస్తు లాభం.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)

విదానంగా సాగిద్దా మనుకొన్న పనులు అన్నీ ఒకేసారి నిర్వహించవలసి వస్తుంది. వృత్తిలో అభివృద్ధి, గౌరవము బాగుంటవి. కాని, చేతికి వస్తుందనుకున్న ధనం ఆలస్యం అవుతూ ఉంటుంది. ఇంతకుముందు వక్రమార్గం పడతవనుకొన్న కార్యక్రమాలు చల్లగా అనుకూలానికి తిరుగుతవి. క్రొత్తవారి జోక్యంవల్ల అయినవారితో కలతలు రాగల అవకాశాలున్నవి. ముందు జాగ్రత్తలో ఉండండి. శుభ, పుణ్య కార్యాలకు ప్రతిబంధకాలు రాతగిన సమయం. బాహ్యంగా పటాటోపం బాగుంటుంది. మబ్బులోని నీటిని నమ్మి చెంబులోని నీటిని వదులుకొన్నట్లుగా వ్యవహరించవద్దు. కొన్ని సమయాలలో స్నేహితులు ఉద్రేకపరచి ప్రోత్సహిస్తారు. కాని, అవసరానికి ఆదుకొనే సమయం కాదు. ధన విషయంలో ఎంత జాగ్రత్తగా ఉంటే అంత మంచిది. 27, 28 తేదీలలో సంతోష వార్తలు. ప్రసంగాలలో పట్టుదలలు. 





వాసంతితో మాట్లాడేస్తున్న మధు ఉలికులికి పడ్డాడు ప్యూను తెచ్చిన కబురు వింటూనే! ఆశ్చర్యంగా నాలుగుసార్లు రెప్పలను తాటించి చూసింది వాసంతి అతని ఉలికిపాటుకి అర్థం తెలియక!

"మీ నాన్నగారు మీ కోసం వచ్చేరుట !!"— ఈసారి ఇంగ్లీషులో చెప్పింది వాసంతి అతనికి తెలుగు రాదేమోనని అనిపించి ....

"చెవులు పనిచేస్తున్నయ్ ఫరవాలే"—అనుకున్నాడుఅప్పు డప్పుడే తేరుకుంటూన్న మధు!

జాట్టులోకి వేళ్ళు పోనిచ్చి తీరికగా తలెత్తి చూసేడు.—దూరంగా తండ్రి ఎదురుచూస్తూ మంచుని కనిపించేసరికి—తనని కని పెంచిన ఆకారం అదే అనుకుని "కళ్ళూ పనిచేస్తున్నాయే!" —సంతోషం కలిసింది ఈసారి అతని ఆశ్చర్యంలో .....

బయల్దేరేడు మెల్లి మెల్లిగా .... అన్నీ "పని చేస్తున్నాయిలే" అని ధైర్యపడుతూ ....

ఎప్పుడూ ఉండే ముభావువవు లోతుల్లోనే మాట్లాడి వెళ్ళిపొయ్యేడు అనంతయ్య ఆనాడు కూడా! కానీ, ఈనాటి ఆయన ముభావం ఇంత అంతగా కనిపించి వటుడు ఎదిగినట్లు అనిపించి మధు కాస్త ఖంగారు పడ్డాడు ....

గబగబా స్నేహితు నొకనిని వెంటబట్టుకొని కాఫీ పోయిస్తానని బెదిరించి తీసుకెళ్ళి—"ఇంకే ముంది? నేను వాసంతితో మాట్లాడుతూంటే మా నాన్న చూసేరు"—అన్నాడు. భయం ప్రతి మాటలోనూ కదలాడి—అదీ చాలక అతని ముఖంలో తాండవమాడసాగింది!

"చూస్తే .... ?"—విపరీతంగా ఆశ్చర్యపడి పోయాడా స్నేహితుడు సుందరం.

"ఏమిటి చూస్తే .... నీ మొహం .... చంపేస్తాడు"—అన్నాడు విసురులో ఒగర్చుతూ మధు....

"నా మొహం చూస్తే నిన్ను చంపేస్తారా ?—" అమాయకం నటించబోయి మధ్యలోనే ఆగి—

"ఇద్దరి పిల్లల తండ్రివి .... నీమీద మీ నాన్నకి అనుమానమా? ఆఁ ...." అంటూ రెట్టిస్తూ సిగరెట్టు పొగని గుప్పుమని వొదిలేసేడు ఆశ్చర్యపు ఉక్కిరిబిక్కిరిలో!

"మా నాన్నకేం .... మా నాన్న నమ్ముతారు ...." గొణిగేడు అస్పష్టంగా అనలును వెళ్ళగ్రక్కుకో లేని మధు !!

"ఓ .... అల్లా చెప్పు .... అయితే మీ అర్ధాంగికి అన్నమాట నీవు భయపడేది! అర్థమవక నే ఛస్తున్నాలే! ...." తేలిగ్గా నవ్వేసి ఈసారి సిగరెట్టు పొగని రింగులు రింగులు లోకి విసిరేడు సుందరం.

"ఏమిటంత తమాషా నీకు .... సలహా లిస్తావని నే అనుకుంటే"—నిజంగానే విసుగుకున్నాడు మధు ....

"అంత వంగముల్లులా ఉంటే ఏమిటో అనుకున్నాను—ఇంత క్రితం ఇదే విషయంమీద కొంత జరిగి ఉండాలి"— నవ్వేడు విలాసంగా సుందరం.

"అబ్బబ్బ ...." నుదురు సున్నితంగా కొట్టుకుని లాభంలేక ఊరుకున్నాడు.

* * *

"మాసిన చీర కట్టి"—పద్యాన్ని లోలోపలే మననం చేసుకుంటూ వచ్చిన మధు గుమ్మంలో అడుగు పెడుతూనే నిశ్చేష్టు డయ్యాడు.....

తన కిష్టమైన సుగంధ కుసుమాలు సన్నజాజులూ— ఇష్టంలేని నిర్గంధ కుసుమాలు, కనకాంబరాలూ కలబోసిన కదంబమాల బారెడు జడకి ఉన్న అందానికి మెరుగులు దిద్దుతోంది! ఇష్టమైన సన్న జాజులని చూసి ఇష్టపడి పోవడం ద్వారా సంతోషపడి పోవాలో—

ఇష్టంలేని కనకాంబరాలకి కష్టపడిపోకుండా చిరాకుపడిపోవాలో — తెలియక, తికమకపడి, ఆఫీ

టిలో విషయం మదిలో మెదిలి భయపెట్టేసరికి చిరాకుపడడం మరిచిపోయి అణకువగానే లోపలకు అడుగుపెట్టేడు మధు .....

పసుపు పచ్చని చీర— తోపురంగు జాకెట్టూ వేసికుంది గానీ— ప్చ్—ఆ చీర కట్టే పద్ధతి తనకి పూర్తిగా నచ్చని పద్ధతి కదా అని చింతించేడు—

చేతులనిండా మంగళసూచకంగా గాజులు గల గల లాడ్డం తనకి చాలా ఇష్టమే గానీ—రెండు చేతులకీ రెండు రకాలు తగిలించింది అని పెదవి విరుచుకున్నాడు.

''ఇష్టమైన బంగాళాదుంప వేపుడుకి కొంచెం ప్రక్కగా కాకరకాయ కూర వడ్డించింది !

''ఏటి భావమేమి తిరుమలేశ ?''—అను కున్నాడు పూర్తి స్వగతంలో పాపం !''

నవ్వే మాటకి ముందుగానో, వెనుకగానో వెక్కిరింపూ ఉంది !!!

ఇంతకన్నా మాసిన చీర కట్టుకుని, మౌనంగా, నిరస్తభూషయై ఉన్నా బాగుండేది కదా''—అని పించినా పైకి అనలేదు—

తమలపాకుల చిలకలు చుట్టి ఆప్యాయంగా అందించే కంకణ క్వణిత కింకిణీ రవాలను చేసే చేయి—అంత్రకితం తయారుచేసిన సుగంధ ద్రవ్యాల కిళ్లీని ప్లేటులో పెట్టి— పని తొంద రలోలా ప్రక్కలకు వెళ్లిపోయేసరికి ''లాభంలేదు'' అనుకున్నాడు .... అయినా ప్రయత్నించదలచి ....

''శారదా .... ఈవేళ మా ఆఫీసులోనే కొంగా, కోడీ—కొట్లాడుకున్నాయి .... పాపం కోడి తప్పేం లేదు ....''

మధ్యలోనే అందుకుని—''మీరు కోడి విషయ యమా చెప్పేది ? కోమలి విషయమా ?''— ఎగతాళిగా నవ్వింది !

''తాళికట్టిన భార్య ఎగతాళి చేయడమంటే ఎంత అవమానం ?'' - అని ప్రశ్నించుకుని జవాబు దొరకక- ''ఇంతకంటె నడిరోడ్డుమీద అరటి పండు తొక్క త్రొక్కి నిలువునా వెళ్ళకిలా పడ్డం నయం !'' అనుకున్నాడు.

మధును చూస్తూనే అతని మనస్సును పది వెయ్యగల శారద గలగలా నవ్వి—

''అయామ్ వెరీ సారీ సర్ .... వాళ్లకి చిత్ర విచిత్రమైన పేరులు పెట్టి నా దగ్గిర చెబితే— నేను పొంగిపోతానని అనుకుంటున్నారు .... ఏం అవసరం కలిగి వాళ్లు అలా పదుగురి మధ్యలోనూ కూర్చుని ఉద్యోగం చేస్తున్నారో పాపం .... వాళ్లని మీకు అనుగుణ్యంగా త్రిప్పుకోవడానికని పదిన్నర మొదలు ఆరు గంటల వరకూ ప్రయత్నించడం... ఇంటికివచ్చి మా దగ్గిర విమర్శించడం ....'' అంటూనే ఓసారి మధు మ్లానవదనాన్ని ఓరగా పరికించి—

''ఇది మీ విషయం కాదు .... అసలు జరుగు తూన్న విషయం'' అని మళ్లీ నవ్వింది. ఇప్పుడు కిలకిలల శబ్దం ప్రయాణం చేసింది గాలిలో—

''కాదు శారదా—''

''అవును—ఇదికాదు టైము .... మళ్లీ ఆఫీ సుకు పోయేందుకు వేళ దాటిపోతోంది .... వేగిరం తెమలండి—'' అంటూ లేచి బట్టల నందించేసింది.

''వేపడం ముక్కలా ఉంది నా పరిస్థితి !''— అనుకుని తనమీద తనకే జాలి పొంగుకు వచ్చేసరికి త్వరగా లేచి ఆఫీసుకు దారితీసేడు మధు !

పందు దాటిన మధును చూసి విరగబడి నవ్వు కుని మావగారి గదిలోకి వెళ్లి—తొరక కూడా పట్టని వేడి పాల నందించింది మగత నిద్రలో ఉన్న అనంతయ్యను లేపి !!

''ఏమిటి పరిస్థితి ?''—అడిగేడు అనంతయ్య ఆత్రుత ప్రపహిస్తూంటే—

''మళ్లీ కొద్దిగా చల్లబడ్డాయంటే మీకు ఇష్టం ఉండదు. పోనీ కదా అని వెచ్చబెడితే— మీగడ తొరకలు తయారవుతాయి. మీరు త్రాగడం మొదలుపెడుతూ ఉండండి .... నేను చెబుతా ...'' నవ్వింది ఎంతో నెమ్మదిగా శారద !

''అవునవును .... నాతో వేగడం కష్టం సుమీ.'' ఒప్పుకున్నాడు అనంతయ్య !!

''మీతో వేగడం సులభమే .... మీ సుపుత్రుని తోనే కష్టం''—అనంతయ్య ఒప్పుకున్నా శారద ఒప్పుకో (నే) లేదు. జరిగిన విషయాన్ని ప్రారం భించి అప్పటి వరకూ జరిగింది చెప్పింది !

''కొంగ—కోడీ అని మన దగ్గిర కోతలు కోస్తూ—వాళ్ల కొంగుల వెనుక తిరుగుతున్నా డమ్మా పిడూ—'' అన్నాడు అనంతయ్య అంతా విని .... అక్కను నవ్వింది అనంతయ్య వదలిన మాటల్లోంచి ఆయననే చూసి ....

నవ్వింది శారద—

నవ్వుతూనే వదిలింది వాడియైన బాణాలని.

''మరీ—మావయ్యా .... మీ చిన్నతనంలో మీరూ—దక్షిణ నాయకులుట గదూ ?'' అని !

ఆయన ముసి ముసి నవ్వుల్లోంచి సిగ్గు బయ టికి రాలేక వాటిలోలేనే చిక్కుపడి పోయింది....

''అంటే ఏమిటమ్మా ?''—ఆశ్చర్యాన్నభిన యించబోయాడు.

''దక్షిణ నాయకు డంటేనా ? అందమైన ఆడవాళ్ల చుట్టూరా ప్రదక్షిణలు చెయ్యడ మన్న మాట.'' కొంగు నోట్లో కుక్కుకుని నవ్వాపు కుంటూ అంది శారద !

''ఇంత అల్లరి పిల్లవి— వాడిని నీవేం అదు పులో పెట్టగలవ్ ?''—వెక్కిరించేడు అసలు వదిలి వడ్డీలోకి దిగిన అనంతయ్య.

పకపక నవ్వింటీసారి శారద !

శృతి కలిపేడు అనంతయ్య !

''నాకూ—అత్తయ్య చెప్పేరులేండి—మీరూ— వాళ్ల పేర్లన్నీ నిద్రలో కలవరించేవారుట''— సంభాషణను సాగిస్తోంది శారద ....

''హట్ .... అల్లా అబద్ధాలాడేవంటే నీకు ఆడ పిల్ల తప్పదు .... ఆఁయ్''—విదిలించుకోబోయాడు వదలలేదు శారద—

''అత్తయ్య పై లోకాల్లోంచి మీ కథలు వినదు గానీ—మీ స్వీయ కథని కొన్ని చిల్లర మల్లర పిట్ట కథలుగా చెప్తే—''

''వింటావు''— పూర్తిచేసేడు అనంతయ్య !

''అవును''—అక్కడే ఉన్న చాపమీద చతికిల బడి అంది శారద.

''సరే—కానీ—ఎలా మొదలుపెట్టాలో తేలడం లేదు''—నట్టుకున్నాడు .....

''ఎవరో ఒక అమ్మాయి దగ్గిర మొదలు పెట్టండి—అదే తేలుతుంది''—సహాయపడింది—

''ఎవరినుంచి మొదలుపెట్టాలో కూడా తేలడం లేదు''—ఓటమిని ఒప్పుకుంటూ జెండా ఎగ రేస్తే శత్రువుల నుండి మరో విధంగా తప్పించుకో వచ్చుననే ఆశ కావచ్చు అనంతయ్యది !

అటువంటి చైనా పద్ధతులంటే చిరాకు శారదకి !

అందుకనే—''అలివేణి నుంచి మొదలుపెట్టండి'' అని అందించింది ... అందులో కొంచెం వెలుగూ, ఇంకొంచెం వెక్కిరింపూ, మరికొంచెం నవ్వూ చిందిస్తూ.

''అలా పెద్దవాళ్లని అంతంత మాటలంటే బోలెడు పాపం'' భయపెట్టేడు అనంతయ్య— గతం విడమరిచి చెప్పలేక !!

''అయ్యో .... ఎల్లాగ ఇప్పుడు ? మధ్యాహ్నం భోజనానికి మీ అబ్బాయి ఇంటికి వచ్చినప్పుడు.... మరి చాలా పాపం మూట కట్టుకున్నానా ఈవేళ? —బుగ్గన వ్రేలుంచి—చక్రాల్లాంటి కళ్లు గిరగిర త్రిప్పి నవ్వేస్తూ అంది శారద.

''అ .... హ .... అవి లెక్కలోకి రావు''— అడ్డుపడ్డాడు.

''అయితే ఫరవాలేదు—ఇదీ అంతే—పోనీ— మధురవాణిది ఒక్కటి చెప్పండి చాలు .... ఆమె జ్ఞాపకార్థం మీ అబ్బాయికి మొదటి రెండక్ష రాలూ పెట్టారుట కదూ ?'' సగం పేరులో భర్తపేరు కలిసినందుకు కొంచెం సిగ్గుపడినా అడిగేసింది శారద!

''లాభంలేదు .... ప్చ్ .... నీతో వాడు వేగడం కష్టం''—జాలిపడ్డాడు కొడుకుమీది కోపం మరిచి పోయిన అనంతయ్య—

''ఒకళ్లతో ఒకళ్లు వేగడ మనేది ఎలా వచ్చిందో చెప్పనా ? ....

''ఒక ఉత్తమురాల్లాలు (!) ఓ రోజున బంగాళా దుంప, ఉల్లిపాయ వేపుడు చేసిందిట .... ఆవేళ ఆమె భర్తకి భోజనం పెడుతూ—''వాడిన ముక్కలవైపు చూస్తున్నట్టున్నారు .... మీకేమో రెండూ కలిపిన వేపడం కావాలి .... ఒకదానితో సరి సమానంగా రెండోది వేగలేకుండా ఉంది''— అందిట ! అప్పటినుండి ఈ లోకోక్తి వాడుకలోకి వచ్చిఉంటుంది ....'' కలియబడి కథ అల్లేసింది శారద—

నమ్మేసేటట్టున్న కథకి నవ్వేసేడు అనంతయ్య.

గడియారం గలగల లాడుతూ నాలుగుసార్లు నవ్వింది.

లేచి నిలబడింది శారద— ''పనిమనిషి వచ్చే వేళ అయింది .... అయినా స్వీయచరిత్రల్లో నిజా లుండవు. మీరు చెప్పినా కథ చెబుతారు కానీ— జరిగింది చెప్పనే చెప్పరు .... ఇంకెందుకు ?'' అంది కొంగు విదిలించుకుని నడుం చుట్టూరా త్రిప్పి దోపుకుంటూ .....

* * *

ఆహారం అంకించుకోలేని కొన్ని మగ పక్షులు బిక్కుబిక్కుమంటూ గూళ్లకి జేరుకుంటున్నాయి. భార్యకి పువ్వులు కొనడం మరిచిపోయిన ఉద్యో గులు భయపడి వెనుదిరిగి పూల అంగడీలకు పోతున్నారు !

పిల్లవానికి పాలడబ్బా తెమ్మని భార్య పైన లిస్తే పేకాటలో తగలేసి ఉత్తచేతులతో పోలేక అడుగులో అడుగులు వేసుకుంటూ వాళ్ల ఇళ్లకీ—

[illegible]
కుంటున్నారు జాదగాంధ్రులు—

బడికని బయల్దేరి స్కూలుకి ఎగనామంపెట్టి బబ్బా ముక్కలూ, గోటీ బిళ్లలూ ఆడి—తిరిగి సంచీలు భుజాన్న వేసుకుని దొంగచూపులు చూసుకుంటూ ఇంటిముఖం పట్టేరు మొద్దబ్బాయిలు.

**గోవులను కాచేందుకు వాటి వెనుకనే వెళ్లిన గోపాలురు—కొన్ని గంటలు బిళ్లంగూటీలోనూ— మరికొంతసేపు గోవులను కాచే గోపాలకృష్ణుణ్ణను కుని ఈలలు వేణునాదంలా ఉందని వేసికొంటూ—** దారితప్పిన గోవులను వెతకలేక వెర్రి ముఖాలతో యజమాని తిట్ల నూహించుకుంటూ మెల్లి మెల్లిగా తడబడే అడుగులతో సాగిపోతున్నారు.

వంట పూర్తి చేసేసిన శారద అలవాటుగా ముందు గదిలో సోఫా నధివసించబోయి—కర్తవ్యం కంచీ కర్రతో బెదిరించేసరికి వంటింట్లోనే తచ్చాడసాగింది.

సైకిలు దిగి ఎదురురాని శారదకోసం అలవాటుగా ఎదురు చూడబోయి—చేసిన తప్పు ముందు కురికి అతని ముక్కుమీదే వేలుంచి చెప్పేసరికి బుద్ధిమంతంగా లోపలికి వచ్చేడు మధు— బిక్కు బిక్కు మంటూన్న గుండెలని ఓ చేత్తోనూ సైకిలును ఓ చేత్తోనూ పట్టుకుని....."

"హాయ్.... హాయ్ .... అంటూ తరుముకుని వస్తూన్నట్టు ముందు గదిలోకి వచ్చి—

"మీరా ...." అంది ఎంతో అందంగా నటిస్తూ శారద !

"రోజూ ఈ టైముకి నేనే కదా వచ్చేది .... ఈవేళ కుక్క ఎలా వచ్చిందనుకున్నావ్ ?" ఉడుక్కున్నాడు ప్రకాశంగా మధు !!

"బావుంది .... ఇంతకుముందు కుక్క బుద్ధి



'మరేనండి ! మా ఊళ్లో చెరువూ, నదీ లేనిమాట వాస్తవమేనండి; కానీ, ఊళ్ళో మురికికాలువలు మూసుకుపోయి - రోడ్ల కడ్డంగా ప్రవహించే మురికి నీరే చెరువులాగా అయిందండి; అందులో పిల్లాజల్లా పడిపో తున్నారని ఊళ్ళో వాళ్ళంతా చందాలు వేసుకొని బ్రిడ్జి వేయించారండి; దానికి మీరు ప్రారంభోత్సవం చెయ్యాలండీ;....'



# చిటపటలు

గూర్చి ఆలోచిస్తున్నాను .... ఈలోగా ఇక్కడ చప్పుడయ్యేసరికి ...." ఆపింది శారద అక్కడితో—

ఇక్కడితో ఆపి ఈ కాస్త గౌరవాన్నయినా నిలబెట్టింది అనుకున్నా డీసారి పూర్తి స్వగతంలో మధు.

"అహా .... కుక్క గూర్చి ఎందుకు ఆలోచిస్తున్నావుట ?"—కోపం వచ్చి దూరింది మధు మాటల మధ్యలోకి !

"ఇది మరీ బావుంది—నాకన్నా బావుంది— (ఈ మాటలు అప్సరసలా అలంకరించుకున్న శారద అంటుంటే గుటకలు మింగుకుంటూన్న మధు వెంటనే వచ్చిన గుటకని మింగడం మానేసేడు— అసలు విషయం తెలిసిపోయిందనే బాధ, కోపం— విసుపులతో) మన దొడ్లో దాలిగుంటలో ఇంత వరకూ పడుకుంది మన వంటింట్లోకి రాబోతే నేను తరిమేసిన ప్రక్కవాళ్ల కుక్క ! లేచింది చాలా సేపటికి !! లేస్తూనే దులిపేసుకుని తోక జాడించు కుని—అంతవరకూ ఆ దాలిగుంటలో వెచ్చగా పడుకుని ఏమాలోచించిందో ఏమో—అవి కూడా విదిలించుకుని నేను కొంచెం ప్రక్కలకి పనిమీద తిరిగేసరికి తిరిగి వంటింట్లోకి చొరబడుతోంది.... అందుకనే—తెలిసిందా ?" పూర్తిచేస్తూనే విసవిసా నడుచుకుంటూ లోపలికి వెళ్లి వేడినీళ్లూ, చల్లటి కాఫీ అందించింది ....

అందిస్తూనే—"నేను ఛీఫ్ ఇంజనీరుగారి సుగుణతో వాళ్ల కారులో సినిమాకి పోతున్నాను మావగారికి కాస్త పేళకి అన్నం పెట్టేసి— మీకూ ఆకలేస్తే వడ్డించుకుని తినేయండి"— అంది.

అంటూనే వీధిలోకి వక్కా పోయింది ! వింపక్కా అలంకరించుకున్న శారద!!

ఆశ్చర్యపోయి ఒళ్లు తగాలేసరికి—జాగ్రత్తగా లేచి డ్రాయరుమీది మంచినీళ్లు త్రాగబోయి నోరు కాలేసరికి అదే కాఫీ అనుకుని ఊదుకుంటూ త్రాగేసి—గ్లాసు క్రింద పెట్టబోయి కాఫీని చూసి ఆశ్చర్యపోయాడు.

తిరిగి చేతిలోని గ్లాసుని చూసుకున్నాడు.

గ్లాసులోవి నీళ్లు నవ్వేయి !

"పోనీలే—" అని కాఫీని అందించుకుని మరగబెట్టి ఇచ్చిందేమో అని భయపడుతూ నోట్లో పెట్టుకుని విస్తుబోయి గడాగడా త్రాగి కూర్చున్నాడు "ఔరా—ఏమిటి!"—అనుకుని !!

* * *

సినిమాకి వెళ్లిందో—

టాంక్‌బండ్ మీదుగా షికారుకే పోయిందో — గానీ—శారద మాత్రం సినిమా వదిలే వేళకే ఇంటికి తిరిగి వచ్చింది !

"మీరు ప్రక్కన లేందే—నాకు అప్పలు సినిమా చూడ బుద్ధికాదని" ఒకానొకప్పుడు వాదించి— వేధించి తన కిష్టమైన సినిమాకి భర్తని వెంట గొనిపోయిన శారదకీ—ఈనాటి శారదకీ పోలికలు కనిపిస్తాయేమోనని వెతుక్కుంటున్నాడు మధు— పట్టు చీరెల రెపరెపలతో కదిలివస్తూన్న ఆకారాన్ని చూసి .....

"అయ్యో, మీరింకా మెలుకువగానే ఉన్నారా? నిద్రపోలేదూ ?"—అని ముక్కుసున్న రవ్వల బేసరి మెరిసిపోయేలా నవ్వి—లోపలికి వెళ్లి [illegible]

"అయ్యో—మీరింకా అన్నం తినలే లేదా ?" ఆశ్చర్యమంతా కళ్లల్లో పెట్టి గొంతుకలో హేళన దాచి, నవ్వుని పెదిమల మధ్య బిగబట్టి అడిగింది శారద—

"కడుపు నిండిపోతేనూ—ఇంకా అన్నం ఎందుకూ .... ?" అడిగేడు మధు.

మామ్మూలుగా మొహం పెట్టి—కనుబొమ్మల విరుపులో గాంభీర్యం దాచి — చెదిరిన క్రాపులో చిరాకుని అణచుకుంటూ !!

"ప .... రే .... ఇలా మీరు నా కడుపు నింపి నపుడల్లా నేను అన్నం మానేస్తున్నానా ....? దాని కదే—దీని కిదే ...." వెనక్కి వదిలి శరీరాన్ని— శరవేగంతో—"రండి" అంటూ చేయి పుచ్చుకుని వంటింట్లోకి తీసికెళ్లింది !!

మాగన్ను నిద్రలోనే వీళ్ల సంభాషణలు విని నవ్వుకున్నాడు మగతగా అనంతయ్య.

"మా నాన్న అన్నం ఇలా కలుపుకుంటారు"— అంది శారద సంభాషణకి ఉపక్రమిస్తూ—

"ఆడపిల్లలకి తండ్రి పోలిక వస్తే అదృష్ట మంటారు. మొగపిల్లలకి తల్లి పోలిక వస్తే అదృష్టంట .... మీకంటె నేనే అదృష్టవంతురాల్ని —మీకూ—మీ నాన్నగారి పోలికేగా ?"—

నోట్లో ముద్ద పెట్టుకోబోయిన మధు చేతిని దింపి—"అవును—ఏమిటంటావ్"—గద్దించేడు—

కళ్లల్లోంచి తూటాల్లోని రవ్వల్లా వేడివేడి చూపులతో శారదని గుచ్చి గుచ్చి చూస్తూ—

తొణకలేదు శారద—

మెడ బెణికినట్లు తలని వంకరగా తాటించి "కాకరపువ్వు వత్తి పువ్వుల్లా"—గలగలా నవ్వింది— కొంచెం చురుక్కుమనేలా తగిలి అతని శ్రవణేంద్రియాల్లో భరతనాట్యం చేసిందామె నవ్వు !

"సరిసరి .... బెల్లక్రర రసం పోయనా, అల్లం రసం పోయనా ? ఏది ఇష్టంట ?" గరిటతో కంచం చూపించి అడిగింది.

"అన్ని రసాలూ నాకిష్టమే. ఏదో ఒకటి పొయ్యి ...." విసుక్కున్నాడు.

"ఆఁ .... అన్ని రసాల్లోనూ శృంగార రసం కూడా ఉన్నట్లు నాకు ఫదో క్లాసులో మా మేష్టారు చెప్పేరే"—శారద రంగంలోకి దిగింది ...

"అందుకనే—నేనూ చెప్పేనూ"—మెదడు పదునును జూసి కదనరంగం మీదికి వచ్చేడు మధు .....

"అదా సంగతి—నా దగ్గిర రౌద్ర, భయానక భీభత్సరసాలూనూ—బయట శృంగారమూనా ?" నవ్వేసింది శారద ....

జవాబు దొరకక మొద్దు కత్తిలా ఊరుకుండి అతని మెదడు !

ఓటమిని ఒప్పుకోలేక కంచంలో చెయ్యి కడిగేసికున్నాడు మధు—

తక్కువ తినే అలవాటు లేదు—

అతనికంటె ఎక్కువా తినలేక—

తనూ కంచెంలో చెయ్యి కడుక్కుని— మూతలు సర్దేసింది శారద—

వాడిపోని దేవ పారిజాతంలా ఆమె పెదాలమీది నవ్వు మాత్రం అలాగే ఉంది .... "ఎలా ?"— అనుకున్నాడు బోడు గరచుకుని మధు ....

35 వ పేజీ చూడండి

దేశ రక్షణకై ఆయుధాలు

ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!




కొత్త విధంగా తయారైన

# సన్‌లైట్

## అధిక కాంతిగా-ఉతుకుతుంది

* కొత్త రూపం మరియు కాగితపు మూత * కాంతిగాచేసే కొత్త శక్తి

అధిక తెల్లగాను, అధికకాంతిగాను ఉతుకుతుంది

హిందుస్థాన్ లీవర్ ఉత్పత్తి

S. 48-140 TL.

# మనమూ - మనదేహస్థితి

డా॥ గాలి బాలసుందరరావు

## పెద్ద ప్రేగు: అవరోహ భాగములు

గత వారం పెద్ద ప్రేగులో కొన్ని భాగములను గురించి తెలుసుకున్నాము. ఇప్పుడు పెద్ద ప్రేగు తిర్యగ్భాగమును గురించి తెలుసుకుందాము.

పెద్ద ప్రేగు అవరోహ భాగము ఎడమ హైపోకాండ్రియ ప్రదేశంలో ఆరంభమౌతుంది. దీని పొడుగు సుమారు పది అంగుళములు ఉంటుంది. కుడి కిడ్నీ పార్శ్వాంతమును అవరోహ భాగము గోడ అంటి ఉంటుంది. తొంటి ఎముక అయిన ఇలియము లోపలి వైపును అంటి, శరీర మధ్యరేఖ వైపుకు తిరిగి, సిగ్మాయిడ్ కోలన్‌గా ఏర్పడుతుంది.

సిగ్మాయిడ్ కోలన్ పెద్ద ప్రేగులో భాగమే. ఇది పెల్విస్ అంచు వద్ద ఆరంభించి, మధ్యోన్ముఖమై పెల్విస్‌లోకి దిగిపోతుంది. దీని గతిలో ఒక వక్రత ఉన్నది. ఈ భాగము పొడుగు సుమారు ఎనిమిదిది అంగుళములు ఉంటుంది. సిగ్మాయిడ్ కోలన్‌లో ఒక భాగము. పురుషులలో రెక్టము గోడకూ, మూత్రాశయము గోడకూ మధ్య ఏర్పడిన ఖాళీ ప్రదేశంలో యిమిడి ఉంటుంది. ఈ భాగమే స్త్రీలలో గర్భాశయము, రెక్టము మధ్య ఉన్న ఖాళీ ప్రదేశమును నింపి ఉంచుతుంది.




స్త్రీలో రెక్టము దాని సంబంధాంగములు.

1. సింఫైసిస్ ప్యూబిస్. 2. మూత్రాశయము. 3. గర్భాశయము. 4. వెజైనా. 5. రెక్టము. 6. శ్రేకము. 7. గుదనాళము.

ఈ ఉదరాంగముల అన్యోన్య సంబంధము చాలా ముఖ్యమైనది. ప్రసవకాలంలో సిగ్మాయిడ్ కోలను, దాని చివర ఉండే రెక్టము మలంతో నిండి, ఉబ్బి ఉన్నప్పుడు యూటెరస్ (గర్భాశయము) సంకోచ వ్యాకోచములకు నిరోధం కలుగుతుంది. అదే విధంగా మూత్రాశయం (Urinary bladder) నిండి ఉన్నా నిరోధం కలుగుతుంది. ఇందువల్లనే ప్రసవారంభంలో మలాశయమునూ, మూత్రాశయమునూ ఖాళీ చేస్తారు. వీటిలో బాధ ఏర్పడితే, అవి వాటి ముందు, వెనుక ఉన్న అంగములకు పరావర్తమై (Refer) అక్కడ ఏదో దోషం ఏర్పడినదనే భావన కలిగించి రోగ నిరూపణలో కలవరం కలిగిస్తుంది. సిగ్మాయిడ్ కోలన్ చివరభాగం నుండి రెక్టం ఆరంభిస్తుంది. ఈ ప్రదేశంలో కొడవలి పిడి, కొడవలి వద్ద ఉండే కోణం వంటి కోణం ఉంటుంది. ఈ కోణం సేక్రం అనే ఎముకయొక్క లోపలి గోడను అంటి ఉంటుంది. ఈ సిగ్మాయిడ్ కోలన్ల సంధికి సమీపంలో, మెడలోకి పోయే అబ్‌డ్యురేటార్ నరము; స్త్రీలలో ఓవరీ పురుషులలో బీజముల నుండి, వీర్యమును వీర్యాశయములకు తీసుకొనిపోయే వీర్యనాళముల భాగము దీనిని ఆని ఉంటుంది. దీని వెనుకవైపున శ్రేకమునుండి బయటికి వచ్చే నరములను కలిపి ఏర్పడిన శ్రేకల్ ప్లెగ్జస్ (Sacral plexus) ఉన్నది. ఈ ప్లెగ్జస్‌కు సంబంధించిన సింపతెటిక్ భాగమునుండే బీజములకు, ఓవరీలకు, గర్భాశయానికి పోతవి. ఉయోర్టా ఉదరభాగము. చివర రెండు చీలికలౌతుంది. ఈ శాఖలు కుడి ఎడమ ఇలియక్ ప్రదేశములను దాటి, ఇంగ్వైనల్ లిగమెంటులో ఉండే ద్వారం గుండా మెడకు, కాలికీ పోతవి. ఈ రెండు ఇలియక్ ఆర్టెరీల గోడలలో ఉండే కండరముల సంకోచ వ్యాకోచములకు సంబంధించిన సింపతెటిక్ శాఖలు ఈ ప్రదేశం నుంచే వస్తవి. ఈ విషయము చాలా ముఖ్యమైనది. దుస్సంకోచమువల్ల (Spasm) గాని, నూతన దుర్మాంస వృద్ధులవల్ల గాని, మలాధిక్యతవల్ల గాని, మరే కారణంచేత గాని యీ ప్లెగ్జసుకు వొత్తిడి తగిలితే ఆ అంత్రభాగానికి సంబంధించిన బాధ వీటన్నింటికీ పరావర్తమౌతుంది. ఇలియక్ అర్టెరీ గోడలలో కండరముల సంకోచ వ్యాకోచములు సరిగా జరగక కాళ్ళు లాగడమో, ఆ ప్రదేశాలలో నెత్తురు పోటు అధికమై బ్రద్దలు గొట్టుకు పోవడమో జరుగుతుంది.

ఈ ప్రదేశంలో ఉండే కొన్ని నరములు ప్రోస్టేట్ ప్లెగ్జసుగా ఏర్పడతవి. ఈ ప్లెగ్జసు నుండి పోయే నర శాఖలు, ప్రోస్టేట్ గ్రంధికీ, వీర్యాశయములకూ (Seminal Vescicles) ప్రోస్టేటు గ్రంధి కూడా పోయే యురెత్రా (మూత్రనాళము) భాగానికీ, లేపన శక్తికి కారణభూతమైన కార్పస్ స్పాంజియోజం (Carpus Spongiosum) అనే పురుషాంగ భాగానికీ, వీర్యస్ఖలనానికి కారణములైన నాళములకూ, (Ejaculatory ducts) యురెత్రా చివర భాగాలకూ పోతవి. వీటికి వత్తిడి కలిగినప్పుడు పరావర్తమైన బాధ ఎక్కడనుంచి వస్తున్నదో తెలియక, మహా ధీమంతులైన సర్జనులు కూడా కలవరపడి, వారికి తోచినట్లుగా ఆపరేషను చేసివేస్తారు. ఈ ప్రదేశంనుంచి వచ్చే సింపతెటిక్ నరములు, పురుషాంగంలో రక్తనాళముల సంకోచమును, పేరా సింపతెటిక్ నరములు, ఆ నాళముల వ్యాకోచమునూ కలిగిస్తవి. ఆ ప్రదేశంలో రక్త పుష్కలత్వము ఏర్పడినప్పుడు గాని లేపనము జరగదుగదా. జుగుప్స కలిగించే అనుభూతులు, మనో వ్యధకు కారణములైన పరిస్థితులు సింపతెటిక్ ప్రేరేపణవల్ల పురుషాంగములో రక్తహీనతను కలిగించి వారిని తాత్కాలికంగా శక్తిహీనులను చేస్తవి. అక్కడ రక్త పుష్కలత్వము సంయోగ కాలంలో బాధ కలిగించవచ్చు.

ఉదరకుహరంలో సిగ్మాయిడ్ కోలన్ ఉండే రీతి అందరిలోనూ అన్ని కాలాలలోనూ ఒకే రీతిగా ఉండదు. దాని పొడుగూ, అందరిలోనూ ఒకే మాదిరిగా ఉండదు. దానిని చుట్టి ఉండే పెరిటోనియము పొర ఒకేమాదిరిగా ఉండదు. అన్ని కాలాలలోనూ అది మల పదార్థంలతో నిండి ఉండదు. అది బాగా ఉబ్బి ఉన్నప్పుడు పెల్విస్‌లో నుండి పైకి ఉబికి, ఖాళీ కాంగానే మళ్ళీ పెల్విస్‌లోకి పోతుంది. రెక్టం, మూత్రాశయం నిండి ఉన్నప్పుడు, గర్భధారణ కాలంలోనూ ఇది పెల్విస్ కుహరమును వదలి ఉదరభాగములలోకి వస్తుంది. అవి ఖాళీ కాంగానే యథాస్థానానికి పోతుంది. ఉదరంలో బాధాకరమైన పరిస్థితులు ఏర్పడ్డప్పుడు యీ కదలిక ఆ బాధను ఇనుమడింపజేస్తుంది. సిగ్మాయిడ్ అంతం రెక్టం పై కొనను అంటి ఉంటుంది.

రెక్టం అంటే నిడుపైనది అని అర్థం. కాని, ఇది శ్రేకంలో మూడవ వర్టెబ్రా దగ్గర ఆరంభమై దాని వంపు ననుసరించి అరటిపండులాగా వంగి ఉంటుంది. రెక్టం కాక్సిక్సు చివర గుదనాళంలో అంతమౌతుంది. రెక్టం ప్రారంభ భాగము, అంత్య భాగము నిడువుగా ఉంటవి. అవి శరీర మధ్య రేఖకు తిన్నగా వుంటవి. కాని మధ్యలో శరీర మధ్య రేఖకు అటువైపునా యిటువైపునా రెక్టంలో కొన్ని వంపులున్నవి. ఇందులో మొదటి చివర వంపులు, శరీర మధ్య రేఖకు కుడివైపునా, మధ్య వంపు ఎడమవైపునా ఉంటుంది. ఈ ఎడమవంపు అన్నిటిలోకీ పెద్దది. సిగ్మాయిడ్ కోలన్‌కూ, రెక్టముకూ నిర్మితిలో కొన్ని భేదములు ఉన్నవి. రెక్టం గోడలో ఉబ్బరింపులు వేరు. టీనియా కోలై మూడు పాయలుగా ఉండక, రెండు పాయలుగా అంతరించి పోతుంది. పెరిటోనియం సిగ్మాయిడ్ కోలన్‌ను చుట్టి ఉన్నట్లుగా రెక్టమును పూర్తిగా చుట్టి ఉండక కొన్ని సంచీల లాగా అంతమై పోతుంది.

రెక్టము లోపలివైపును కప్పిఉండే మ్యూకస్ పొర అన్ని సమయములలోనూ ఒకేమాదిరిగా ఉండదు. దీని చివర భాగంలో మ్యూకస్ పొర నిలువు తీరులో మడతలుపడి ఉంటుంది. మల విసర్జన కాలంలో రెక్టం గోడ సాగినప్పుడు ఇవి అంతరించిపోతవి. కొన్ని వలయాకారం గల మడతలూ ఉంటవి.

పురుషులలో రెక్టమునకు ముందువైపున చిన్న ప్రేగుయొక్క సిగ్మాయిడ్ కోలన్ యొక్క మడతల, మూత్రాశయ భాగము, ప్రోస్టేట్ గ్రంధి, వీర్యాశయములు ఉంటవి. స్త్రీలలో గర్భాశయము, ప్రేగుల మడతలు ఉంటవి.

కొందరు పురుషుల్లో వృద్ధాప్యంలో ప్రోస్టేటు గ్రంథి పెద్దదౌతుంది. ఆ గ్రంథిలో కేన్సరు వంటి వ్యాధులు ఏర్పడుతవి. ప్రోస్టేటు గ్రంథి సరిగా ఉన్నగో లేదో రెక్టం ద్వారా వ్రేలితో పరీక్ష చేయడానికి వీలున్నది.



పురుషులలో రెక్టము సంబంధాంగములు.

1. సేక్రము. 2. రెక్టము. 3. ప్రోస్టేటు గ్రంథి. 4. వీర్యాశయము. 5. మూత్రాశయము. 6. ప్యూబిక్ సింఫైసిస్. 7. యురెత్రా. 8. బీజము.

రెక్టం అగ్రం గరాటీ అంతంలాగా సన్నగిలి గుదనాళం (Anus Canal) ఏర్పడుతుంది. దీని పొడవు సుమారు అంగుళమున్నర ఉంటుంది. ఇది కాక్సిక్సుకూ, యురెత్రా మధ్య భాగానికీ మధ్య ఉన్నది.

గుద నాళం గాజు గొట్టంలాగా అద్యంతమూ ఒకేలాగా ఉండదు. ఇక్కడ మ్యూకస్ పొర నిలువు తీరులో మడతలుపడి ఉంటుంది. ప్రతి మడత లోనూ ఒక ఆర్టెరీ వెయిను ఉంటవి. కొందరిలో ఈ వెయినులు ఉబ్బి, శాశ్వతంగా విస్తరించి పోతవి. ఆ స్థితిని మూలవ్యాధి అంటారు. తెలుగులో 'మొలలు' అంటారు. గుదనాళము గోడలో వలయాకృతి గల కండరములు అధికంగా ఉంటవి. ఇందులో కొన్ని, రెండుచోట్ల అత్యధికంగా ఉండి స్ఫింక్టర్లుగా ఏర్పడుతవి. ప్రేగుల్లో కండరముల పొర క్రింద ఉండే అనుబంధ దాతువు (Connective Tissue) పొర నారలాగా వదులు వదులుగా ఉంటుంది. ఇక్కడ చాలా దట్టంగా ఉంటుంది. మ్యూకస్ పొర నిలువు మడతల చివర విస్తరించిన ప్రదేశములు ఉంటవి. ఈ ప్రదేశములలో అప్పుడప్పుడు క్రిమిదోషం ఏర్పడుతుంది. మలం, పెంటికలు కట్టి బలవంతంగా విసర్జింపబడినప్పుడు యీ మ్యూకస్ మడతలు చినిగి, అక్కడ పగుళ్ళు ఏర్పడుతవి. ఈ పగుళ్లను 'ఫిషరు' (Fissure) అంటారు. ఈ విస్తరించిన భాగములను సైనసులు అంటారు. ఈ సైనసుల వరసకు తిన్నగానే గుదనాళము, లోపలి స్ఫింక్టరు ఉంటుంది. దీనికి అర అంగుళం క్రింద మరొక స్ఫింక్టరు ఉన్నది. అది వెలుపలి స్ఫింక్టరు. ఈ రెండు స్ఫింక్టర్ల మధ్య ఒక నిమ్న ప్రదేశం గాడిలాగా ఉంటుంది. వెలుపలి స్ఫింక్టరుకు క్రింద ఉండే మ్యూకస్‌పొర నిర్మితి వేరుగా ఉంటుంది. అది చర్మము లోపలికి చొచ్చుకొని ఏర్పడ్డది. శరీరాంతరాళములను క్రమ్మిఉండే మ్యూకస్, పొర ఉపరితలమును క్రమ్మిఉండే చర్మమూ కలిసే ప్రదేశమును మ్యూకో—క్యుటేనియస్ జంక్షన్ (Muco-Cuteneous Junction) అంటారు. క్యూటిస్ (Cutis) అంటే చర్మము. మ్యూకస్ పొర చర్మమునకు మధ్య సంధి అని యీమాట కర్థము. ఇటువంటి ప్రదేశముల మధ్య స్పర్శేంద్రియానికి సంబంధించిన నరాగ్రములు అధికంగా ఉంటవి. వీటినే మనవారు నవ రంధ్రములు అన్నారు. గుదనాళము అంతంలో గుద ద్వారము ఉన్నది. అది నవరంధ్రములలో ఒకటి.

పెల్విస్ అంటే బేసిన్ కదా, ఆ బేసిను అడుగు కొన్ని కండరములు, అనుబంధ ధాతువు, చర్మము కలసి ఏర్పడ్డది. కుడివైపున, ఎడమవైపున ఉండే కండరములు కలిసేచోట ఒక గీత వంటి నిర్మితి ఉన్నది. గుదనాళము మ్యూకస్ పొరలో మ్యూకస్ అనే జిగురు పదార్థమును స్యందించే గ్రంధులున్నవి. ఇవి క్రిమిదోషానికి గురి అయినప్పుడు ఏబ్సెస్‌లు ఏర్పడుతవి. ★



# మనిషి-మిథ్య

ఆదివిష్ణు

జ రి గి న క థ

జానకిరామయ్య రిటైరైన బడిపంతులు. ఆయనకు నిరంజనం, శంకరం, సుశీల అని ముగ్గురు సంతానం. శంకరం ఉద్యోగ ప్రయత్నంలో వుంటాడు. జానకిరామయ్య సుశీల పెళ్ళిగురించి ఆలోచిస్తూ వుంటాడు. ఉద్యోగం కోసం మిత్రుడు రంగారావు ఇంటికి వెళ్ళిన శంకరం ఆ దంపతులు ప్రవర్తన నచ్చక ఇంటికి వచ్చేస్తాడు. మామగారు తనపై అధికారం చెలాయిస్తున్నాడని నిరంజనం బాధపడ్తాడు. తండ్రికి సాయంగా శంకరం నిరంజనం ఇంటికి వస్తాడు. అక్కడ శారదతో పరిచయమౌతుంది. విజయవాడలో శంకరానికి ఉద్యోగం వచ్చింది. సినిమాహాల్లో శారద కన్పించి ఇంటికి రమ్మని ఆహ్వానిస్తుంది. శంకరం రాసిన నవల త్వరలో ప్రకటిస్తామన్న పత్రికాప్రకటనచూసి సుశీల ఎంతో ఆనందిస్తుంది, అదేవిషయం ఆఫీస్‌లో కొందరికి అసూయాజనకమౌతుంది. సమయం చూసి వాళ్లపై దెబ్బతీయాలని వాసు, పతి, ప్రసాదం ఎదురుచూస్తుంటారు. శంకరం ముభావంగా ఉంటాడు. శాస్త్రి మృణాళినితో తను నటించబోయే నాటకాన్ని గురించి చెప్పి బయటకువస్తుండగా ప్రసాదం ఆపి పరోక్షంగా గేలి చేస్తాడు. మామగారు క్షమాపణ చెప్పుకోగా నిరంజనం శాంతిస్తాడు. కుసుమ తమ ఇంటికి ఆహ్వానించగా వెళ్తాడు, ఆమె తన దీన గాథ వినిపించి రాజారావే తన భర్త అని చెప్పగా ఎలాగైనా వాళ్ల కాపురం నిలబెట్టాలని నిశ్చయించుకుంటాడు శంకరం.

## 10

మరో అయిదు నిమిషాల్లో శారద కామాక్షమ్మ గార్ని వెంటబెట్టుకొచ్చింది. ఆవిడను చూడగానే గౌరవంగా నిలబడి అందంగా నమస్కారం చేశాడు శంకరం. అతని వినయానికి కామాక్షమ్మగారు లోలోన మురిసిపోయేరు.

"కూర్చో బాబూ ! ఈ ఊళ్లో ఉంటూ గూడా యిక్కడికి రావడమే మానుకున్నావ్? మేము పరాయివాళ్ల మనుకున్నావా ఏమిటి ?"

"అబ్బే అదేం కాదండి. తీరుబడిలేక...."

"అదేమిటయ్యా—మరీ అంత తీరుబడిలేని పనులేమున్నాయి నీకు ?"

"ఆయనగారికి మిత్రు లెక్కువమ్మా. వాళ్ల

తోనే సరిపోతుంది యిరవైనాలుగ్గంటలూను. ఏ థియేటర్లో చూచినా వీళ్ళే." అన్నది శారద నవ్వుతో.

"ఇంకా ఎన్నాళ్ళులే సరదాలు. రేపు ఆ మూడు ముళ్ళూ పడితే యిక కాళ్లకి బంధాలేగా మరి. ఏమంటావయ్యా ?" అన్నా రావిడ.

శంకరం సిగ్గుతో తల వంచుకున్నాడు.

"సరే. మీ రిద్దరూ మాటాడుతూండండి. వంట గదిలో పని చక్కబెట్టుకొస్తాను" అని చెప్పి కామాక్షమ్మగారు వంట గదిలోకి వెళ్లారు.

శారద తనముందు సోఫాలో కూర్చున్నది.

"ఏమిటండీ విశేషాలు" అడిగింది.

"ఏమీ తోచక యిలా వచ్చాను."

"అవుతే మీకిప్పుడు తోచేట్టు చెయ్యాలన్న మాట. మీ నవల చదువుతున్నాను. చక్కగా ఉంది."

"మీ పాటకంటేనా ?"

"అహ .... పోతే మీ గురించి అప్పుడే ప్రాపగాండా గూడా మొదలెట్టాను. ఆ నవల వ్రాస్తున్నది ఫలానా అని .... "

"మీ పాటలు వినాలని ఉంది" అన్నాడు మాట మధ్యలో.

"ఏమిటో విశేషం ?"

"విని చాలారోజు లయ్యింది కదా !"

"అయితే పాడక తప్పదంటారు."

"అనేగా .... "

"ఏం పాడమంటారూ ?"

"మీ యిష్టం ?"

"శ్రోతలు మీరు కాబట్టి, ఏం పాడాలో మీరు అడగడం సబబు."

"మీరేం పాడినా అభ్యంతరంలేదు కాబట్టి, ఇక శ్రోతలు కోరిన పాటనేది మీకు వర్తించదు."

ఇద్దరూ నవ్వుకున్నారు. నవ్వులు ముగిసిన తర్వాత శారద ఒక అష్టపది పాడింది.

'రమతే యమునా పులిన వనే—'

పాట, పాటకు తగ్గ కమ్మటి గాత్రం, శ్రావ్యమైన రాగాలాపన, మధ్య మధ్య అందమైన చెణుకులూ—అతడ్ని ముగ్ధుడ్ని చేశాయి. తన్మయత్వంలో పాట ముగిసిన మాట కూడా మరిచేడు.

సంగీతంలో ఉన్న చాతుర్యం అది. బాధలూ, వ్యధలూ అన్నింటినీ పరపింపచేయగలది సంగీతం. శ్రోతని మధురూహలలో ముంచెత్తేదీ సంగీతమే. అందునా శారద పాటకి ఒక ప్రత్యేకత ఉంది. ఆమె సార్థక నామధేయురాలు.

పాటైన తర్వాత శారద నవ్వుతూ అన్నది,

"ఇక మీరు యీ లోకానికి రావచ్చు."

"రాను. నేను రాలేను. మరో అష్టపది .... ప్లీజ్ .... నాకోసం మరొక్కటి" అన్నాడు శంకరం.

అతని కోరిక ప్రకారం మరొకటి పాడింది.

'రాధికా కృష్ణ తవ విరహే కేశవ.'

ఆమె కంఠంలోని తీయదనం అతనికి హాయి కలిగించింది. అతను అన్నాడు.

"నిజం మీరు చక్కగా పాడగలరు."

"మీరు మంచి కథలు రాయగలరు."

"అబ్బ నన్ను చెప్పనివ్వండి."

"నన్ను చెప్పనివ్వండి."

ఇద్దరూ ఇలా మొహమాటం పడుతూండగా కామాక్షమ్మగారు కాఫీ తీసుకొచ్చారు.

"ఏమిటర్రా అసలు విషయం ?"

"నువ్వే చెప్పమ్మా—శంకరంగారు మంచి కథలు రాయరూ ?"

"మీరే చెప్పండి—శారద చక్కగా పాడగలదు కదూ ?"

ఇద్దరి వాదనలూ విని ఆవిడ ముసిముసిగా నవ్వుతూ,

"ఇద్దరూ ఇద్దరే ! ముందు యీ కాఫీలు తాగండి. తర్వాత తీరుబడిగా వాదించుకోవచ్చు." అన్నారు.

కాఫీలు తాగుతూండగా కామాక్షమ్మగారు మళ్లీ వంటగదిలోకి వెళ్లారు.

"ఒక నాలుగు రోజులపాటు ఎక్కడికైనా వెళ్లాలని ఉంది" అన్నాడు శంకరం కాఫీ కప్పు కింద పెడుతూ.

"ఎందుకనిట ?"

"వాతావరణంలో మార్పు కావలసి వచ్చింది."

"ఇది వైద్యుల నిర్ణయమా ?"

"కాదు—మనసు తొందర చేస్తోంది. నాలుగు రోజులపాటు ఎక్కడైనా నిశ్చింతగా గడుపుదాం పదా అని."

"మరి ఎక్కడికి వెళ్లాలనుకుంటున్నారు."

"ఇంకా నిర్ణయించుకోలేదు."

"అవుతే ఒకపని చెయ్యండి."

"చెప్పండి."

"అమ్మా, నాన్నా, నేనూ రేపు భద్రాచలం వెడుతున్నాం. మీకేమీ అభ్యంతరం లేకపోతే మీరూ రావచ్చు."

"థాంక్స్. రక్షించారు. తప్పకుండా వస్తాను. నా విషయం మీ పేరెంట్స్‌తో రెకమెండు చేసి పుణ్యం కట్టుకోండి."

"ఇందులో నా రికమెండేష నేవిటండోయ్."

"మరేం లేదు—మీ కంపెనీలో నన్నూ చేర్చుకోడానికి. అన్నట్టు నా ఖర్చులు నేనే భరిస్తాలెండి."

"ముందే అన్నాగా, మీకు అభ్యంతరం లేకపోతే మాతో రావచ్చునని. పోతే, ఖర్చు విషయం మాత్రం ఆలోచించాలి."

"సెలవుపెట్టి ఉదయమే మీ యింటికి వస్తాను."

"తప్పకుండా."

కామాక్షమ్మగారు శారదని లోపలికి పిలిచి ఏదో మాటాడారు. తర్వాత శారద శంకరం దగ్గరకొచ్చి అన్నది.

"వొచ్చినవారు ఎలాగో వచ్చారు కాబట్టి

ఈపూట మా ఆతిథ్యం స్వీకరించి వెళ్ళవలసిందిగా అమ్మగారు కోరారు. కాబట్టి తెలియజేయడమైనది.''

''మరి .... భద్రాచలం.''

''అవన్నీ నేను చూచుకుంటాను. మీరీపూట మాత్రం మా యింటో చెయ్యి కడుక్కోవాలి మరి.''

''అయితే నాకే అభ్యంతరమూ లేదు.''

''చాలా థాంక్స్. మీరు చాలా బుద్ధిమంతులనీ, మంచి బాలురనీ అమ్మగారి అభిప్రాయం.''

''ఇంకా ఏమైనా ఖబుర్లు చెప్తుదురూ.''

''ఖబుర్లు చెప్పను. కథ చెప్తాను.''

''కథే .... అయితే చెప్పండి'' అన్నాడు ఉత్సాహంగా.

''అనగనగా ఒక అబ్బాయి. ఆ అబ్బాయి పేరు శంకరం. అతనికి ఒకరో జేమైందంటే .... ''

''నా కథేఅయితే నే వినదలుచుకోలేదు.'' అన్నాడు శంకరం విసుగు ప్రదర్శిస్తూ.

శారద పకపకా నవ్వేసింది. శారద నవ్వు నిర్మలంగా, హాయిగా, తీయగా ఉంటుంది.

—మరుసటిరోజు సెలవు పెట్టాడు శంకరం. మిత్రులు విషయ మడిగారు. తన భద్రాచల ప్రయాణం గురించి చెప్పాడు శంకరం. శంకరం వెళ్లిపోతుండగా,

''విష్ యూ ది బెస్టాఫ్ లక్'' అన్నాడు ప్రసాదం. శంకరం నవ్వేశాడు.

ఆరోజు ఉదయం 11 గంటలకి శారదా వాళ్లతో భద్రాచలం బస్సెక్కాడు శంకరం.

* * *

ప్రసాదం మృణాళిని గదిలోకి వెళ్లేడు. తనొచ్చినట్టు చిన్న పకిలిరవు ద్వారా తెలియజేశాడు. మృణాళిని ప్రసాదాన్ని చూచింది.

''ఏం బావా ?''

ప్రసాదం కుర్చీ లాక్కుని కూర్చుంటూ,

''ఎంతసేపని యిలా వంటరిగా గదిలో కూర్చోడం.''

''నీకు కష్టంగా ఉందా ?''

''ఇలాటి సాయంత్రాలు వృధా చేయకూడదు చిట్టీ.''

''వూఁ .... మరేం చెయ్యాలిట.''

''అలా బేరేజీ వైపో, సీతానగరం రోడ్డుమీదో నడుచుకుంటూ చల్లగాలిని ఆస్వాదిస్తూ—''

''బాగానే ఉంది.''

''గొప్పగా ఉంటుందని తెల్సా ? అప్పుడుగాని ఏమి నీ హాబీలేమి టసలు ?''

''ఇవ్వాళ్టేదో కొత్తగా ఉన్నా వేమిటి ?''

''నేను ప్రసాదరావునీ, నువ్వు మృణాళినివి—మనలో కొత్తగా ఎవరూ లేరు. ఇద్దరం పాత వాళ్లమే.. పోతే, నా ప్రశ్నే, నీ హాబీ లేమిటి ?

''ఎందుకో ?''

''మరేంలేదు. మనిషై పుట్టిన తర్వాత ప్రతివాడూ కొన్ని హాబీలంటూ నిర్ణయించుకోవాలి. లైఫ్‌ని ఎంజాయ్ చేయ్యాలంటే, విసుగెత్తిన మనసు రిలాక్స్ కావాలన్నా యీ హాబీలు అవసరం. అంతేగాని, జీవితానికి ఓ దృక్పథమంటూ లేక, యీసురోమను మనుషులుంటే దేశ మేగతి బాగుపడునోయ్ వెధవాయా ! అన్నాడు అప్పారావు.''

''ఇప్పుడు నువ్వు చెప్పే హాబీకీ, దేశానికీ సంబంధ మేమి టసలు ?''

''అక్కడే ఉంది గొప్ప ట్రిక్కు. నీలాటి ఆడపిల్లలకి, అందునా యిరవై నాలుగ్గంటలూ నాలుగు గదుల మధ్య గోళ్ళు గిళ్ళుకుంటూ కూర్చున్నదానికి యిలాటి గొప్ప విషయాలు ఒక పట్టాన

44 వ పేజీ చూడండి





# కీలర్ ప్రపంచం

కెప్టెన్ ఎఫ్. కొలబావాలా

# వార్డ్‌తో పరిచయం

అప్పట్లో డాక్టర్ స్టీఫెన్ వార్డు 'వింపోల్ మ్యూస్'లో ఉండేవాడు. ఒకరోజు ఆయన ఇంటికి వెళ్ళాను. 'డ్రాయింగ్ రూమ్'లో గోడకు తగిలించి ఉన్న బుద్ధ భగవానుడి చిత్రపటం తీసేసి వెనకాల అతి నైపుణ్యంతో అమర్చి ఉన్న కిటికీ లోంచి చూడమని నన్ను ఆహ్వానించాడు. ఆ కిటికీ గాజుకి అవతలివైపు అద్దం వేసి ఉన్నా ఇటు నుంచి చూస్తే అద్దం ఉన్న పడకగది లోపలికి స్పష్టంగా చూడచ్చు. తొంగిచూశాను— అదిరిపోయి వెనక్కి తూలాను.

'ఈ ఒకవైపే అద్దం' ద్వారా కనిపించిన దృశ్యం చెప్పరానిది. ఆ గదిలో కొందరు పురుషులు, స్త్రీలతోబాటు, మొహానికి చిన్న 'బురఖా' తప్ప శరీరానికి వేరే తొడుగు ఏదీ లేని వ్యక్తి ఒకతను కనిపించాడు.

మరోసారి తొంగి చూద్దామనుకున్నాను కాని, డా. వార్డ్ కిటికీని బుద్ధుడి బొమ్మతో కప్పేసి, నన్ను ఒక సోఫాలోకి తోసి కూర్చోపెట్టి తన 'సిద్ధాంతాల' ని విడమరచి చెప్పాడు; నమ్మండి, మానండి కాని ఆయన 'సెక్స్' ద్వారా ప్రపంచాన్ని ఉద్ధరించ దలచాడుట.

"సెక్స్ ద్వారా లోకానికి పునరుజ్జీవనమా? అంటే ?" అని అడిగాను నేను.

"అంటే, అంతే !" అని డా. వార్డ్ జవాబు చెప్పాడు. "అనాదిగా మానవుడు లోక పునరుజ్జీవనానికి, ఆత్మవికాసానికీ ఎన్నో ప్రయత్నించి చూశాడు. రాజులు, సామ్రాజ్యాలు, వలసరాజ్యాలు, ప్రజాస్వామికాలు, సమాజవాదాలు, కమ్యూనిజం, ఫాసిజం—ఇవన్నీ నిష్ప్రయోజనం అయ్యాయి కదా!

## సెక్సివలేషన్

"నేనీ ప్రశ్నని బాగా పరిశీలించాను. దానికి సమాధానం 'సెక్సివలేషన్' లో ఉంది. (సెక్స్ + రివలేషన్ = సెక్సివలేషన్ అని అయిఉండవచ్చు. ఈ ఇంగ్లీషు సృష్టికి తెలుగు పర్యాయపదం ఏముంటుందో చెప్పటం కష్టం !—అ) నేను మనశ్శాస్త్రం అభ్యసించాను. రాజకీయాలు, సెక్స్— వీటి రెండిటిలోనూ పరిశోధనలు నడిపాను. రెండిటి సమ్మేళనం కోసం కృషిచేసి ప్రపంచంలో సహజీవనానికి తోడ్పడి మానవజాతికి సంబంధించిన ప్రమాదాన్ని వైదొలగిస్తాను. ఇదంతా మీ కెందుకు చెబుతున్నాను కాప్టెన్?

"మీరు ఇండియా నుంచి వచ్చారు కాబట్టి !" డా. వార్డ్ తన ప్రశ్నకి తనే సమాధానం చెప్పాడు. "ఒక కాలంలో మీవాళ్ళు సెక్స్(లేక కామాని)కి సంబంధించిన సిద్ధాంతాలకి సంపూర్ణత చేకూర్చారు ! ఈ సిద్ధాంతాలతోటి జీవితమార్గాన్నే చూపారు. కాని, మీరు ఆ మార్గాన్నిప్పుడు మర్చిపోయారు. జాన్ మాస్టర్స్ నవల 'వీనస్ ఆఫ్ కొన్చారా' లేక డా. ముల్కరాజ్ ఆనంద్ రచించిన 'కామసూత్రా' చదివారా ? చదివితే తెలుస్తుంది.

"కోనార్క, ఖాజురహో దేవాలయాల శిల్పాలు చూసినా తెలుస్తుంది, మీ దేశంలో కామానికి సంబంధించినంతవరకూ పరిపూర్ణత సంపాదించేశారని. ఈ కామం ద్వారానే మన అహాన్ని, ప్రపంచాన్నీ కూడా జయించవచ్చు. 1940 ప్రాంతాలలో మీ దేశం వచ్చి ఈ విషయాలు స్వయంగా నేర్చుకున్నాను. నా యీ సిద్ధాంతానికి 'కోసెక్సిస్టెన్స్' (కో + సెక్స్ + ఎక్సిస్టెన్స్=కోసెక్సిస్టెన్స్ —దీనికి తెలుగు ఏమిటి ?!—అ.) అని పేరు పెట్టాను. నశించిన ఈ భారతీయ సిద్ధాంతాలకి లండన్‌లోనూ, ఆధునిక ప్రపంచ మంతటా పునర్జన్మ నివ్వటమే నా ఆశయం."

లండన్ డాక్టర్లలో అగ్రశ్రేణికి చెందినవాడూ, లలితకళలలో మంచి ప్రవేశం కలవాడూ, లౌక్యుడూ,

## • డాక్టర్ వార్డ్ పిచ్చివాడా ?

## • ప్రపంచాన్ని ఉద్ధరించాలని అతని ఆశయంట !

## • కీలర్ కళ్లల్లో ఇంద్రజాలం ఏదోవుంది....

గణికలని సరఫరా చేసేవాడూ, స్త్రీ పురుష లింగ భేదాలని గుర్తించనివాడూ, రాజ కుటుంబానికి మిత్రుడూ, 'సొసైటీ' పక్షి అయిన డా. వార్డ్ తన సిద్ధాంతాలని విడమరిచి చెబుతూఉంటే నోరు తెరిచి వినటంకన్నా వేరే ఏమీ చెయ్యలేకపోయాను. మనిషి చూస్తే మేధావి; కాని ఒక 20 వ శతాబ్దం నెపోలియన్ బయలుదేరి సైన్యంతో, సేనానులతో కాక శీలంలేని యువతీ యువకులతో లోకాన్ని జయిస్తానంటే ఏమనాలి ?

లండన్ నగర జీవితంలో 'మరో ప్రపంచం' ఉందని అందరికీ తెలుసు. ఇది పైకి కనుపించదు. దీనిని 'అథోలోకం' అందాము. ఈ 'లోకా'న్ని పరిశీలించాలని బయలుదేరినప్పుడు డాక్టర్ వార్డ్‌ని వదిలి ఏమీ చెయ్యలేమని తెలుసుకుని ఆయనతో ఇంటర్వ్యూ కోసం ప్రయత్నించాను.

లండన్ 'ఎక్స్‌ప్రెస్' పత్రికకి ఒక వ్యాస శీర్షిక రాస్తున్నాను. శృంగారరస ప్రధానమైన విషయాల సంగతి తెలుసుకోవాలంటే 'సోహో'— లండన్‌లో ఒక పేట—కి వెళ్లాలి. మత్తు మందులు అమ్మేవారు, పడుపుకత్తెలు, బ్లాక్‌మెయిలర్లు, అవినీతికరమైన వ్యాపారాలు చేసేవారు, వీరందరినీ ఇక్కడ కలుసుకోనవచ్చు. అందుకని ఇక్కడ ఒక భారతీయుడు పెట్టిన 'కొంతెస్సా కాసినో' అనే చోట పనికి కుదిరాను.

### వార్డ్ పరిచయం

ఆ వింత వ్యక్తి డాక్టర్ స్టీఫెన్‌వార్డ్‌ని నేను మొదటిసారిగా కలవడం ఇక్కడే. అన్ని నీతి నియమాలనీ అతిక్రమంచేవాడుగా కనిపించాడు నాకు. (నా వ్యాస శీర్షిక 'టెన్ కమాండ్‌మెంట్స్' కాబట్టి ఈయన ఒక 'డెవిల్' అనిపించాడు. సప్తమహాపాతకాలూ చేసినవాడనుకున్నాను !)

క్రిస్టీన్ మార్గరెట్ కీలర్‌ని కూడా ఇక్కడే కలిశాను. బైబిల్ పరిభాష వాడుతున్నాను కాబట్టి ఈమె ఒక 'ఫాలెన్ ఏంజల్' (భ్రష్టురాలయిన దేవత ?!) అన్నా పరవాలేదు. ఆమెతో మాట్లాడాను. ఆమె నా కౌగిట్లో ఉండింది—ఇద్దరం కలిసి డాన్స్ చేస్తున్నప్పుడు. ఆమె కళ్లలో 'ఇంద్రజాలం' ఏదో ఉంది, 'పడకగది కళ్లు' అంటారు వాటిని. ఆమెని చూస్తేనే ప్రేమించి, వాంఛించ బుద్ధి వేస్తుంది !

సోహోలోని వార్డూర్ వీధిలో నేను ఉన్నప్పుడే అందాలరాశి షారన్‌లీ—అసలు పేరు సిల్వియా పార్కర్; డా. వార్డ్ మిత్రురాలు—ఆమె స్నేహితులిద్దరినీ తుపాకులతో కాల్చి చంపేశారు.

డాక్టర్ వార్డ్ 'ఫ్రెండ్' లలో మరొకరు— 18 సంవత్సరాల బంగారు జుట్టు అమ్మాయి మారిలిన్(మాండీ) రైస్—డేవిస్ పరిచయం కూడా అయింది నాకు. ఈమెని తర్వాత జయిలుకి పంపించారు, రాజ కుటుంబానికి వార్డ్ 'కార్యక్రమాల'కి పొత్తు ఉన్నందన్నందుకు !

ఈ సోహో సిమెంటు కాంక్రీటు అడవి సందుల్లో ఆ దేశంలోని ప్రముఖులనీ, ధనవంతులనీ, యౌవనంలో ఉండే 'పతనం' చెందిన వారినీ కలిశాను.

డ్రింక్స్ మీద డాక్టర్ వార్డ్‌తో పిచ్చాపాటి మాట్లాడాను. విచిత్ర మేమిటంటే ఆయనకి ఇండియా అంటే, ఇండియన్ స్త్రీలంటే, అందులోనూ రాణీలు, మహారాణీలంటే ఎంతో ఆసక్తి. కోనార్క్, ఖజురహో చెక్కడాలలో సూచించే ఒక పరిపూర్ణ జీవనమార్గం నిర్మించారుట రుట భారతీయులు—కామంలో స్వేచ్ఛ, పరిపూర్ణత్వమూ సాధించారుట వీరు. 'కామసూత్రాల' సంగతి చెప్పనే అక్కర్లేదు !

"ఇండియన్ స్త్రీలంటే నాకు చాలా ఆసక్తి" అన్నాడు డా. వార్డ్. "లండన్‌లో కోనార్క్, ఖజురహో నాగరిక పద్ధతులని మళ్లీ సృష్టించాలని ఉంది నాకు. ప్రాచీన భారతదేశం సాధించిన కామపరిజ్ఞానాన్ని ఆధునిక ప్రపంచంలో ఒక జీవన్మార్గానికి పునాదిగా వేస్తాను నేను ! ఈ కామసిద్ధాంతంతో వైయక్తిక, జాతీయ అంతర్జాతీయ సమస్యలని, ప్రచ్ఛన్న యుద్ధ సమస్యని, మత సమస్యలని పరిష్కరించవచ్చు.!



అందమైన మాండీ ...

"కామ తృప్తి లేకనే ఈ సమస్యలన్నీ ఏర్పడుతున్నాయని నా అభిప్రాయం. పరిపూర్ణమయిన సంతృప్తి ఉంటే చాలు, అన్నీ సమసిపోతాయి."



డాక్టర్ వార్డ్ : చిత్రలేఖనం అతని ప్రత్యేకత.

కుల, మత, వర్ణ, వర్గ, జాతి, ఖండ విభేదాలు లేని మానవ సమాజం స్థాపించాలని తను కనే కలలను గురించి చెప్పుకుపోయాడు డా. వార్డ్. ఇదంతా కామ సంతృప్తిలోనే సాధ్యం అని ఆయన నమ్మకం.

"ఇటువంటి సమాజం ప్రాచీన భారతదేశంలో ఉండేది! కామసూత్రాలు, కోనార్క్, ఖాజూరహోల అర్థం ఏమిటి?" అన్నాడు నాతో.

# కిల్లర్

"ఇటువంటి సమాజమే ఇక్కడ నెలకొల్పుతాను. దానికి లండన్ ముఖ్యపట్నం అవుతుంది!"

## పిచ్చివాడా?

డా. వార్డ్ పిచ్చివాడా, వెడ్డవాడా, తెలివి తక్కువవాడా అనుకున్నాను. కాని, మనిషి చాలా తెలివైనవాడిలాగా, నిష్కల్మషమైన స్వభావం కలవాడు. మా ఇద్దరి మైత్రి—ఆమాట వాడటానికి అభ్యంతరం లేకపోయినట్లయితే—ఎక్కువయింది.

చాలాసార్లు 17, వింపోల్‌మ్యూస్ లో అతని ఇంటికి వెళ్లాను. కయువ్‌డెన్ కాటేజ్ అని మరో ఇల్లు ఉండేది. అక్కడికీ వెళ్లివస్తూ ఉండేవాడిని. రెండూ లోకప్రసిద్ధమయిపోయాయి వార్తాపత్రికలలో.

అతని మ్యూస్ ఇంట్లో అలంకరణ విచిత్రంగా ఉండేది. ఎన్నో సౌకర్యాలు అమర్చారు. అతనికి ఒక 'క్రీమ్' రంగు 'జాగ్వార్' కారు ఉండేది. సమలైంగిక వాంఛ ఉండేవారికి ఇదొక గుర్తు.

ఇంట్లో చలిమంట వేసేచోటుపైన గోడకి షిరన్‌లీ—సోహోలోని వార్డూర్ స్ట్రీట్‌లో ఒక పోట్లాటలో ముక్కు విరక్కొట్టుకున్న అమ్మాయి—బొమ్మ ఒకటి తగిలించి ఉండేది. చిత్రకారుడు డా. వార్డే.

నా ఇంటర్వ్యూలు జరిగే సమయానికి షిరన్‌లీ డాక్టర్‌తోనే ఉండేది. తర్వాత ఆమెతో మాట్లాడి నప్పుడు వార్డ్ ఆతిథ్యానికి కృతజ్ఞురాలనని చెప్పేది. నేను ఆశ్చర్యపడేవాడిని!

డా. వార్డ్ సౌమ్యుడు, పడుపు వృత్తిని, వక్ర గతులని రాజకీయ కళగా, విద్యగా వినియోగించు కున్నాడు. ఆయన పుణ్యమా అంటూ సోహో లోని లండన్ వైట్‌హాల్‌కి పొత్తు కుదిరింది—కొందరు ప్రముఖుల ఇళ్లలో.

డాక్టర్ వార్డ్ సిద్ధాంతాలు, వాదాలు, పద్ధతులు, కలలు, అలవాట్లు గురించి చెప్పాను.

"సెక్స్" ద్వారా "విజయం సాధిస్తా" నన్న అతని 'మతా'న్ని చూసి చకితుడి నయ్యాను.

నాకు అర్థంకాలేదు. ఈ 'స్వేచ్ఛా కామం', 'కో - సెక్సిస్టెన్స్' నేను నేర్చుకున్న నమ్మిన ధర్మాలన్నిటికీ విరుద్ధంగా ఉంది.

ఈ అవినీతిని చూసి అదిరిపోయాను. కామం ద్వారా విముక్తి కావాలన్న ఆయన ఆశయాన్ని చూసి అసహ్యించుకున్నాను.

అయితే డా. వార్డ్‌లోని ఆకర్షణ ఎటువంటి దంటే ఈ అవినీతిలోనే ఒక విధమైన నీతి కనిపించింది!

అందుకనే—

* డాక్టర్ వార్డ్ క్రిస్టీన్‌కీలర్‌లాంటి యువతులని చేరదీయగలిగాడు.

* వారిని 'హై సొసైటీ'(అభిజాత్య వర్గాలా?) లోకి తీసుకుపోయాడు,

* రాజకుటుంబంతో స్నేహం సంపాదించుకొన గలిగాడు.

* యుద్ధశాఖ కార్యదర్శి శ్రీ జాన్ ప్రొఫ్యూమోకి ఆప్తుడయ్యాడు— (సశేషం)

# కరుణాత్ముురాలు

15 వ పేజీ తరువాయి

బొమ్మలా, నేను కాళ్లమీద పడుకోబెట్టుకు ఉత్తుత్తి నీళ్లు పోసే చందనం బొమ్మలా—వీటితోపాటుగా - ఊహకు మించిన చురుకుతో, వయసుకి మించిన తెలివితో—చక్కని చుక్కలా మెరుస్తూ, పచ్చని మొక్కలా ఎదుగుతూ—మా తమ్ముడు నా కిచ్చిన పులకింతలు, గిలిగింతలు—ఇవన్నీ కూడా అన్నీ ఉత్తుత్తి అని కలలో కూడా అనుకోలేదు!

'ఇదేమిటండీ—చిట్టిగాణ్ని పాలు పొయ్యడానికేనా నా చేతికి ఇవ్వదేం ఈ సీత? ఇది రేపొద్దుట ఇక్కడ వీ ణ్ణొదిలిపెట్టి అత్తారింటికి ఎలా వెడుతుందీ?'

కాని, ఏం చేస్తుంది, అందరిలాంటి ఆడదే ఈ సీతాను! ఆ బుగ్గమీదా ఈ బుగ్గమీదా చెరో









ముద్దు పెట్టుకుని, ఆ చేతిలోనూ, ఈ చేతిలోనూ చెరో రూపాయి పెట్టి, ఆ కంటినీ, యీ కంటినీ మరొకసారి తుడిచి గుండె రాయి చేసుకుని బండీ ఎక్కేను! మా పద్మావతి ఏడాది పిల్లప్పుడు—పెరటి అరుగుమీద కూచుని మంచి మాటలాడి అన్నం తినిపిస్తున్నప్పుడు—వచ్చిపడింది టెలిగ్రాము.

చిట్టికి టైఫాయిడు వచ్చిందనీ వెంటనే రమ్మనీ ......

ఈ అయిదారేళ్లలోనూ వాడిలో అంతటి మార్పు నేను ఎప్పుడూ ఊహించలేనిది .... నన్ను వాడు మరిచిపోయాడని కాదు .... కాని వాడి ప్రాణాలన్నీ ఇప్పుడు వేరొక వ్యక్తిమీద ఉన్నాయి. వాడితో సెకండు ఫారం చదువుతున్న కుర్రాట్ట .. వారాలు చేసుకుని చదువుకునేవాడట .... ఆరో ప్రాణంలా తమ్ముడు జబ్బుతో బాధపడుతున్న న్నాళ్ళూ, ఆ కుర్రాడు, వాడి పేరు వేణుట, తమ్ముణ్ణి వదిలిపెడితే ఒట్టు ....

అయ్య యివ్వలేనిదీ, అక్క చెప్పలేనిదీ—ఆఖరికి అమ్మ కూడా పెట్టలేనిదీ—ఏదో—వేణు, తమ్ముడికి యిచ్చేవాడు. కాళ్లు పిసికేవాడు. తల వత్తేవాడు. కథలూ, కబుర్లూ చెప్పేవాడు.

అయిదు నిమిషాలు వాడు అవతల కెడితే చాలు.

'ఒరే వేణూ' అని తమ్ముడు పిలిచేసేవాడు.

'ఒస్తున్నారా గోపీ' అని పరుగెత్తుకు వచ్చేసేవాడు.

ఆ పిలుపులో ఆప్యాయత, ఆ జవాబులో ఆత్మీయత, అక్కడున్న వాళ్లకర్థంకాని విషయాలు.

'వేణూ, నన్ను విడిచి ఎక్కడకూ వెళ్ళవు కదూ ?'

'నే నెక్కడికి వెడతాన్రా గోపీ, నా కెవరున్నా రని ? మరి నువ్వు ? నన్ను విడిచి వెళ్లిపోవు కదూ ?'

'ఛా అబ్బాయ్ ఏం మాటలవి ?' అని నేను దెబ్బలాడేదాన్ని.

ఒకళ్ల నొకళ్లు కౌగలించుకుని పడుకునేవారు. ఓనాడు డాక్టరుగారు వచ్చి నాన్నని గట్టిగా కేకలేశారు.

'మీకేం మతుందా, పోయిందా, అంటురోగమని తెలిసి కూడా ఆ అబ్బాయిని మీ గోపీ కూడా పడుకోనిస్తున్నారా.'

చిట్టిగాడికి నిద్ర పట్టినపుడు వేణుని మెల్లిగా పక్కలోంచి తీసేశాను. తెలివి రాగానే గోపీ ఒకటే ఏడుపు! ఏమయినా వేణుని దూరంగానే ఉంచేశాము. ఆ రాత్రి తమ్ముడికి మళ్లీ నూటమూడు వచ్చేసింది! ఎలాగ, ఏం దారి ?

ఆ రాత్రి నేను, అమ్మ, నాన్న, అందరం కూచుని తమ్ముడికి బోధపరిచాం .... ఎంతో అయిష్టంతో ఎలాగో ఆఖరికి ఒప్పుకున్నాడు .... వేణు కళ్లల్లోకి చూస్తే మాత్రం ఏమాత్రం ఒప్పుకున్నట్టు కనబడలేదు.

ఆ మర్నాటి నుంచీ తమ్ముడికి జ్వరం తగ్గుముఖం పట్టింది. అవాళ జ్వరం తొంభై తొమ్మిదికి కూడా దిగింది. వాడికి ఆ రాత్రి బాగా నిద్ర పట్టింది. కూడ్రాను. పద్మకి పాలు పడదామని ఆ మర్నాడు పొద్దున్న వంటింట్లోంచి యివతలికి వస్తున్నా .... ఏదో మూలుగు వినబడితే ఏమిటా

# కరుణాత్మరాలు

అని చూశాను..... వరండాలో దుప్పటి కప్పుకుని వేణుగాడు ఉహూహూహూ మని వణుకుతున్నాడు. ఇదేమిటని ఒంటిమీద చెయ్యివేసి చూద్దునూ, ఒళ్ళు కాలిపోతోంది! వెంటనే నాన్నని కేకేశాను. ఆయన చెప్పిన ప్రకారం రిక్షామీద వాణ్ణి కూచో పెట్టి—వాళ్లింటికి తీసుకెళ్లి—వాళ్ల మామ్మకి అప్పజెప్పేను.

'అయ్యో, అయ్యో—గుడ్డిముండని కానుకోలేక పోయాను. దిక్కులేనివాడు కదా పెద్దింటి ప్రాపకం అబ్బింది కదా అని మురిసిపోయాను. ఈ జ్వర మేమిటి తల్లీ!' అని గుండెలు బాదుకుంది ఆవిడ. నేనూ, నాన్నా, అమ్మా ప్రతి రోజూ వేణుని చూచి వస్తుండేవాళ్లం. కావలసిన పళ్ళూ, మందులూ యిచ్చేవాళ్లం. ప్రతిరోజూ నాన్న డాక్టర్ని తీసికెళ్లేవాడు. వాడి రోగం పేరు విని మా గుండెల్లో పీచు పీచు మన్నాయి. టైఫాయిడుట!

రోగం తగ్గినకొద్దీ మా చిట్టిగాడిని పట్టుకోడం చాలా కష్టమైపోయింది. ప్రతి నిముషమందూ ఆ వేణుగాడి తలంపే .... రెండు చేతుల

---

ఒక పత్రికలో సినిమా సంపాదకుడు తన డెస్కు మీద 'సినిమా సంపాదకుడు' అనే బోర్డు చేయించి పెట్టుకున్నాడు. పది సంవత్సరాల తర్వాత చనిపోయిన అతని ఉద్యోగం అతని కొడుక్కి వచ్చిందిట. అతను బోర్డుమీద అక్షరాలు సినిమా సంపాదకుని కుమారుడు! అని మార్పించాడు.

కె. కె. రావు (మద్రాసు)

---

వేళ్ళూ కీలించి తల క్రింద పెట్టుకుని .... కళ్లల్లో నీటి బిందువులు బుగ్గలమీంచి కారుతుండగా వచ్చే పోయేవాళ్లందర్నీ నిలదీస్తాడు. వాడికి జవాబు చెప్పడం చాలా కష్టమైపోయింది.

'నా పక్కలో పడుకున్నవాణ్ణి లేవదీసి కూచోబెట్టేరు. కూచున్నవాడిని నిలదీసి వెళ్లగొట్టేరు. ఏడి, నా వేణు ఏడి ?

'ఎక్కడో ఊరు కెళ్ళేడని అబద్ధాలు కూడా దేనికి ? నాతో చెప్పందే యింటికేనా వెళ్లడు వాడు. చెప్పకుండా ఊరికి వెడతాడా ? అన్నీ అబద్ధాలు. వేణుగాణ్ణి ఏం చేశారు ?

'నాతో చెప్పకపోతే నేను తెలుసుకోలేనను కున్నారా ? నా దగ్గిరకి రాకుండా వాడికి ఏ రోగం వచ్చిందో .... నాకు యింత జబ్బు చేస్తే ఇన్ని విధాల నాకు చేసి తగ్గించాడే .... వాడికి జబ్బు చేసినప్పుడు నేను వెళ్లి చూడడానికైనా లేదా ?'

వెక్కివెక్కి ఏడ్చేవాడు. అమ్మ లాలించేది. నేను మరపించేదాన్ని .... నాన్న బెదిరించేవాడు.

**ఎవ రెన్ని చెప్పినా చిట్టిగాడు వింటేనా ?**

అవాళ .... నా జీవితంలో మరచిపోలేని రోజు .... చిట్టిగాడికి పత్యం పెడదామనుకున్న రోజు ..... పగలు పది గంటలయి ఉంటుంది ....

నాన్న కోర్టుకి వెళ్లిపోయారు. ఉయ్యాల మీద పద్మా, గోపీ కూచుని ఊగుతున్నారు. నేనూ అంతసేపూ అక్కడే ఉన్నాను. అమ్మ కేకేస్తే లోపలికి వెళ్లాను, చిన్న వెండిగిన్నెలో చారూ, చిన్న పళ్ళెంలో వేయించిన బీరకాయముక్కలూ పట్టుకుని నేనూ, ప్రత్యేకంగా పత్యానికని లక్కలా ఒండిన అన్నపుగిన్నె, ఇంకోచేత్తో వెండి కంచమూ, మంచినీళ్ల గ్లాసూ పట్టుకుని అమ్మాయివతలికి వచ్చాము. మా చేతుల్లో పదార్థాలు భళ్లున అప్రయత్నంగా జారిపోయాయి! సిద్ధాన్నం నేలపాలయింది. గోపీ ఉయ్యాలమీద లేడు. 'అమ్మా .... మామా .... అ పోయే' అంటోంది పద్మ!

పరుగు పరుగున వేణూ వాళ్ల యిల్లు చేరుకున్నాం .....

'నువ్విలా ఉన్నావని నాకు తెలీదురా వేణూ, నన్ను క్షమించరా వేణూ! అని వేణు పాదాలను కన్నీళ్లతో అభిషేకం చేస్తున్నాడు గోపీ. మమ్మల్ని చూడగానే వాడి పక్కమీదికి చేరిపోయాడు. ఇద్దరికీ ఒకటే దుప్పటి కప్పేశాడు .... వాణ్ణి కౌగలించుకున్నాడు.

'నేను రాను .... నన్ను చంపినా సరే ....'

నాన్నని పిలిపించి అంతా ఆలోచించి ఆఖరికి యిద్దర్నీ ఇంటికి తీసుకొచ్చాం. వచ్చిన నాటి రాత్రే చిట్టిగాడికి జ్వరం మళ్లీ వచ్చింది. వాడికి టైఫాయిడ్ తిరగబెట్టింది!

'ఒరే, మనం ఇన్నాళ్ళూ స్కూలుకి వెళ్ళ లేదు కదా మనకి ఆబ్సెంటు పడుతుంది కదరా' అనుకునేవాళ్ళు.

పడకేం, పడింది. ఇద్దరికీ ఆబ్సెంటు పడింది! రెండు మూడు రోజుల తేడాలో, విధి అనే క్రూరమైన ఉపాధ్యాయుడు తన కఠినమైన హస్తంతో వీళ్లిద్దరికీ ఈ లోకంలో శాశ్వతమైన ఆబ్సెంటు మార్కు వేశాడు!

* * *

నేను, పెరట్లోనే చీకట్లోనే చెట్టు మొదట్లోనే కూలబడిపోయానని చెప్పేను కదూ! నా పిల్లలు నన్ను వెతుక్కుంటూ వచ్చి నన్ను చుట్టుముట్టేశారు.

ఇదేమిటే అమ్మా యిక్కడున్నావ ?

అబ్బా లోపలికి రావే బాబూ.

మాకు భయమేస్తోందే.

ఆకలేస్తోందే.

పదవేమే.

దావే.

లా.

'లక్షలకొద్దీ పక్షులకి ఆశ్రయమిచ్చేదానివి .... వృక్షమా! నువ్వే చెప్పు నా పిల్లలకి ఏ ఆపదా రాదుకదా! నేను కనపడకపోతే ఇలాగే అమ్మా, అమ్మా అని వచ్చి నన్ను వెతుక్కుంటారు కదు, నన్ను చుట్టుకుంటారు కద!'

సుబ్బన్నకి టైఫాయిడు అని తెలిసిన దగ్గిర నుంచీ నాకు క్షణ మొక యుగమైపోయింది. మధ్యాహ్నం నుంచి సాయంకాలం అయేసరికి కొన్ని సంవత్సరాలు గడిచినట్టు అయిపోయింది.

చెవిలో డాక్టరు మాటలు ..... మనసులో తమ్ముడి జ్ఞాపకాలు.

మనసులో విపరీతమైన భయాలు. అయిదింటికి లేస్తే పన్నెండింటికి గాని తెమలని చాకిరీ నన్ను బాధించలేదు, ఇంత చాకిరీ చేసినా అమ్మ అందరికీ లోకువ కనుక అందరూ నన్నే తప్పు పట్టినా నాకు కష్టమనిపించలేదు. ఆఖరికి వరహాలమ్మ గారి సూదుల్లాంటి మాటలు కూడా నన్ను కదిలించలేదు.

'వెంకటరమణమూర్తీ, తండ్రీ, మా ఆపద గట్టెక్కించు.... పిల్లలెవరికీ ఆ విషజ్వరం అంటుకోకుండా రక్షించు .... ఇంటిల్లిపాదీ నీ దర్శనం చేసుకుంటాం !' అని మొక్కుకున్నాను.

'రోగం బాగా వ్యాప్తి చెందే కాలం ఇదే, జాగర్త సుమండీ !' అన్న డాక్టరు మాటలూ .....

'ఎవళ్ళ బాధలు ఎవరికి తెలుస్తాయి ? మళ్ళీ ఆవిడా గంపెడు బిడ్డల తల్లి !' అన్న వరహాలమ్మ శాపనార్థాలూ ......

'విన్నావా వదినా, ఆ సుబ్బన్నకి కొట్టేసిందిట. .... ఇంతమంది పిల్లలతో .... గుంట వెధవలు వద్దంటే ఆ గదివైపు వెళ్ళక మానరాయిరి .... వచ్చింది వచ్చినట్టు వెళ్ళిపోతే మంచిదే అనుకో .... లేకపోతే .... ' అనే వదిన కబుర్లూ ....

అన్నిటినీ మించి .... అందరూ పడుకునేవేళ ... అర్ధరాత్రివేళ .... భయంకర నిశ్శబ్దం పరిహసించే వేళ .....

'అబ్బ .... అమ్మా .... అయ్యో .... బాధ ....' అని భరించలేని శిరోవేదనతో సుబ్బన్న పెట్టే మూలుగు.......

ప్రత్యేకించి ఆ రాత్రివేళ నాకు ఇంచుమించు పిచ్చెత్తేసింది ...... ఆయన ఊళ్ళో లేరు .... నా ఒళ్ళు కోపంతో ఉడికిపోయింది.

'ఎందు కిలాంటి పని చేశారు, ఎవర్నడిగి ఈ కొంపకి ఈ అరిష్టం తెచ్చిపెట్టేరు ? నా పిల్లల్ని ఈ విషవలయంలో తొయ్యడానికి మీ కెవడిచ్చాడీ అధికారం ?

"మీరేం చేసినా సహించాను. ఇంటికి నాలుగు చక్రాలు కట్టి దాన్ని వీధిలోకి ఓ తాడు కట్టి ఈడ్చినా భరించాను..... పదిమందిలో వీరు 'ఓహోహో' అనిపించుకుని 'ఇంతింతై వటుడింతయై .....' అని పొంగిపోతూంటే ఇంట్లో నానా బాధా పడుతూ 'ఆకాశంబున నుండి .... శంభుని శిరంబందుండి ....' అన్నట్టు పాతాళానికి కుంగిపోతూ కూడా శమించాను. .... కాని .... నా పిల్లలు ! నోరెరగని వెర్రి నాగమ్మలు ! మంచీ చెడ్డా ఎరగని పిచ్చి నాన్నమ్మలు ! వాళ్ళు మీకేం అన్యాయం చేశారని ఈ శిక్ష విధించారు ? పాలో నీరో ఎరగరే, పాపమో పుణ్యమో తెలియదే ..... ఏం తప్పు చేశారని వాళ్ళని ఈ పరీక్షకి గురి చేశారు ? మీ సహాకారంలో వివేచన ఉందా ? మీ ఉపకారంలో విచక్షణ ఉందా ?'

మళ్ళీ ఆయన్ని తిడుతున్నందుకు నాకే కష్టమనిపించింది .....

నా తల గిర్రున తిరిగింది ....

నా కంట్లో నీరు గిర్రున తిరిగింది ....

నా చుట్టూ భూమి గిర్రున తిరిగింది .....

ఎంతసేపు అలా ఉన్నానో నాకే తెలీదు.

'అయ్యయ్యో .... అమ్మా .... ఉస్ .... తలనొప్పి ప్రాణం తీసేస్తోందే అమ్మా'

అంతట్లో ఉలిక్కిపడి లేచాను.

పిల్లలందర్నీ లేపి కూచోబెట్టేను. అందర్నీ పేరుపేరునా అడిగాను. ఎవరికీ తలనొప్పి రాలేదు కదా ! అందరి ఒళ్ళూ తడిమి చూశాను. ఎవర్కీ జ్వరం రాలేదు కద !

వదిన దగ్గిర పడుకున్న పద్మాలు గేళ్ళ దంగసి,

పదేళ్ల పద్మని నా గదిలోకి తీసుకొచ్చేశాను. గది తలుపులూ, కిటికీ తలుపులూ వేసేశాను. పిల్ల లందరి మధ్యా పడుకున్నాను. రెండు చేతులూ చాపి అందర్నీ వీలైనంత దగ్గిరగా తీసుకున్నాను.

'చిట్టిబాబూ! గోపీ! పదేళ్ళపాటు నిన్నెత్తుకు పెంచాను. ఎన్నోసార్లు చందమామను చూపిం చాను. నీ అక్కమీద నీకు జాలి లేదా, తమ్ముడూ! మున్నెళ్లిపోయి పెట్టిన చిచ్చు చాలదా, నా పిల్లల్లో ఒకర్ని కూడా తీసుకెళ్లిపోతావా, ఇది నీకు న్యాయమా!'

మళ్లీ మూలుగు వినిపించింది ....

ఇక భరించలేను .... ఇక ఇక్కడ ఉండలేను ....

ఒక అరగంటసేపు కూచుని ముఖ్యమైన సామా న్లన్నీ సద్దుకున్నాను. వదినను లేపుదామను కుంటున్నాను. ఇంతలో ఆశ్చర్యంగా ఆవిడే ఇక్కడి కొచ్చింది. ఆ చీకటిలో ఆమె మొహం ఎలా ఉందో నేను చూడలేదు. .... చూసే పరిస్థితిలో కూడా నేను లేను!

'వదినా! ఎప్పుడూ ఇల్లు దాటి ఎరుగను, హద్దు దాటి ఎరగను! మీ అన్నయ్యకు చెప్ప కుండా కలనైనా కది ఎరగను! వేళగాని వేళ! అది కూడా ఆయన ఇంట్లో లేనివేళ! .... నాలో ఉన్న ఏ ధర్మమో ఈ రాత్రి నన్ను పిల్లల్ని తీసు కుని ఇల్లు విడిచి వెళ్లమని బలవంతం చేస్తున్నది!

'ఏం వదినా, తల ఎత్తి మాటాడవేం? నా మొహంలోకి సూటిగా చూడవేం? .... ఏం చెయ్యను చెప్పు .... పొద్దుట డాక్టరుమాట చెప్పిం దగ్గర్నుంచీ నా మనస్సు చెప్పలేని మధనానికి గురౌ తున్నది .... ఎవరికి ఈ రోగం అంటుకుంటుందో ఈ పసిపిల్లలు ఏమైపోతారో అన్న బెంగ నా నిలు వెల్లా దహిస్తున్నది .... నాన్న దగ్గిరకు వెళ్లి ఒక వారం రోజులుండి వస్తాను ....

# కరుణాత్మురాలు

'ఏం చెయ్యను? ఆయన్ని మాత్రం, తన స్వార్థం ఏం చూసుకున్నారని తప్పు పట్టను? ఏదో డాక్టరుకి చూపించి పంపెయ్యవచ్చునని తీసు కొచ్చారు..... ఇంతగా విషమిస్తుందని ఆయనకి మాత్రం ఏం తెలుసును?.... ఆయనతో చెప్పి వెళ్లకపోవడం తప్పే .... అంతేకాదు, నిశితమూ, నిర్మలమూ అయిన ఆయన పరోపకార చింతలో చివరిదాకా సహకరించే ఓర్పు లేకపోయినందుకు సిగ్గుగా కూడా ఉంది. .... అంతకు మించిన మరో ధర్మమేదో నన్ను లొంగదీస్తున్నది!

'వదినా, నీ అన్నయ్యతో చెప్పు—ఆయన కఠిన పరీక్షకు నేను ఓడిపోయానని .... అతిథుల కష్ట సుఖాలు చివరిదాకా కలిసిపెట్టలేక పారిపోయానని .... కాని .... ఇంకొకటి కూడా చెప్పు.... వీటన్నిటినీ మించినదేదో నన్ను ఓడించిందని!'

'సీ—తా!' అని గట్టిగా అరచింది వదిన. ఆ అరుపు విని స్థాణువైపోయాను. లాంతరు ఎక్కువచేశాను..... అది ఆమె మొహం పైకెత్తి చూశాను..... బలవంతాన ఆమె మొహాన చేతులు అడ్డు తీశాను .... వదిన ఏడుస్తోంది! .... నన్ను కౌగలించుకుంది. వెక్కి వెక్కి ఏడ్చేసింది!

'పులకించి ఎరగని బీడుని నేను. పుష్పించి ఎరగని మోడుని నేను .... కాని విశ్వరూపమైన నీ మాతృ స్వరూపంతో అమృతవర్షం కురిపిం చావు.....ఇవి దుఃఖాశ్రువులు కావు .... నిలువెల్లా నిండిన ఆనంద తరంగాలు ..... '

వదిన ఏం చెబుతోందో ఒక్క ముక్క నా కర్థంకాలేదు. నాకు అర్థమయిందల్లా ఆమె చెప్పి నది వినడమే .....

'సీతా .... నేనూ నీలాంటి ఆడదాన్నే సీతా అభి మానం అనేది ఎలాటిదో అసూయపడవలసింది నిజంగా దేన్ని చూసో .... నాకు ఇవాళే అర్థ మయింది .... పూర్వ సంస్కారానికి అగ్నిసంస్కారం చెయ్యకుండా పెద్దవాళ్లు చెప్పినట్టు విని .... గుట్టుగా కాపురం చేసుకునే వెర్రిబాగుల యిల్లాలు నువ్వు ..... కాని ప్రేమకు నోచుకోని మరొక ఆడది నిన్ను ప్రతినిత్యం అసూయతో ద్వేషిస్తోం దని నీకు తెలుసా?

'సీతా .... నువ్వు కాపురానికి వచ్చిన కొత్తలో... ఒకరోజున .... అన్నయ్య నిన్ను గట్టిగా కౌగలించు కుని ముద్దు పెట్టుకోడం .... అక్కడికి ఎందుకో వచ్చిన నేను చూస్తే .... మీరు సిగ్గుపడి విడి పోయారు జ్ఞాపకముందా? .... నీకంటె నేను ఎంత పెద్దదాన్నని! మహా ఉంటే ఐదారేళ్లు ఎక్కువ ఉంటాయేమో అంతేకదూ! .... ఆ దృశ్యం చూసిందగ్గర్నుంచీ నాకు మతి పోయింది. నా దురదృష్టం అంతా నీమీద అసూయగా మారింది! అన్నయ్య నిరంకుశత్వం ముందు ఒక్క మాట బదులు చెప్పక పనులు చేసుకుపోయే నీ గృహిణీత్వం నన్ను మెప్పించినా 'నాకు లేనిది దీని కెందు కుండాలి?' అనే ఈర్ష్యను జయించలేక పోయేదాన్ని. మీరు కలిసి ఉంటే చాలు నా ఒళ్లంతా మంటలు రేగేవి .... కాని, నీలాగే నేనూ తక్కువ మాటలదాన్ని....పైకి తేలేదాన్నికాను.

'కాని సీతా, ఈనాడు నాకు నిజంగా తెలి సింది .... నిజంగా నేను కోల్పోయిం దేమిటో .... నేను అసూయ పడవలసింది దేన్ని చూసో కూడా యివాళే అర్థమయింది .... ఆకాశం కన్న విశాల మైనదీ, సముద్రం కంటె లోతైందీ ఏమిటో కూడా నా కివాళే తెలిసింది. చంద్రకాంతపు పువ్వులు సాయంకాలం గాని వికసించవు. మామిడి పళ్లు వేసవికాలంగానే ఫలించవు. కాని, కాలా తీత మైనది ప్రపంచంలో ఒక్కటే ఒక్కటి ఉంది .... అది కరుణాత్మురాలైన కన్నతల్లి అభిమాన రసం!

'ఇప్పుడే ధన్యులైన నీ పిల్లల్ని పేరు పేరు వరుసనా పిలిచి చెబుతాను.

'ఇది చిన్న అనుభవమే కావచ్చు, కాని, దీని కోసం మీ తల్లి ప్రాణం తల్లడిల్లిపోయింది. తెలుసా? మిమ్మల్ని పెంచి పెద్దవాళ్లని చేసే లోగా మీ అమ్మకి యిలాంటి బెంగలూ, భయాలూ, ఆందోళనలూ, గండాలు ఎన్నో, ఎరు గుదురా?

'తీర్చలేనిది ప్రపంచంలో ఒకటే ఒకటి ఉంది, తెలును కదూ'!

* * *

వదిన వెర్రి మొర్రి కబుర్లతో భళ్లున తెల్లారి పోయింది. నేను ఆ రోజుకి వెళ్లలేదు, తర్వాత వెళ్లక్కర్లేకుండానే సుబ్బన్న, జ్వరం క్రమ క్రమంగా తగ్గిపోయింది. నేను భయపడినవి ఏవీ జరక్కుండానే పిల్లాడికి రెండు పత్యాలు ఒంట బట్టేక వరహాలమ్మగారి కుటుంబం వెళ్లిపోయింది. ఆ అనుభవం కూడా క్రమక్రమంగా నా స్మృతి పథంలోంచి వెళ్లిపోయింది. ఇంత చిన్న విషయా నికి నేను ఇంతగా ఆందోళన పడడం సహజమో, అసహజమో నాకు తెలీదు గాని, వదిన అతిథి యోక్తులు మాత్రం నన్ను ఊపిరాడ నివ్వలేదు. ఏం చెప్పను, వీళ్ల నైజమే అంత, మహా చోద్యపు మనుషులు! ★

# పలుకు రాయి

**పి. ధనంజయరావు**

| | | |
|---|---|---|
| కలికికడి పలుకుల ప్రతిగ మార్పులుకు | - | పలుకు! |
| పృథివిపై బడునాట పోలిజేరు దనుక | - | గనుక! |
| ఛాయలై వెన్నంటు శత్రులారుగురు | - | ఆరుగురు! |
| గలరంచు వెతజెందగంటె నిన్నొకడ | - | ఒకడ! |
| ఆత్మలో నాత్మమై యార్తి మెండయ్యె | - | అయ్యె!! |
| మనిషిలో మనిషినై మది గందువనట | - | అవునట! |
| కాయ మొక్కండయ్యు మనసులు రెండు | - | సర్లెండు |
| నిర్ణిశమగు కొండ నెక్కెయ నీవలను | - | గలను! |
| నిశ్శబ్ద నిబడంపు నెమ్మదింగోరి | - | ఓరి! |
| ఇచటనే జేరితి నెవరిదాపలుకు! | - | నాపలుకు! |
| నేస్తమూ పేగేమి? నీమని కదెచట? | - | ఎచట! |

హాహాంహా హాహ్వాహా!, అహ్వాహ్వాఆహా! - అహ్వాహ ఆహ్వా!

హాంంహాహ్వాహాహాహాంహాహ్వాహాం హాంహాహ్వాహాఓహాం

-ఓహాంహాఓహాం

కన్ను వెంటాడెడే న్యాయమాయిద్ది! - మా(య)ఇది! !!

[illegible] మధును పలకరిస్తున్నట్లుగా గట్టిగా—"ఈ ఏడాది అధిక అశ్వీజ మాసం వచ్చిందిట గదా ? రెండేసి సార్లు దసరా, దీపావళి" మధ్యలోనే ఆమె స్వగతాల నందుకొని—గతంలోని విషయానికి వర్తమానం కలిపి—

"అధిక అశ్వీజ మాసంవల్ల రెండేసిసార్లు దీపావళి పండుగ ఈ ఏడాదే వస్తే—ప్రతీ ఏడూ—ఏ మాసం ఎక్కువ వల్లనోగానీ, శివరాత్రి అధికంగా రావడంలేదూ ?" బాగా చెప్పేవని మధు మనస్సు మరీ మరీ మురుస్తూంటే పకపకా నవ్వి శారద అంది "—ఏ మాసం వల్లనో కాదు .... మిమ్మల్ని మీరు మోసం చేసుకోవడంవల్ల" అని !

చిత్తయిపోయాడు మధు—

చాలు ఇంక అనుకుని శారద నిద్రలో తనకి ఏవిధంగా కల వస్తే బాగుంటుందో ఊహించుకుంటోంది ....

ఆవేళ రాత్రి తీయ తీయని కలలు శారదకంటే—

బ్రహ్మ రాక్షసులూ, పెనుభూతాలూ, చైనా యుద్ధాలూ కలల్లోకి వచ్చి మధుని కలతనిద్ర నుండి కూడా దూరం చేసేసేయి.

తెల్లవారిందంటూ పక్షులన్నీ కలకలమంటూ స్వాగతాలు పలికేస్తున్నాయి. ఏడు గుర్రాలమీద పయనించే సూర్యునికి—

పద్మాలు బద్ధకంగా ఒళ్ళు విరుచుకుని ఆత్రంగా నిరీక్షిస్తున్నాయి.

కలువలు నిద్రకి ఉపక్రమించనున్నాయి. వెళ్లిపోతున్న చందమామని చూసి ఆవలింతలు ఆపుకుంటూ !

పద్మంలా శారద లేచి కూర్చుంది మంచంమీద.

కలువలా నిద్రబోయాడు మధు—

పనులు ముగించుకుని అలవాటుగా శారద మావగారికి తొరక పట్టని వేడి పాల నందించివస్తూ ఆవేళ పేపరు చదువుతూన్న భర్తని ఆశ్చర్యంగా చూసి "మీరు ఎప్పుడు లేచేరు ?"— అంది.

"నిద్రపోతే గదా లేవడమనే దానికి"—అంటూ కాఫీ అంది పుచ్చుకుని పేపరులో తల దూర్చేసేడు.

పెళ్లిరోజు తెరలా అతనికీ—ఆమెకీ మధ్య పేపరు రెపరెప లాడుతోంది !

"మనం ఈ ఏడాది రెండుసార్లూ దీపావళి చేసుకుందాం .... రేపు మీ ఆఫీసుకి సెలవు పడేయండి" అంది.

అందులోనే ఉంది ఆజ్ఞ .....

కనుబొమలు విరిచి విచిత్రంగా చూస్తూన్న అతని చూపులకి—"మీ ఆఫీసులో పనిచేసే అమ్మాయిలని మన ఇంటికి ఆహ్వానించి మరీ రండి ...." అని మరో అర్థం చెప్పి ఆగకుండా సాగిపోయింది.

అనంతయ్య పరిస్థితి గ్రహించి నవ్వేసేడు.

కలవని శృతి కలపబోయాడు మధు.

కాల పురుషుడికి ఇవేమీ పట్టలేదు—

సెకండ్లని నిముషాలుగా మార్చడంలోనూ .... నిముషాలను గంటలుగా చెయ్యడంలోనూ—గంటలను రోజులుగా త్రిప్పెయ్యడంలోనూ నిమగ్నుడైపోయాడు.

కళ్లెం బిగించి రథం తోలుతూన్న కాల పురుషుడు తన రథచక్రం సెకన్లలా తిరుగుతూంటేనే లెక్కపెట్టేస్తాడు. చివరగా ఒక రోజున్నర పయ

# చిటపటలు

22 వ పేజీ తరువాయి

నించి—అర్ధభాగంతో ఒక్క నిముషం నీ భుజం మీద తల వాల్చి విశ్రాంతి తీసుకుంటా—ఒక్కసారి కళ్లేలు బిగించి పట్టుకుంటావా ? అని అర్థించి విశ్రమించబోయాడు.

దానవులకీ, మానవులకీ రూపంతో తేడా ఉన్నట్లు—

దేవతలకీ—మానవులకీ కాలంలో మార్పు ఉంది .....

వాళ్ల నిముషం మన టైములో ఒకరోజు—ఆడదానిచేత కళ్లెం ఉంటే బిగించి ఉంటుందా ? గుర్రాల అలసట చూసి కొంచెం వదులుచేసి భూలోకంలోని దీపావళీ వేడుకలని చూస్తోంది వింతగా.

సంజవేళ తులసికోట దగ్గిర ప్రమిదలన్నీ ఒక తీరులో పెట్టి తులసిపూజ ముగించి ఒక్కొక్క ప్రమిదనే వెలిగిస్తోంది శారద ....

అక్కడే నిలబడి సంజ వెలుగులో—

ప్రమిదల కాంతుల్లో—

వివిధ రుచుల్లో మెరిసిపోయే శారదని చూసి మురుస్తూన్న మధు అక్షతలు తెచ్చి భక్తిగా భర్త చేతిలో ఉంచిన భార్యని చూసి ఉలిక్కిపడ్డాడు....

ఆమె నెత్తిన అక్షతలు దీవించి చల్లేడు మధు తేరుకొని !! ప్రసాదం కాస్త చేతబెట్టి—

పెద్ద పళ్లెంలో ప్రమిదలని పెట్టుకొని వీధి నలంకరించబోయింది శారద !

"దీపాల దేవత" అనుకున్నాడు మధు ఆమె వెంట వెంటనే తిరుగుతూ—

వెంట తిరిగి వచ్చే భర్తని చూసి శారద ప్రమిదల నూనెలో కొద్దిగా నీటిని దొంగచాటుగా చిలకరించి చిటపటలాడుతూ వెలుగుతున్న దీపాలని చూసి "కిలకిలా" నవ్వింది ....

ఎందుకని చిటపట లాడుతున్నాయో తెలియక "ఏమైంది" అన్నాడు మధు ఆత్రుతగా .....

"ప్రమిదలూ—ఉవిదలూ ఒక్కటే అనిపిస్తుంది నాకు—తనకు తాను కాలుతూ—వెలుతురును విరజిమ్మడానికే ప్రయత్నిస్తుంది ఆ వత్తి.

ఆ నూనే అనే ప్రేమజ్యోతికి స్వచ్ఛత లేకపోతే చూడండి ఎలా వెలగలేక వెలుగుతూ కొడిగట్టి పోతోందో—

త్యాగంతో స్వచ్ఛతని వాంఛిస్తుంది.... మీరు—అదే మగవారు ఆ నూనె నింపేటప్పుడు నిష్కల్మషంగా, స్వచ్ఛంగా నింపితే వెలుగూ వస్తుంది.

నిర్మలంగానూ దీపంలోని వత్తి కాలుతుంది.

ప్రేమ అనే నూనె అయిపోయిన వెంటనే ఇక నిలవలేక 'వత్తి' పూర్తిగా కాలిపోతుంది సహజంగా—లేకపోతే అప్పుడప్పుడు కొడిగట్టి ఆరిపోతుంది ..."

అంటూ మధు మొహంలోకి చూస్తూ అంది శారద ....

రెండు చేతులూ బార జాచి ఒక్కసారిగా శారదని అందించుకుని గట్టిగా గుండెల కదుముకుంటూ "లేదు .... లేదు .... శారదా .... మనసా, బావా, కర్మణా: నేనేం నీకు అన్యాయం చెయ్యలేదు—నీ—ఈ—రెండు రోజుల వ్యథా నాకు తెలియనిదా ? అల్లరి పిల్లవు గాబట్టి ఎంత నవ్వుతున్నా ఏదో మాటలతో కప్పిపుచ్చు కున్నావు నీ బాధని—" దీనంగా అన్నాడు మధు ....

అతని గుండెలలోనే తలను దాచుకుని—"నా ప్రమిదని నే నిక్కడే అట్టే పెట్టేను—తప్పు చేయనపుడు మీరు భయపడడం ఒకటి మానేయకపోతే నా వ్యథే నాకు మిగులుతుంది.....

"ఒక చేత్తో పెనుగాలి నుండి దీపం ఆరిపోకుండా రక్షించ గలగడం కుదరదు గదా .... ఆ రెండోవైపు మీచేయి అడ్డుగా పెట్టి నా జీవన జ్యోతిలో నిష్కల్మషమైన ప్రేమజ్యోతి వెలిగించే భారం మీది కాదూ ? ఈ రెండు రోజులూ—మిమ్మల్ని బాధపెట్టినందుకు ఎంత కుమిలిపోయానో."—

ఇక వీళ్ల మాటలు వినలేక ఇంతవరకూ అదే ప్రదేశంలో రథాన్ని ఆపుజేసి కుతూహలంగా చూస్తున్న కాలపురుషుని అర్ధాంగి భుజాన్నే విశ్రమించిన పతిని రెండు చేతుల్తోటీ కౌగిలించుకుంది కళ్లెం వదిలేసి !!

సర్వ కాలాలూ స్తంభించిపోయాయి—

అదే ఆనందంలో తల మున్కలువేసే మధూ—శారదలు అనంతయ్య దగ్గ విని జరిగిపోయారు.

మేలుకొన్న కాలపురుషుడు ఓ చేత్తో అర్ధాంగిని దగ్గిరగా తీసికొని మరో చేత్తో కర్తవ్యం పరిపాలించ సాగేడు కళ్లాన్ని బిగబెట్టి !!!! ★



"బాలికా: నీకు తెనుగు భాష తెలియునా?
"ఊహూఁ... రాదు."

AR

**భూమి కార్డో ప్రాణం. భూమి ప్రాణమే అతని ప్రాణమూను.**

నాని అవసరాలు అతనివి. వేసవిలో భూమి అవసరాలు చాలా ఉంటాయి. సూర్యుడు భూగోళాన్ని గట్టిగా ఎండలో పెట్టి కుట్టేస్తాడు. నీరు ఎండిపోతుంది. జీవాన్నిపోసే భూమి కన్నుగుడ్డిదయిపోతుంది. ఈ గుడ్డికన్ను ద్వారం అంచులు క్రమంగా ముడతలు పడిపోయి, ఎండిపోతాయి. చివరికి, కుంగిపోయే మట్టి రాయిగా మారిపోతుంది. గడ్డి, లోతుకి వేరుదిగని వృక్ష విశేషాలన్నీ చచ్చిపోతాయి. చమటపట్టే నెలలు ప్రారంభించాయి.

కార్డో శరీరంమీదనుంచి వరదలుగా పారే చెమట నేలమీదపడినా ఆ ప్రదేశాన్ని చల్లబరచలేదు. పొలాల లోని గాలి కూడా ఖరువుగా, నెమ్మదిగా ఉంది. పసుపు పచ్చని వేడికి ప్రకాశవంతంగా అయి, ఎర్ర తలపాగా కింది అతని మొహంలోకి జీవకళ వచ్చింది. చిన్న కత్తితో నరికిన ధాన్యపు కంకులని కుప్పగా పేర్చాడు. కత్తి అంచులు ఎండలో అందంగా మెరిశాయి. ఒక్కొక్క వేటుకీ దుమ్ము రేగింది. ఇలా ఒక కంకు దగ్గరనుంచి తర్వాత దానికి, దానివద్ద నుంచి మరింకొక కంకు దగ్గరికీ కదిలి వెళ్ళిపోయాడు అతను.

నాగలి, దున్నపోతు, ఉంటే పని తేలిక అవుతుంది. కాని ఆ జంతువు నల్లటి తోలుని చల్లార్చేందుకు కావలిసిన నీరేదీ? భూమిలో ఇంకినట్లే దాని దేహంలోకి ఇంకి పోతుంది. అందుకనే దున్నపోతు వెదురు పొదల నీడలో పడుకుని ఉంటే, కార్డో నడుం వరకూ ఎదిగిన జొన్న కంకుల మధ్య, ఎండలో పని చేసుకుంటూ, ఇటూ అటూ కదులుతున్నాడు.

ఈసారి కంకులు చిన్నవయిపోయాయి. ఏటేటా ఇంకా ఇంకా చిన్నవయి పోతున్నాయి. ప్రతిదీ నిండుగా పెరిగిన రోజులున్నాయి. పై పొర ఊడదీస్తే లోపల ఇరుకుగా ఎదిగిన పసుపు రంగు 'పళ్ళు' వనిపించేవి. ఇప్పుడు ఎంత పెరిగినా ధాన్యపు కంకులు అరచేతిలో సగం కూడా లేవు; లోపల గింజలు బోసి నోటితో ఎక్కిరిస్తున్నాయి. పురుగులు, ఈగలు లోపలినించి ఎగిరి వెళ్ళిపోతున్నాయి. పొలంనిండా పురుగులు పాకుతున్నట్లుంది.

అయితేనేం? తనముందు తన తండ్రి, అంతకు ముందు మరెందరో నాటినట్లే తనూ నాటాలి.

మరొకసారి వంగి, చెయ్యి చాచి బలంకొద్దీ కత్తిని నేలలోకి దించాడు. కత్తిపిడి ముడతలు పడిన అరచేతికి నొక్కుకుంది. కత్తిని బయటికి లాగి, జొన్న మొక్క చుట్టూ పాదు వచ్చేదాకా దానితో తవ్వాడు.

మిట్ట మధ్యాహ్నానికి సూర్యుడు ఆకాశంపైకి లేచిపోయాడు. కార్డో చేతులకి పని తగ్గించి ఇంటి వైపు నడిచి వెళ్ళాడు. వరి పంటకు జీవంపోసే కొలను ఇప్పుడు ఎండిపోయి ఉంది. దానిని దాటాడు. దూరంనుంచి చదునుగా, నీరు కలిసిన ఆకు పచ్చగా కనిపించే పొలాలు -ఎత్తు ప్రదేశాలలోని జొన్న కంకులతో కలిసి పోతున్నాయి. మధ్య ప్రదేశాలలో అంటే చదును ప్రదేశాలు మొదలయ్యే చోట్లలో, ఇళ్ల కప్పులు ముదురు గోధుమ రంగులో కనిపిస్తున్నాయి. ఇంకా అవతల వెదురు పొదలు, మామిడి చెట్లు ఊరి పొలిమేరకి గుర్తులు. ఊరికి అవతల సముద్రం.



లోయలో గాలి వీచినప్పుడెల్లా చదును ప్రదేశాల వాసనలు వేస్తాయి; గేదె, పేడ, కట్టెలు కాలే వాసనలు. దూరం నుంచయినా సరే మనుష్యులు ఉండే చోట్లనుంచి వచ్చే ఘాటు వాసనలు బాగుంటాయి. అందులోనూ మండిపోతున్న పొలాలమీది కాళీ గాలి పీల్చిన తర్వాత మరీను.

కార్డోలో భావ పరంపరలు మేలుకుని దేహం లోని బద్ధకం వదిలిపోయింది. నోటిలోని ఎండుదనం, పెదిమల వంపూ అలాగే ఉన్నాయి కాని అలసట క్రమంగా తగ్గిపోయింది. త్వరలో తన గుడిసె పక్కనే వెదురు పొదల నీడలో ఉన్న మట్టి బావిని చేరుకున్నాడు.

చీకటిగా ఉన్న నీటిలోకి ఒక డబ్బా దించాడు కార్డో. డబ్బాలోకి నీరు ప్రవహించి బరువెక్కగానే పైకి లాగేశాడు. నిటారుగా నుంచుని కొద్దిగా నీటని చిక్కపడి పోయిన తలమీద పోసుకున్నాడు. మెరిసే నీటి తెర మొహం, రొమ్ముమీదనుంచి నేలమీదకి జారిపోయింది. భూమిలోనుంచే పుట్టిన నీరు తిరిగి భూమిలోకి ఇంకిపోయింది.

కాళీగా ఉన్న గుడిసెలో భోజనం ఉప్పు వేసిన చేప, ముందు ఏడాది పంటలో పండిన బియ్యం. నిన్న, అంతకుముందు రోజూ చేసిన భోజనం కూడా ఇదే. అయినా చల్లారిపోయిన అన్నం, ఎండిపోయిన చేపా ముద్దలు చేసుకుని మింగాడు. అన్నం ఇంత కమ్మగా ఎప్పుడయినా ఉందా? మనిషన్నవాడికి ఇంకేమి కావాలి?

తన కేమి కావాలో వేసవి ముగిసే కాలానికి తోచింది కార్డోకి; తనకి ఇది పెద్ద వ్యవధికాని, రెండు తరాలుగా తన వంశంవారు పాతిపెట్టి ఉన్న ఈ భూమికి ఏమంత పెద్దది కాదు.

జొన్న ఎండబెట్టి పాతర వేశారు. నేలని దున్ని తిరగవేసేందుకు నాగలి సిద్ధంగా ఉంది. కాని కొండలమీద పోగయిన మబ్బులు సాయంత్రం గానే వెళ్ళిపోతాయి. రాత్రిపూట ఆకాశం చల్లగా, నిర్మలంగా ఉండిపోతుంది. గడ్డలోని వేడి చాలదు. వాన కోసం ఎదురు చూస్తున్న అతనికి స్త్రీలో దాగిఉండే మెత్తదనం, వెచ్చదనంమీద ఆలోచనలు పోయి కలవర పడిపోతాడు. అందుకనే [illegible]

ఆమె అమాయకురాలు. కోలగా, విశాలంగా ఉన్న మొహంమీద నల్లని జుట్టు మధ్య పాపిడి తీసుకుంది. దట్టమయిన కనుబొమలు, చప్పిగా ఉన్న ముక్కు ఆమె కళ్ళలోని మెత్తదనానికి సరిపోయాయి. సావిడిలో కోళ్లకి ధాన్యం విసురుతున్నప్పుడు, బుట్టలాగ ఉన్న ఆమె పావడ బలమయిన పిరుదుల కదలికతో నిండిపోతుంది. రెప్పవాల్చని తన చూపుకి ఆమె సిగ్గు పడింది. సిగ్గుని కప్పి పుచ్చటానికి నవ్వింది. నవ్వుతున్నప్పుడు ఆమె బుగ్గలో సొట్ట పడింది. ఇద్దరూ మాట్లాడుకోరు. ఆమె పేరయినా తెలియనప్పుడు ఏమని పలకరిస్తాడు. వాళ్లిద్దరూ ఇలా కలిశారు.

అయితే తనని గురించి ఆమెకి అంతకిముందే తెలుసని అతనికి తెలీదు. పక్క ఇళ్ల వాళ్ళు ఆమెకి చెప్పారు. అతనికి తలి దండ్రులు లేరనీ, కొండ చరియల దగ్గరే ఏడెనిమిది ఎకరాలు భూమి ఉందనీ, తన అక్కకి పెళ్ళయినప్పటినుంచీ ఆమె అతన్ని గురించే ఆలోచించేది. తన వంక దీక్షగా, అంచనా వేస్తున్నట్లు చూసిన తర్వాత తన వంతు కూడా రాబోతున్నదని గ్రహించింది.

నాట్లువేసే కాలం రాకముందే ఇద్దరూ, ఆమె తండ్రి అనుమతితో కలిసి ఉండటం మొదలు పెట్టారు. చర్చిలో పెళ్ళి చేసుకుందామంటే ఫాదరీ లేడు. ఈ కొండల్లో ఫాదరీలు ఉండరు. పట్నం మరీ దూరంగా ఉంది. ఈ సమయంలో పొలాలని వదిలి వెళ్లేవా రెవరు?

మొదటి రాత్రి గుడిసెలో ప్రశాంతమయిన చీకట్లో మాట్లాడాడు. అప్పుడే, చీకటిపోయి వెలుగు వచ్చినట్లయింది. స్త్రీఅంటే మృదుత్వం, వెచ్చదనమేమాత్రం కలదికాక పాత సారాయిలాగ శక్తివంతమయినది కూడానని తెలుసుకున్నాడు.

* * *

కార్డో లూసింగ్‌ని పొలాలలోకి తీసుకు వచ్చేసరికి ఇంకా పంటలు పండలేదు. ఆకు మళ్లలోని నీటి పైకి వచ్చేస్తున్నాయి పచ్చని వరి మొక్కలు. ఆమె కూర్చుని తెల్లని గూళ్ళు కడుతున్న పచ్చటి పురుగుల్ని ఏరెయ్యడం ప్రారంభించింది, వేళ్లమధ్య నలిపి అవతల పారవేసింది.

అప్పుడే మొదలు, అనుకుని నిట్టూర్చింది కాని కార్డో చిరునవ్వుతో లోపల అశాంతి చల్లబడింది. ఒక్కడూ ఇంత పని చేస్తాడా అని ఆశ్చర్యపడింది. తన చేతుల క్రింద ఈ పచ్చని ఈటెలన్నీ అతను నాటినవేనా? వంటరిగా కొండమీద బావిలో నీటిని బాల్చిలో తీసుకువచ్చి పోశాడా?

''వానలు వచ్చేస్తాయి'' అన్నాడు కార్డో మాట కలుపుదామని. ఇన్ని సంవత్సరాలు పొలాలలో మవునంగా గడిపి, ఇప్పుడు ఒక ఆడ మనిషితో మాట్లాడటం అవతనికి కొత్త అనిపించింది.

''గట్లు వెయ్యటానికి సాయపడతాను'' అంది ఆమె.

''ఇది మంచి ఏడు'' అన్నాడు అతను. తన ఆలోచనలకి తనే సమాధానంకాక, మరొక వ్యక్తి సమాధానం చెప్పగా విన్న సుఖంలో మునిగిపోయాడు. కొంతసేపు తర్వాత మళ్లీ పనిలో మునిగిపోయాడు.

మిట్ట మధ్యాహ్నానికి ఆమె పొలంలోకి భోజనం తెచ్చింది. ఇదీ ఒక పెద్ద సుఖం! భోజనానికి ఇంటికి పోనక్కరలేదు. గట్లువేసేప్పుడు, కాలవలు తవ్వే

ప్పుడు అడ్డు వచ్చే ముళ్లని తీసెయ్యడం కూడా పెద్ద కష్టం అనిపించలేదు. మధ్యాహ్నం మరీ త్వరగా గడచిపోయింది. సూర్యుడు కొండల వెనుక అస్తమిస్తున్నాడు. చీకటి పడేప్పటికి వంచిన వీపుని నేరు చేశాడు. అప్పటికే పొలాలలో కీచురాళ్లు పాడుతున్నాయి.

రెండు రోజుల తర్వాత సాయంత్రపు టాకాశంలో మేఘాలు కమ్ముకున్నాయి. వెచ్చని తూర్పు గాలితో వస్తాయి మొదటి వానలు. కార్డో చెక్కిళ్ల మీద చినుకులు కన్నీటిలాగ పారి, బాహువులని చల్లగా చేసేశాయి. దూరాన కొండలలో ఉరుములు గర్జించాయి. వాన మరింత దట్టంగా కురువటం మొదలు పెట్టింది. అతను త్వర త్వరగా నడిచాడు. మరొక రోజు వాన పడితే చాలు వేసవికి గట్టిపడిన నేల మెత్తన అవుతుంది. తర్వాత తను దున్నటం ప్రారంభిస్తాడు. తను చెయ్యవలసిన పనులన్నీ స్పష్టంగా ఊహించేసుకున్నాడు.

కొండలలో గాలి నిట్టూరుస్తూ, వానల తెరలతో బాటు, కొండమీదనుంచి దిగి వచ్చింది. గుడిసెలో వంటరిగా ఉన్న లూసింగ్ కప్పుమీది ఎండు టాకులమీద వాన చినుకులు గలగలలాడటం విన్నది. శుష్కమయిపోయిఉన్న నేల వాసన వంట గది కిటికీలో నుంచి వచ్చి తగిలింది.

ఇంటి కప్పుమీదుగా ధారలుగా పడుతున్న నీటిని చూసి సంతోషించింది. ఇక కార్డో పొలానికి నీరు పోసి వీపు విరక్కొట్టుకొనటం అనవసరం. ఈసారి అతని పని అకాశమే చేసింది. అయితే వరి మొక్కలని తను తాకినప్పుడు వచ్చిన కలవరపాటు తిరిగి వచ్చింది. నీటి వాసన తగలగానే కాలవలు వెయ్యాలన్న సంగతి జ్ఞాపకం వచ్చింది. చేస్తానని తను అన్నదికాని తనవల్ల వీలవుతుందా?

కార్డో నవ్వుతూ వచ్చాడు. వాన, మెత్తటి నేల, గుడిసె కిటికీలోనుంచి పసుపు పచ్చగా కనిపిస్తున్న కిరసనాయిలు దీపం వెలుగు, ఇవన్నీ అతన్ని సంతోషంతో నింపివేశాయి.

"లూసింగ్!" అని కేక వేశాడు.

"ఏమిటి కార్డో?" అని అడిగింది వంట గదిలో నుంచి లూసింగ్.

"రేపు గట్లువేసి కాలవలు తవ్వుదాం" అన్నాడు. తడి బట్టలు ఇప్పివెయ్యటం ప్రారంభించాడు.

"అన్నం తయారుగా ఉంది."

కార్డో నిశ్చలంగా అయిపోయాడు. గట్లు వెయ్యటం, ఇంత మామూలు పనిగా తోచిందా ఈమెకి? తన కేమో వానతోనే సమానమే! ఆమెతో పంచుకోలేనివి కొన్ని ఉంటాయని మొదటిసారి గ్రహించాడు. కొంతసేపు ఆగి, "రేపు ఇంట్లోనే ఉండిపో! అదే మంచిదేమో!" అన్నాడు.

అతని గొంతుకలోని మార్పునిబట్టి ఏదో చెడిందని తెలుసుకున్న లూసింగ్ వంట గది వదలి వచ్చింది. "నీకేమయినా కోపం వచ్చే మాట అన్నానా?" అని అడిగింది అతని వీపుని తనకి అదుముకుంటూ.

"లేదు" అన్నాడు కార్డో. "మగవాడి ఆలోచనలు. వయస్సు మళ్లక్కుండానే నువ్వు వంగి ముసిలిదానవవటం నా కిష్టం లేదు."

"నీ వన్నీ నావే" అంది లూసింగ్. "నీతోనే పొలంలోకి వస్తాను" బలవంతంగా అతని చెయ్యితీసుకుని తనవెంటకి లాగింది. "ఛా, అన్నం చల్లారిపోతుంది."

బంగారు కాంతిలో లూసింగ్ నున్నటి భుజాలూ, చేతులూ చూస్తూ ఉండిపోయాడు కార్డో. భోజనం చేస్తున్నంతసేపూ ఈ కొత్త జీవితాన్ని తలుచుకుని మాటలు లేకుండా ఉండిపోయాడు.

ఈ నిశ్శబ్దం ఆమె మనస్సుని కుదుట పరిచింది. ఆందోళన కలిగించిన ఆలోచనలు పక్కకి జరిగాయి. రాబోయే ఎన్ని సాయంత్రాలలో ఇలా కూచుని, ఒకరితో ఒకరు మాట్లాడకపోయినా సన్నిహితంగా గడుపుతామోకదా, అని సంతోషించింది. తర్వాత ఇద్దరూ చాపమీద పడుకుని నిద్రపోయారు.

బయట వాన రెట్టించి, కప్పుమీద వేసవిలో పేరుకున్న దుమ్మునంతా కడిగి వేసింది. గట్టి నేలని మెత్తటి మట్టిగా మార్చింది. గుడిసె నేల మీద వెదురు చాపలలోనుంచి ఇంకి వచ్చి కొత్త రుతువుతో పునరుజ్జీవన మయిన నేల వాసనలతో నింపింది. చేలలో భూమి కన్ను ఒకటి పెరిగి, పెరిగి ప్రాణాధారమయిన పెద్ద మడుగుగా మారిపోయింది. కరుడు గట్టిపోయిన బంక కరిగిపోయింది. బీటలన్నీ నిండిపోయాయి; లోపల నిద్రలో మునిగి ఉన్న గడ్డి మొక్కలు సమృద్ధితో మేలుకుని పెరగటం ప్రారంభించాయి.

సంధ్యతో లేచిన కార్డో భూమ్యాకాశాల మధ్య చీకటిని తొలగిస్తున్న పసుపు చారని చూస్తూ నుంచుని ఉండిపోయాడు. కోళ్లు కూసే సమయానికి లూసింగ్‌తోబాటు తిండికి కూర్చున్నాడు. మవునంగా తిని, పొలంలోకి నడిచి వెళ్లారు ఇద్దరూ.

భార్యా భర్తలుగా వరి చేలలో పని చేశారు. పాతవి కూలిపోయిన చోట కొత్త గట్లు వేశారు. ఇప్పుడే ఈ పని చెయ్యకపోతే వానాకాలం వచ్చిన కొద్దీ నీరు కావలసినన్ని నిలవవు కదా! బీటు వారిన గట్లని బాగుచేస్తున్న లూసింగ్ తీగలాగ వంగిపోయింది.

పొద్దెక్కినకొద్దీ వేడి ఎక్కువ అయింది. లూసింగ్ చేతులకీ, ముంజేతులకీ అంటుకున్న తడి మట్టి గట్టి పడింది. శ్రమకి ఆమెలోని మెత్తదనమంతా గట్టి పడింది. నుదురుమీద చెమట నల్ల బిందువులు ఏర్పడ్డాయి. వీపుమీద గుడ్డ తడిసిబడింది.

అలసటతో వణుకుతున్న ఆమెని చూసి కార్డో అన్నాడు: "ఇది ఆడవాళ్ళు చెయ్యవలసిన పని కాదు." చాలాకాలంగా ఆవరించిన మవునం తర్వాత ఈ మాటలు కొంచెం కర్కశంగా వినిపించాయి"

"ఇకనువ్వు ఆపు!"

ఆమె అంగీకరించలేదు. కళ్లు నేలమీదికి దించే ఉంచింది. బలవంతంగా చిరునవ్వు తెచ్చుకుని పని కొనసాగించింది. ఇంకేమి చెప్పాలో తెలియక కార్డో మరొక గట్టు మరమ్మత్తులో మునిగిపోయాడు. అతన్ని అనుసరించే వచ్చింది ఆమె నీడ. తనూ భూమిలో భాగం అయిపోయేదాకా ఈ నేలకి, తన భర్తకి తన అవసరం తప్పదుకదా, అనుకుంది పని చేస్తున్నంతసేపూ.

సాయంత్రం పని ముగిసింది. తన శరీరం రెండు రెట్లు బరువు అధికం అయిందనిపించింది. ఇంటికి నడిచి వెళ్ళిపోతూ ఉంటే వంటి మీద ఎండినమట్టి రాలింది. ఇద్దరూ కలిసి సాధించిన దానిని గురించి ఆలోచించింది. అలసటలో కూడా అతని ఆశని నిలబెట్ట గలిగాననే తృప్తి కలిగింది.

మూడు రాత్రులు వాన కురిసింది. ఆపైన పని భారమంతా కార్డో భుజాలమీద పడింది. ఇక పొలాలని దున్నాలి.

మొదట తూర్పు వైపు. తర్వాత దక్షిణం. మళ్లీ తూర్పు. ఇలా కదిలివెడుతుంది నాగలి. నేలంతా పెకలించుకుపోయేదాకా. తెరుచుకున్న భూమి వాసనకి గాలిలో పక్షులు వచ్చి పాకుతున్న పురుగులని తినటానికి వస్తాయి....

వానల ఉధృతం మరీ అధికం అయ్యేలోపలే నాట్లు వెయ్యాలి. పొలాలచుట్టూ గోతులు నిండిపోయాయి. భూమి కూడా నీరు తాగి తాగి ఇక తాగలేక ఊరుకుంది. పొద్దునమంచి రాత్రి దాకా, బంకమట్టి అంతా మట్టి అయిపోయేదాకా, నాగలి దున్నతూనే ఉన్నాడు కార్డో.

ఎక్కువగా ఎదిగిన చేనులోకి నీరు వదిలాడు కార్డో. నీరు బుడగలు కట్టుకుంటూ, చిందుతూవచ్చి పడింది. వెండి దుప్పటి లాగ వచ్చి పొలం చదరాన్ని కప్పింది. ఒక్కొక్క నాటునీ తడిపి వేసింది...

చివరి సారిగా నాగలిని, మడుగుల మీదుగా లాగుతారు. నీటివల్ల కార్డో కళ్ళుగాని, 'కరబో' డెక్కలుగాని శబ్దం చెయ్యవు. కరబో కాలు వేసినప్పుడెల్లా బురద చింది కార్డోమీద పడుతూ ఉండేది. వెచ్చగా ఉన్న నీరు గంట గంటకీ చలబడి



# ఆసియా కథ

పోయింది. తేమలో నాని కార్ద్రో చర్మం ముడతలు పడింది.

తెల్లవారేసరికి కార్ద్రో లూసింగ్‌లు ఇంకా పొలంలో నీడలుగానే ఉన్నారు. సూర్యుడు కొండల్ని దాటి వచ్చే సమయానికి మొక్కల పాదులని చేరుకున్నారు. ఆ మసక నిశ్శబ్దంలో కీచురాళ్ల పాట వేసవి ముగిసినందుకు సంగీతం అన్నట్లుంది.

నీరు చల్లగా తగిలాయి. లూసింగ్ తన శాలువ దగ్గరగా కప్పుకుని, వణుకుతూ గట్టుమీదనించి దిగింది.

కార్ద్రో సంకోచం లేకుండా నీటిలోనికి నడిచాడు. బురదలో నడక కష్టం. అడుగు సరిగా పడదు. అయినా ఇంత శ్రమ పడిన కార్ద్రో ఆపుకోలేక "త్వరగా!" అన్నాడు.

లూసింగ్ తల ఆడించి మోకాలు లోతు ఊబిలో త్వరగా నడవటం ప్రారంభించింది.

"ఒక బుట్ట ఇలా పడెయ్" అన్నాడు కార్ద్రో మొక్కల ముందు ఆగి. తట్టని పట్టుకుని నెమ్మదిగా మొక్కలని ఏరి దానిమీద పరిచాడు. "మొనలు కడగటం మంచిది, బాగానే చేశావు" అని మరొక తట్టని నింపుతున్న లూసింగ్‌ని పొగిడాడు.

"నువ్వు చెప్పినట్లే చేశాను. చాలా పురుగులున్నాయి" అని సమాధానం చెప్పింది లూసింగ్.

"అవును. పురుగులు, పక్షులు, అంతే. ఈ ఏడాది బాగానే ఉంటుందని పిస్తోంది......"

"నాకూ తెలిసిపోయింది" అంది లూసింగ్. "రెండు రోజులకింద నాకు సుస్తీగా ఉంది."

"అప్పుడేనా!" అన్నాడు కార్ద్రో, ఉద్రేకంతో మొహం ఎర్రబడగా.

"ఏమో నా కలా అనిపించింది" అంది ఆమె పొట్టని నొక్కుకుంటూ.

"అయితే అదృష్టమే. పొలాలు బాగా పండుతాయి!"

"కార్ద్రో పోదాంరా, ఇక చాలు!"

"ఆ—నిజమే, ఉండు సాయం చేస్తాను!"

"పర్వాలేదు. నేనే తంటా పడ్తాను" అంది లూసింగ్ పక్కనే ఉన్న వరి దగ్గరికి నడుస్తూ.

ఎంత తొందరగా అయితే అంత మంచిది. అనుకున్నాడు కార్ద్రో తనలో తనే. మరొక జత చేతులు వచ్చి పొలంలో పని చేస్తే లాభమేకదా! తన తండ్రి అన్నాడొకసారి: ఎన్ని జతల చేతులు పని చేస్తే అంత ఐశ్వర్యం అవి పని చేసే భూమికి. నాటు వేస్తూ రహస్యంగా అన్నాడు, "నువ్వు పండాలి!" అని.

అతని పక్కన లూసింగ్ మవునంగా పని చేసుకుంటూ పోయింది. ఆమె చేతులు వేగంగా కంటికి తోచనంత వేగంగా, కదులుతున్నాయి. త్వరలో ఒక మడివరి మొక్కల వరసలతో నిండిపోయింది.

పక్క పక్కన పని చేస్తూ, పొద్దున ఎండలో వంగి పోయారు. నెమ్మదిగా చదరపు అద్దాల వంటి నీటిలో పచ్చని ఆకుమళ్లు ప్రతిబింబిచాయి. మధ్యాహ్నం విశ్రాంతి తీసుకునే సమయంలో పొలాల ప్రశాంతి వారిని ఆవరించింది.

మళ్లీ పనిలోకి దిగే సరికి ఎండ తీవ్రం అధికం అయింది. వంగి, వంగి లూసింగ్ నడుము విరిగిపోయినట్లు అనిపించింది. ఎండిన మట్టితో గట్టి పడి పోయిన శాలువ తలకి అంటుకుపోయింది. పావడ అంచు నీటిలో తేలుతోంది. తడికి మెత్త బడిన చేతులు తమ పటుత్వాన్ని కోల్పోతున్నాయి. నోరు, గొంతుక ఎండిపోయాయి. మంచి నీటి కుండ కాళీ అయిపోయింది. ఈ బురదలో తాగేందుకు నీరేదీ?

ఆమె భర్త ఇదేదీ గమనిస్తున్నట్లు లేదు. ఆమెని పూర్తిగా మర్చిపోయాడు. అంతా నిర్దాక్షిణ్యమైన ఈ భూమివల్లనే. ఎప్పుడూ వర్తమానమే కనిపించేది. చివరికి అలసట గెలిచింది. అవతలకి వెళ్ళి కళ్లు మూసుకుంది. వాటిని తెరిచేసరికి సూర్యుడు జరగకుండా అక్కడే ఉన్నాడా అనిపించింది. వళ్ళంతా ఒక మట్టి ముద్దయిపోయింది. బలవంతంగా లేచి నుంచుంది.

"కార్ద్రో భోజనం తయారు చేస్తాను" అని వెళ్ళిపోయింది.

కార్ద్రో మూలిగి తన పనిలో మునిగిపోయాడు. ఎంత కాదన్నా ఆడది, అనుకున్నాడు. తనైతే అలా వదిలి వెళ్ళి పోగలడా? అసలు వ్యవధి ఎక్కడుంది. మరీ ముందుగా నాటితే పురుగులు పడ్తాయి ఆలస్యం చేస్తే వానలు! అందుకనే కారు మబ్బుల వెనుకనుంచి చంద్రుడు బయటికి వచ్చేదాకా పొలంలో పని చేస్తూనే ఉండిపోయాడు.

ఇల్లు చేరుకునేసరికి లూసింగ్ నిద్ర పోతోంది వంట గదిలో అన్నం మాడిపోయింది. నేలంతా మట్టి మరకలు. కోపం వచ్చిందికాని జాలి వేసి ఊరుకున్నాడు. ఆమెలో శిశువు ఒకటి ఉంది కదా! శాలువ కప్పి, మర్నాడు కూడా భోజనం మాడిపోయిన సంగతి చెప్పలేదు. క్రమంగా ఆమె కూడా పనికి అలవాటయిపోయింది.

పెందరాళే లేవటం మొదట్లో హాయి అనిపించినా క్రమంగా కష్టం అయిపోతుంది. వాన గాలి, చలి అధికం అవుతాయి. రాత్రికి రాత్రికే గడ్డి మొక్కలు మొలిచాయా అనిపిస్తుంది. కార్ద్రో వాటిని పెరికి వేసిన కొద్దీ మొలుస్తాయి!

చలి. చలి తర్వాత చెమట. చెమటకి లేచే ఆవిరి. అసలు అది చెమటా, పైనుంచి కురిసే వానా, అని కూడా సందేహం వస్తుంది.

గడ్డి మొలిచినకొద్దీ గట్టి పడుతుంది. వాటిని పీకి చేతులు వొరుసుకుపోతాయి. లేదా తడికి నాని, మెతబడి కత్తికి తెగినట్లు తెగుతాయి. దురదలు వస్తాయి. సాయంత్రం లూసింగ్ వాటి మీద నూనె రాసే వరకూ శమనం ఉండదు. మళ్లీ మర్నాడు అదే బాధ......

మొదటి రోజుల్లో వానమీద విసుగుపుట్టి తిట్టుకునేవాడు కార్ద్రో. అంతా తేమ, కుళ్లు. బట్టలు నాని నాని చిరిగి పోయేవి. వెదురు వాసాలకి కుక్కగొడుగులు మొలిచేవి. ఈ వానలవల్ల ఇంత కష్ట పడి వేసిన పంట కొట్టుకుపోతుందా అనే భయం కలిగింది తర్వాత.

వరి కాడ దట్టమైన కొద్దీ ఆశ పెరిగేది. గడ్డి పెరికే అవసరం తగ్గింది. వరి పెరుగుదలతో ఆకాశం కూడా నిర్మలం అయింది. తడి గాలి ఎండి, కోతకి అనువుగా తయారయింది. తూర్పు వెలుగుతో మెరిసే రోజు రానే వచ్చింది. ఒక చుక్క వాన పడలేదు. మర్నాడు ఎండలో చెరువులు ప్రకాశించాయి. గాలిలో పచ్చని మళ్లు అల్లల్లాడిపోయాయి.

లూసింగ్ పొట్టట స్వాత్రతం ఇంకా స్పష్టంగా [illegible] పెరిగింది. [illegible]

శిశువు ఇంకా పనికి అడ్డం రాలేదు. పొలాలకి వచ్చి కార్లోకి సాయపడేది. పని ముట్లన్నిటినీ బాగు చెయ్యాలి—కార్లోకి ఎంత సహాయం చేస్తే అంత మంచిది.

సూర్యుడు మొగ్గలలోని పువ్వులని బయటికి లాగి, దట్టంగా తెల్లని కంకులుగా మార్చాడు. క్రమంగా ధాన్యం వృద్ధి చెంది సువాసనలు వెద జల్లింది. త్వరలో పొలాలు పసుపు పచ్చని ధాన్యంతో బరువెక్కాయి. ఏదో అవ్యక్తమయిన సంగీతంతో కార్లో నెత్తూరు పొంగి జీవితంలో ఉండే ఆనందాన్ని తెలిపింది.

ఉదయంనుంచి సాయంత్రం దాకా వారి కొడవళ్లు ఎండలో మెరిసేవి. కంకులు రాలిపోయాయి. కట్టలు తయారయ్యాయి. కుప్పలు పోగయ్యాయి. ఇక పొలంలో మిగిలింది గడ్డి మాత్రమే!

కుప్పలని దున్నపోతు కట్టిన బండిలో వేసి ఊడ్చేచోటికి తీసుకుపోయారు. తర్వాత బాగా కొట్టి......కాళ్లతో తొక్కి ధాన్యం వేరుచేసి మెరిసే కుప్పలుగా పేర్చారు.

రాత్రి ధాన్యం పాతర వేసిన తదనంతరం శుభ్రంగా స్నానం చేసి కూర్చున్నారు కార్లో లూసింగ్‌లు ఇద్దరూ. దీపం వెలుగులో లూసింగ్ మొహం పాలిపోయి కనిపించింది. ఉబ్బిపోయిన ఆమె కడుపు మరీ పెద్దదిగా కనిపించిన కార్లోకి ఆమె ఇక ప్రసవించే రోజులు సమీపించిన సంగతి జ్ఞాపకం వచ్చింది.

"ఇటురా" అన్నాడు. మృదువుగా. "బిడ్డని కమక్కోని!"

దగ్గిరగా జరిగి అతని చేతిని పొట్ట పక్క భాగంలో ఉంచింది.

"కదులుతున్నట్టు తెలుస్తోందా?" అని అడిగింది.

"అరే! తంతున్నట్టుందే!" అన్నాడు కార్లో ఆశ్చర్యంతో. "బిడ్డ తంతోంది!"

"ఏముందీ, ప్రాణం ఉంటే అంతేగా!" అని జరిగి వెళ్లిపోయింది లూసింగ్.

హటాత్తుగా ఆమె వంకర తిరగటం చూసి "నెప్పిగా ఉందా?" అని అడిగాడు.

"లేదు" అంది ఆమె ఆయాస పడుతూ. "ఊపిరిపోయినట్టుంటుంది, అంతే. కదిలినప్పుడు మాత్రమే......."

కొంతసేపు తర్వాత కార్లో అడిగాడు: "కనే వేళకి ఎవర్నయినా పిలుద్దామా?"

ఆమె తల అడ్డంగా ఆడించింది. "అక్కర్లేదు. ఏం చెయ్యాలో నాకు తెలుసు!"

"మీ అమ్మ, అక్కయ్యా......"

"మా అమ్మకి పొలాలతో పనిచే ఓపికలేదు. మా అక్కయ్యకి సొంత పిల్లలున్నారు. పొలాలున్నాయి. మవ్వున్నావుగా!"

"ఈ విషయాలు నాకేమీ తెలీవే!" అన్నాడు కార్లో. "మొదటి కాన్పు చాలా కష్టంగా కూడా ఉంటుందని విన్నాను."

"భయపడక. ఏం చెయ్యాలో నేను చెప్తాగా".

"నీ ఇష్టం" అన్నాడు కార్లో కాని అతని సందేహాలు పోలేదు.

"ఇంకా గడువుంది. భయపడక" అంది లూసింగ్ మళ్లీ.

అయినా మనస్సులోని దిగులుపోదు; ఇది తనకి తెలియని విషయం.

ఇంకోకసారి ధాన్యం భూమిని కలిసింది. ఆకాశం అంచు, అవతల కొండలు వేడితో చలిస్తాయి. ఎండకి కార్లో వీపుమీద చొక్కా పిడచ కట్టుకు పోతుంది.........

ప్రయాసతో తల తిరిగి పోతున్న కార్లో ఒక్క క్షణం ఆగాడు. కాని మొక్కల వరసల పని చాలా ఉంది. లూసింగ్ లేదు. ఇవాళో రేపో కాన్పు రావచ్చు. ఇక తీరిక ఎక్కడ? మళ్లీ పనిలో మునిగి పోయాడు. ★

## చదువ్రావ - బి. వి. సత్యమూర్తి



# రామ చరిత మానస



· తులసీదాసు ·

తెలుగు

ముంగర శంకరరాజు

## 11

## ప్రయాణము

సుమంత్రుడు రాజును లేవదీసి ఆసనముపై కూర్చుండ బెట్టెను. సాకేతపతి సీతా రామలక్ష్మణు లను గాఢాలింగనము చేసుకొని దుఃఖాతి రేకమున మాట్లాడలేక మౌనమున మునిగియుండెను.

"పితాజీ! ఈ సంతోష సమయమున దుఃఖించక ఆశీర్వదించి మాకు సెలవు దయచేయుడు. తండ్రీ! ఇవ్విధముగ ఎక్కువ మోహాధీనుడవైన యెడల నిందాపకీర్తులు ఘటిల్లగలవు!" అని రఘురాముడు తండ్రిని ప్రార్థించెను.

పుత్రుని ప్రియవచనములకు నృపాలుడు సంప్రీతుడై తనయుని దగ్గర చేరదీసి గద్గద స్వరమున ఇట్లనెను :—

"రామా! నీవు చరాచర జగత్తుకు స్వామివని మునీశ్వరులు చెప్పుచున్నారు. వారి వారి శుభాశుభ కర్మల ననుసరించి భగవంతుడు వారి కాయా ఫల మిచ్చుచున్నాడని ధర్మశాస్త్రములు ప్రవచించు చున్నవి. కాని అపరాధము చేసినవాడొకడైన దాని ఫల మనుభవించువాడు మరొక డగుట విధి విలాసము కదా!" అని నృపాలుడు తర్కించి చింతించెను. శ్రీరాముని నిలుపుకొనుటకై రాజు బహు ఉపాయములచే ప్రయత్నించి విఫలు డాయెను. తుదకు వారు వెళ్లుట నిశ్చయమని భావించి సీతను చేర బిలిచి కౌగలించుకొనెను.

ఆమెను అయోధ్యలో గానీ, అథవా జనక పురిలో గానీ ఉండవలసినదని అనేక రీతుల బోధించి చూచెను. కానీ రామునితో లగ్నమైన ఆమె చిత్తము వనవాస క్లేశములను లక్ష్యించకుండెను.

అంతట గురుపత్ని, మంత్రి భార్య సీత నుద్దేశించి—"వైదేహీ, నిన్ను అడవులకు వెళ్లుమని ఆజ్ఞాపించలేదే! అత్తమామలు, గురువుగారు చెప్పినట్లు నడచుకొనుమమ్మా!" అని పలికిరి. సంకోచవశమున సీత వారికి ప్రతివచనము పలుకుట భావ్యముగాదని తలంచి తల వంచుకొని మిన్నకుండెను.

ఇంతలో కైక తటాలున పైకి లేచి ముని వేషమునకు పనికివచ్చు నార చీరలు, తులసీ మాలలు, కమండలములు మున్నగు వస్తువులను పట్టుకొని వచ్చి వాటిని రాముని యెదుటుంచి, తియ్యని మాటల నిట్లనెను :—

"రామా! రాజుకు నీవు ప్రాణ ప్రియుడవు కాబట్టి నీపై యున్న వాత్సల్యప్రేమను వారు వదలుకొనజాలరు. పుణ్యము నశించినను, యశస్సుకు దూరమైనను, స్వర్గప్రాప్తి తప్పిపోయినను వారు నిన్ను కానలకు పొమ్మని ఏనాటికీ చెప్పలేరు. కనుక నీవే తిన్నగా ఆలోచించి నీకు తోచినట్లు ప్రవర్తింపుము."

తల్లి ఉపదేశ వాక్యములకు రాముడు సంతసించెను, ప్రజలు వ్యాకులపడిరి. అవి రాజుకు ములుకులవలె తగిలెను. 'అయ్యో నే నెంత దురదృష్టవంతుడను, నా ప్రాణములింకనూ నిలచి యున్నవే' అని దురపిల్లుచూ మహారాజు మూర్ఛిల్లెను. ఏమిచేయవలెనో, ఏమిచేయగూడదో! తెలియని స్థితిలో అక్కడున్నవారు నిశ్చేష్టితులై నిలబడియుండిరి. అంతట రామచంద్రుడు ముని వేషము ధరించి, జననీజనకులకు, గురుబ్రాహ్మణులకు నమస్కరించి వనమునకు ప్రయాణమాయెను.

శ్రీరాముడు ద్వారము వద్దకు వచ్చునప్పటికి అక్కడ వసిష్ఠు లుండిరి. గురువుతో చెప్పి బ్రాహ్మణ సమాజమునకు వర్షాశన మిప్పించెను, యాచకులకు దానాదులు చేసెను, ప్రీతి వచనములు పల్కి మిత్రులను సంతోష పరచెను. దాస దాసీ పరిచారిక బృందమును గురువుల కప్పగించి, వారిని మీరే తల్లిదండ్రులవలె పోషింపుడని ప్రార్థించెను. అక్కడ చేరిన జనసమూహము నవలోకించి రాజును, రాణులను చక్కగ చూచుకొనుడని విన్నవించెను. పిమ్మట గురుచరణములకు పునః వందన మాచరించి, పార్వతీ పరమేశ్వరులను, విఘ్నేశ్వరుని స్మరించి ముందుకు నడచెను.

రఘురాముడు వనములకు పోవుచున్నాడని తెలిసి అయోధ్య ఆర్తిజెందెను. లంకలో దుశ్శకునములు కన్పట్టెను. అమరులు హర్ష విషాదములకు లోనైరి.

ఇంతలో దశరథుడు మూర్ఛనుండి తేరుకొని హా! రాముడు పోయినను నా ప్రాణములు మాత్రము పోలేదే అని పరితపించి సుమంత్రుని పిలిచి ఇట్లు చెప్పెను.

"సచివోత్తమా! సుకుమారులైన ముగ్గురు బిడ్డలు వనముల కేగుచున్నారు. నీవు వారిని రథములో తీసుకొనిపోయి, విపిన ప్రవేశములు చూపించి నాల్గవ దినము తిరిగి తోడ్కొనిరమ్ము. ధీమంతులు, సత్యవ్రతులైన కుమారు లిద్దరూ మరలి వచ్చుటకు ఒకవేళ అంగీకరించని యెడల, అప్పుడు నీవు నా కుమారుగా—సుకుమారి మిథిలేశ కుమారినైనా స్వగృహమునకు పంపించుమని చేతులు జోడించి ప్రార్థింపుము. ఆమె అడవులు చూచి భయపడి నప్పుడైనా నా మాటలు జ్ఞప్తికి దెచ్చి ఇంటికి వచ్చునట్లు చేయుము. అమాత్యా, జానకి చెంత నుండిన నాకు కొంచెము ఆధారముగ నుండును. లేనియెడల నా ప్రాణములు నిలువవు. సుమంత్రా, నా రామ లక్ష్మణులను తీసుకొనివచ్చి నాకు చూపించుము" అని ఆర్తస్వరమున ఆక్రందించి రాజు తెలివి దప్పి నేల బడిపోయెను. రాజాజ్ఞ చొప్పున సుమంత్రుడు రథము తీసుకొనిపోయి, ఊరి వెలుపల సీతా రామలక్ష్మణులను కలుసుకొని వారికి అవధేశుని ఆజ్ఞ తెలియజేసెను. అంతట ఆ ముప్వురూ తుదిసారిగా అయోధ్యకు నమస్కరించి రథముపై కూర్చుండిరి.

రాముడు లేని అయోధ్య అనాథ అయ్యెను.

శోక విషాదచ్ఛాయ లావరించిన అయోధ్య, కారు చీకట్లు క్రమ్మిన కాళరాత్రివలె చూచుటకు భయంకరముగ నుండెను. వనములు వాడెను. సరస్సులు ఎండెను. గృహములు శూన్యము లయ్యెను శుక పిక శారికాదులు అన్నాహారములు మానెను. కళకళ లాడుచుండిన సాకేతపురి కాంతులుడిగి వెలవెల బోయెను.

కార్చిచ్చు పడిన కాననమునుండి ప్రాణభీతిచే కకావికలై పరుగులెత్తు వన్యజీవులవలె, కైక కిరాత చర్యకు కలతజెందిన అయోధ్యా వాసులు ఇండ్లు, వాకిండ్లు వదలిపెట్టి ప్రేమాధీనులై రాముని వెంట బడిరి. తన వెంట వచ్చుచున్న ప్రజానీకమును గృహమునకు మరలి పొమ్మని శ్రీరాముడు వారిని పలుమార్లు ప్రాధేయపడెను. వారు కొద్ది దూరము వెనుకకు నడచి మరలా పరుగెత్తుకొని వచ్చి రాజకుమారులను కలుసు

కొను చుండిరి. ఆనాటికి రామాదులు తమసానది తీరము చేర అచ్చట విశ్రమించిరి. తన్ననుసరించి వచ్చుచున్న సాకేత పురవాసుల స్నేహ సద్భావములు చూచి దయాస్వరూపుడైన శ్రీరాముని హృదయము చలించిపోయెను. దాశరథి వారి కెన్నియో ధర్మోపదేశములు చేసి, నచ్చజెప్పి, గృహోన్ముఖులను చేయుటకు ప్రయత్నించెను. కాని, మైత్రిబంధనములు త్రెంచుకొని వెనుకకు మరలలేకుండిన వారి వివశతను గ్రహించి రాముడు మరింత సందిగ్ధావస్థలో పడెను.

పగలంతా పరిశ్రమించి బడలిక చెందియున్న ప్రజలు గాఢ నిద్రలో మునిగియుండిరి. వారిని వదలించుకొనుటకు ఇంతకంటే మంచి తరుణోపాయము మరొకటి లభించదని ఊహించి, శ్రీరాముడు సీతా లక్ష్మణులను రథ మెక్కించుకొని అర్ధరాత్రి వేళలో అచ్చోటు వీడి పారిపోయెను. సుమంత్రుడు బండి జాడ కనబడకుండునట్లు చాకచక్యముతో రథమును నడిపెను.

మరుదినము ప్రాతఃకాలము నగర ప్రజలు లేచి చూచునప్పటికి అక్కడ రాజకుమారులు లేకుండిరి. నడి సముద్రములో నావను పోగొట్టుకున్న నావికులవలె వారు రామాదులను గానక బహు విధముల పరితపించిరి. మన బాధలు చూడలేక రాముడు మనలను వదలిపెట్టి పోయినాడని తలలు బాదుకొని చింతించిరి. గత్యంతరము లేనందున వారు దుఃఖించుచూ గృహోన్ముఖులై చనిరి. పురవాసులు రాముని పునర్దర్శనార్థమై వ్రతోపవాసములు చేయుచూ ప్రాణములను నిలబెట్టుకొని యుండిరి.

## నిషాదుడు

సుమంత్రుడు, సౌమిత్రి, జానకీరాములు శృంగబేర పురము సమీపించి గంగను దర్శించిరి. పరమపావని, సుఖదాయిని, నిర్మల జల తరంగిణియైన గంగాభవానికి భక్తి శ్రద్ధలతో నమస్కరించి, అందులో స్నాన పానములు చేసి శ్రమ దీర్చుకొని స్వస్థచిత్తులైరి.

శ్రీరాముని ఆగమనవార్త తెలుసుకొని, నిషాదపతి గుహుడు పుత్ర మిత్రు బంధువర్గమును వెంటబెట్టుకొని దశరథరాముని దర్శనార్థమై వచ్చెను. రఘురాముడు ప్రేమతో పలుకరించి గుహుని తమ సరసన కూర్చుండ బెట్టుకొనెను. నిషాద రాజు నత మస్తకుడై చేతులు జోడించుకొని—

"ప్రభూ, మీ చరణ కమలములు దర్శించుకొని మేము సుఖ సంపదలను పొంది ధన్యుల మైతిమి. సాధన దామములు, రాజ్య — ప్రజలు సకలమూ మీ యధీనము. దేవా మా గ్రామమునకు దయచేసి, మమ్ము తరింపజేయ వేడుచున్నాను." అని ప్రార్థించెను.

"మిత్రమా ! నిషాదరాజా ! తండ్రిగారి యాజ్ఞానుసారము పదునాలుగేండ్లు విపినవాసము చేయుటకుగాను వచ్చితిని. ప్రస్తుతము నగర వాసము నాకు నిషిద్ధమై యున్నందున మీ గ్రామమునకు రాజాలకున్నందుకు క్షమించవలెను."

అని శ్రీరాముడు చెప్పగా విని గుహుడు దుఃఖించెను. శృంగబేర పురస్త్రీ—పురుషులు సీతారాముల రూపలావణ్యములు చూచి ముగ్ధులై అయ్యో ఈ సుకుమారులను వనమ్ములకు పొమ్మని పెట్టుటకు వారి తలిదండ్రులకు నోరెట్లు వచ్చెను.

కాని, అదికూడ ఒకందుకు మంచికే జరిగెను. అందువలన మనము వీరిని దర్శించుకొను అవకాశము కలిగెను గదా ! అని తర్కించుకొని సంతోషించిరి.

నిషాదరాజు సమీపమున నున్న ఒక శింశుపా వృక్షము క్రింద వారుండుటకు చక్కని బస ఏర్పాటు చేయించెను. గ్రామస్థులు శ్రీరామునికి జోహార్లు పలికి ఇండ్లకు పోయిరి. గుహుడు మధురమగు కందమూల ఫలములను దెప్పించెను. ఆకులతోను, దర్భలతోను, మెత్తని పడకలు కల్పించెను. రామాదులు సాయం సంధ్యాదులు దీర్చుకొని, కంద మూలాదులు భుజించి సంతృప్తులై రాత్రి కక్కడ శయనించిరి.

లక్ష్మణుడు ధనుర్బాణములు ధరించి వీరాసనాసీనుడై మేల్కొని యుండెను. నిషాద రాజు వారికి చుట్టూ తన భటులను కావలిబెట్టి వ్యయముగ ఆయుధపాణియై వచ్చి సౌమిత్రి చెంత కూర్చొనెను.

కుశ శయ్యపై నిద్రించుచున్న సీతారాములను జూచి గుహుడు దుఃఖము ఆపుకొనలేక పోయెను. కన్నులనుండి అశ్రుధార స్రవించుచుండ అతడు లక్ష్మణునితో ఇట్లు ప్రసంగించెను.

"రాకుమారా ! ఇంద్ర భవనముకంటే మిన్నయగు రాజ భవనములో హంసతూలికా తల్పముపై దాసదాసీజనములు సేవించుచుండ సుఖనిద్ర జెందెడి శ్రీరాముడు మార్గాయాసముచే బడలిక గొని కటిక నేలపై పవ్వళించి యున్నాడు. జ్ఞాన సంపన్నుడైన జనక చక్రవర్తికి జన్మించి, మనుపతికి మిత్రుడైన కోసలపతికి కోడలు కాగలిగి, భూమి కులభూషణుని భర్తగా బడసిన భూపుత్రి నేడు నేలమీద నిద్రించుచున్నది. ఆహా ! కైకేయీ, నీ కుటిల బుద్ధి ఎంతపని చేసెను !" అని వారి దుర్దశ చూచి వగచుచున్న నిషాదపతి నవలోకించి లక్ష్మణు డిట్లు సమాధాన మిచ్చెను—

"నిషాదరాజా ! ఒకరి సుఖదుఃఖములకు మరొకరు హేతువు కాజాలరు. ఎవరిని కర్మఫలము వాడనుభవించవలసి యుండును. సుఖ దుఃఖములు, సంయోగ వియోగములు, జనన మరణములు, శత్రు మిత్రులు ఇత్యాదులన్నియూ మిథ్య. మాయా కల్పితములు. ఈ స్వాప్నిక జగత్తులోని సుఖదుఃఖములు నిజమని విశ్వసించి హర్ష విషాదములకు లోనగుట మంచిదికాదు.

"మిత్రమా విషయ సుఖములకు లోబడక, నిరంతర జాగరూకులై మేల్కొనియున్న యోగులకే జ్ఞాన ప్రాప్తి కలుగుచున్నది. అట్టి జ్ఞాన ధనులు మాయాజాలము నుండి ముక్తులై భగవద్భక్తిని సంతరించుకొని తరించుచున్నారు. అవాఙ్మానసగోచరుడు, ఆద్యంతము లేనివాడు, రూప నామ క్రియా రహితుడైన ఆ పరబ్రహ్మ భూభారము తొలగించి, భక్తులకు హితవు చేయుటకు రాముడై అవతరించి తన లీలా మానుష చర్యలు ప్రకటించుచున్నాడు. కనుక మిత్రమా ! దుఃఖించక శ్రీరాముని సేవించుము."

ఇట్లు వారుభయులూ శ్రీరాముని దివ్యలీలలు స్మరించుచుండ రాత్రి గతించిన అరుణోదయమయ్యెను.

జగన్మంగళాకారుడగు శ్రీరాముడు కాలకృత్యములు తీర్చుకొన్న పిమ్మట మర్రిపాలు తెప్పించి వాటితో సోదరుడు తాను జడలు ధరించెను.

ఆ దృశ్యము కన్నులారా తిలకించిన సుమంత్రుని గుండె కరిగి నీరైపోయెను. అంతట అమాత్యుడు కన్నుల నీరు నింపుకొని ముకుళితహస్తుడై యువరాజు కిట్లు విన్నవించెను :

"ప్రభూ ! మీకు వనములు చూపించి, గంగలో స్నానములు చేయించుకొని, నాలుగు దినములలో తిరిగి మిమ్ము ఇంటికి తీసుకొని రమ్మని చెప్పి మహారాజుగారు నాకు రథమిచ్చి పంపిరి, ఇది వారి ఆజ్ఞ, మీకు నివేదించుకొంటిని" అని విన్నవించి బాలునివలె ఏడ్చుచూ రాముని పాదములపై బడెను. శ్రీరాముడు మంత్రిని లేవదీసి ఇట్లు నచ్చజెప్పెను.

"ఓ మంత్రివరా ! మీకు తెలియని ధర్మములు లేవు. శిబి, దధీచి, రంతిదేవుడు, హరిశ్చంద్రుడు, బలిచక్రవర్తి మున్నగు రాజన్యులు అనేక కష్టముల కోర్చి ధర్మమును కాపాడిరి. అట్టి కష్టసాధ్యమైన ధర్మము నాకు సులభముగా హస్తగతమయ్యెను. దానిని నేను వదలిపెట్టిన నాకు ముల్లోకములలోనూ అపకీర్తి సంఘటింపకపోదు. సచివోత్తమా! మీరు నాకు పితృతుల్యులు. నా తండ్రిగారికి స్నేహితులు. మీకు నేను బోధించునంతటి వానిని గాదు. ఎవ్విధముగానైనను తండ్రిగారు మమ్ము గురించి దుఃఖించకుండునట్లు చూచుకొనవలసిన బాధ్యత మీది."

వీరి సంభాషణ విని గుహుడు అతని జనులు మిక్కిలి వ్యాకులపడిరి. ఇంతలో లక్ష్మణుడు కొన్ని కటు వచనములు పలుకగా శ్రీరాముడు అతనిని వారించి, తమ్ముని మాటలు తండ్రిగారితో చెప్పవద్దని ప్రాధేయపడెను. ఆపైన సుమంత్రుడు సీత విషయమై రాజుగారు సెలవిచ్చిన అభిప్రాయము ప్రస్తావించి—

"జానకి తిరిగి వచ్చిన మహారాజుకు కొంచెము ఊరట కలుగును. ఆమె ఇష్ట ప్రకారము అయోధ్యలో కానీ, జనకపురిలో కానీ సుఖముగ ఉండవచ్చును. ఎవ్విధముగనైనా మీరు సీతమ్మకు నచ్చజెప్పి పంపించవలసినదని రాజుగారు నాకు సెలవిచ్చిరి." అని సుమంత్రుడు దశరథ నందనునితో చెప్పుకొనెను.

శ్రీరాముడు సీతకు నానావిధముల నచ్చజెప్పి చూచెను. ఆమె గృహమునకు వెళ్లిన ఈ సమయములో—అత్తమామలకు, గురువులకు, బంధువులకు సకల జనులకు సంతృప్తి కలుగునని ఉపదేశించెను. మైథిలి తన వివశతను సోదాహరణముగ భర్తకు తెలియజేసి, పిమ్మట విషణ్ణాస్యుడై యున్న సుమంత్రు నవలోకించి సవినయముగ ఇట్లు ప్రసంగించెను :

"అమాత్య పుంగవా, విధి వైపరీత్యమున ఈ స్థితిలో మీ ఎదుట నిలబడి పితృసమానులైన మీకు ప్రతి వచనములు పలుకుచున్నందుకు నన్ను క్షమింపుడు. తండ్రీ ! సకల భోగ భాగ్యములతో విరాజిల్లుచున్న మా తండ్రిగారి సిరిసంపదలు నేను చూచితిని. ఇంద్రుని అర్ధ సింహాసన మధిష్ఠించి సత్కీర్తినొందిన మామగారి యశోవిలాసములు నాకు సుపరిచితములు. అత్త మామల ఆదరణ ఆప్యాయత నాకు తెలియకపోలేదు. కాని ఇవన్నియూ నాథుని పాదకమలములు సేవించునప్పుడు కలుగు సంతోషమునకు సాటి రావు కదా !

నా ప్రాణేశుని చెంత నున్నప్పుడు యీ వనవాస క్లేశములు నన్ను బాధించజాలవు. వీరులు, ధీరులైన ప్రాణేశ్వరుడు, మరది ధనుర్బాణములు ధరించి నన్ను రక్షించుచుండ శ్రమ దుఃఖాదులు నన్నేమి చేయగలవు!

"ఓ పూజ్యుడా! నన్ను గురించి దుఃఖించవద్దని, మా అత్తమామలకు ప్రణమిల్లి ప్రార్థించితినని, నా మారుగ మనవిచేయమని కోరుచున్నాను" అని సీత వినయ విధేయత లుట్టిపడుచుండ పలికెను.

జానకి చల్లని పలుకులు విని సచివుడు మణిని పోగొట్టుకొన్న సర్పమువలె నిరాశజెంది దిగులు పడెను. విరాశ విస్ఫ్రహచే ధైర్యము కోలుపోయి సుమంత్రుడు కన్నుల నీరు బెట్టెను. శ్రీరాముని ఆజ్ఞ అవశ్యము అనుసరణీయమై యున్నందున అతడు చేయునది లేక, వినమ్రుడై శ్రీ సీతా రామలక్ష్మణులకు నమస్కరించి, నావను జారవిడుచుకున్న నావికుని బోలె నిరాశతో రథము నడిపించుకొనుచూ గృహోన్ముఖు డయ్యెను. శ్రీరాముని వదలిపెట్టి వెళ్లుటకు మనసొప్పని గుర్రములు కూడ మాటిమాటికి వెనుకకు తిరిగి చూచి సకిలించుచూ తమ ఆవేదన తెలియజేసెను.

నోరులేని జంతువులే ఇంత పరితాపము పొందుచున్నప్పుడు ఆ తల్లిదండ్రుల హృదయము లింకెంత అలమటించుచున్నవో యని గుహుడు చింతించెను. ఇట్లు సుమంత్రుని బలవంతముగా సాగనంపి సీతారామలక్ష్మణులు గుహునితో కూడి గంగాతీరము చేరిరి.

## గంగను దాటుట

శ్రీరాముడు గంగను దాటుటకు నావికుని పిలువనంపెను. ఆ పడవవాడు చేతులు కట్టుకొని ముందుకు వచ్చి విధేయుడై ఇట్లు విన్నవించుకొనెను.

"దేవరా? మీ పాదధూళికి మానవులనుగా మార్చివేయుగల మూలికా ప్రభావమున్నదట, ఆ రహస్యము నాకు తెలిసినది. మీ పద రజము సోకి కఠినమైన రాయి ఒక అందమైన ఆడుదిగా మారినది గదా!

అట్లాంటప్పుడు నా కర్ర పడవ సంగతి వేరే చెప్పవలెనా? రాతి కంటే కొయ్య గట్టిది కాదు గదా! మీరు అడుగు పెట్టగనే నా నావ కూడ ఒక అందమైన ఆడుదిగా రూపొందిన నా గతి ఏమగును? ఇది నా జీవగర్ర, దీనితో నా పెండ్లాము బిడ్డలకింత గంజి సంపాదించుకొంటున్నాను.

స్వామీ మీరు గంగను తప్పక దాటతలచిన, ముందు మీ పాదములు కడుగుట నాకు ఉత్తరవు దయచేయండి. ఇందుకు మీరంగీకరించిన మీ దగ్గర చిల్లిగవ్వ కూడా పుచ్చుకొనకనే గంగను దాటించగలను.

"ప్రభూ! మీతోడు, మా రాజుతోడు, నేను నిజము చెబుతున్నాను. మీ తమ్ముడు బాణములతో నన్నిక్కడనే మట్టుపెట్టిననూ నేను మాత్రము నా చేతులతో మీ పాదములు కడుగనిదే నావలోనికి అడుగు పెట్టనీయను."

భక్తితో కూడుకొన్న ఆ పడవవాని మోటు మాటలు విని దయార్ద్రహృదయుడైన రఘురామ రాముడు సీతా లక్ష్మణులను జూచి సాభిప్రాయ

# రామచరిత మానస్

ముగ చిరునవ్వు నవ్వెను. ఎవని నామము ఒక్కమారు స్మరించిన భవ సాగరము తరింపజేయునో, ఎవని పాదత్రయమునకు భూమ్యాకాశములు సరిపడలేదో, ఆ మహామహుడు గంగను దాటుటకై పల్లెవానిని అర్థించి, వాని అభీష్టమునకు సమ్మతించెను.

అంతట పడవవాడు కర్ర పాత్రలో గంగా జలము తెచ్చి, హర్షోత్సాహముచే మన శ్శరీరములు పులకరింప, ప్రభువు పాద ప్రక్షాళన చేయసాగెను. ఆ సందర్భమున హరి పదనఖములు చూచి గంగ హర్షించెను. దేవతలకు, మునులకు లభ్యముకాని దేవుని చరణ కమలములు కడుగు భాగ్యము ఆ పడవ వానికి కలిగెను. వాడు వాని సతీసుతులతో పరమాత్ముని పాద తీర్థము పానము జేసి తరించెను. దివినుండి దేవతలు వానిపై సుమన వర్షము కురిపించిరి.



నాటకం, దర్శకుడు, హీరో యిన్‌తో:

'ఈ సీను చాలా బ్రహ్మాండంగా నటించారండి మీరు నిజంగా బాధపడ్డట్టే వుంది!'

'నిజంగా బాధగానే వుంది. కాల్లో ముల్లు గుచ్చుకుంది.' నటి బాధపడింది.

'మీకు ఎంతైనా పుణ్యముంటుంది ఈ నాటకం అయ్యేదాకా ఆ ముల్లు ఆలాగే ఉంచండి' డైరెక్టరు బ్రతిమాలాడు.

సూర్యకుమార్ (మధిర)

సీతారాములను, లక్ష్మణుని, గుహుని సురక్షితముగ గంగ కావలి ఒడ్డున చేర్చి, వాడు చేతులు కట్టుకొని వారి ఎదుట నిల్చెను. అయ్యో! ఈ పడవవాని కిచ్చుటకు చేతిలో చిల్లిగవ్వ కూడ లేదే అని శ్రీరాముడు మనస్సు చిన్నబుచ్చుకొనెను. ప్రియుని అంతర్యము గ్రహించిన సూక్ష్మగ్రాహి జానకి తటాలున తన చేతికున్న ముద్దుటుంగరము తీసి స్వామి హస్తములం దుంచెను. శ్రీరా శ్రీరాముడు దానిని పడవవాని కీయబోయెను. కానీ వాడు తన రెండు చేతులతో శ్రీరాముని పాదములు బట్టుకొని,

"స్వామీ, ఈ దినము నేను మీనుండి పొందని లాభమంటూ ఒకటున్నదా? నా పాపము, నా తాపము, నా రోగము, నా దారిద్ర్యము అన్నియూ మీ దర్శన, స్పర్శనలచే నశించిపోయెను. బహుకాలమునుండి నేను పడిన శ్రమకు దేవుడు ఈ దినము నాకు చక్కని ఫలిత మిచ్చెను. ప్రభూ మీ అనుగ్రహము కంటే నాకేమి కావలెను! మీరు సురక్షితముగ తిరిగి వచ్చినపుడు మీరేమిచ్చినా కండ్ల కద్దుకొని స్వీకరించెదను. అని వాడు ప్రార్థించెను. కరుణామయుడు ఆ పడవవానికి అక్షయ భక్తిని ప్రసాదించి సెలవిచ్చెను.

తదుపరి శ్రీరాముడు గంగలో స్నానముచేసి శివుని పూజించెను. జానకి గంగకు అంజలి ఘటించి "గంగాభవానీ, నేను, నాథుడు, మరది క్షేమముగా తిరిగివచ్చి నిన్ను దర్శించుకొనగలభాగ్యము అనుగ్రహించు" మని అర్థించెను.

అందుకు దేవనది హర్షించి ఇట్లు ప్రత్యుత్తర మిచ్చెను:

"ఓ వైదేహీ, నీ మహిమా ప్రభావములు లోక విదితము. నీవు నన్ను పెద్దజేసి ప్రార్థించుట నీ దయకు తార్కాణము. ఓ దేవీ! మీరు ముగ్గురు క్షేమముగ అయోధ్యకు తిరిగి వచ్చి సత్కీర్తి నందగలరు."

మంగళప్రదమైన గంగ పలుకులు విని సీతా రాములు సంతుష్టులైరి.

ఆపైన జానకీ వల్లభుడు నిషాదరాజు సేవకు కృతజ్ఞుడై అతనిని స్వగృహమునకు మరలి పొమ్మని కోరెను. గుహు డందుకు ఖేదపడి మరి కొన్ని దినములు అడవిలో వారికి సహాయముగ ఉండి సేవజేయు భాగ్యము ప్రసాదించమని అభ్యర్థించగా రాము డందు కంగీకరించెను. గుహుడు తన అనుచరులను వారి వారి గృహములకు పంపించి తాను శ్రీరాముని అనుసరించెను.

## భరద్వాజుని సందర్శనము

శ్రీరాముడు గంగకు వందన మాచరించి, విఘ్నేశ్వరుని, శివుని సంస్మరించి అక్కడనుండి అడవి దారి పట్టెను. ఆదినము వారు చెట్లక్రింద గడపి మరుదినము తీర్థరాజమైన ప్రయాగ క్షేత్రము చేరిరి.

సకల పుణ్యములకు, సర్వ మోక్షములకు, ముక్తికి, సిద్ధికి మూలమై నలుబది క్రోసుల పర్యంతము వివిధ తీర్థములచే విరాజిల్లుచున్న ఆ ప్రయోగ క్షేత్ర మహాత్మ్యమును గురించి శ్రీరాముడు సీతారాములకు వివరించి చెప్పెను. ఆ నల్వురూ తీర్థరాజుకు ప్రణమిల్లి అచ్చట ఉన్న వన తపోవనములను, దర్శించి త్రివేణీ సంగమములో స్నాన మాచరించి శివుని, క్షేత్రనాథుడైన మాధవస్వామిని సేవించిరి. ఆపైన రామాదులు అచ్చట నున్న భరద్వాజుని ఆశ్రమమునకు వచ్చిరి.

మహర్షి శ్రీరాముని ఆలింగనము చేసుకొని మహదానంద భరితుడై శ్రీరాముని మనఃపూర్వకముగ ఆశీర్వదించెను. ఆ బ్రహ్మదేవుడు నేజేసిన పుణ్యములకు ఫలమును నా కండ్ల ఎదుటనే తీసుకొని వచ్చెను అని సంతసించెను.

మునీంద్రుడిచ్చిన ఆతిథ్యమును స్వీకరించి వారు సంతృప్తులై మార్గాయాసము తీర్చుకొనిరి. మహర్షి ఉల్లముప్పొంగ జగదభిరాముని సమీపించి ఇట్లు ప్రవచించెను.

"హే రఘువంశోత్తమా! రామా! నేటికి నిన్ను దర్శించుకొని నా తపస్సు, నా త్యాగము. నా క్షేత్రవాసము, నా యజ్ఞయాగము లన్నియూ ఫలించి నా ఆశలు తీరెను. ఇంతకంటే నా కేమి కావలెను! ఓ రామచంద్రా! నీ పాద పద్మములందు సదా సహజానురాగము గలవాడనై వర్తించునటుల కరుణించుము."

శ్రీరాముడు మహర్షి మాటలకు కొంచెము సిగ్గుపడి, అతని భక్తి హృదయము జూచి ప్రసన్నుడాయెను. పిమ్మట దశరథ నందనుడు మునీశ్వరుని మహిమా విశేషములను గురించి ప్రసంగించెను. ఇట్లు రఘురాజు మునిరాజు లిద్దరూ కొంతసేపు పరస్పర ప్రియవచనములతో గడపిరి.

ప్రయాగ క్షేత్రమందు నివసించుచుండిన తాపసులు, మునులు, సిద్ధులు, వటులు ఇత్యాదులు భరద్వాజుని ఆశ్రమమునకు వచ్చి శ్రీరాముని దివ్య దర్శనము చేసుకొని పరితృప్తులైరి. ఆనాటి రాత్రికి రామాదులు భరద్వాజుని ఆశ్రమములో గడపిరి. ప్రాతఃకాలము త్రివేణిలో స్నాన సంధ్యాదులు ముగించుకొని, మహర్షికి ప్రణమిల్లి, శ్రీరాముడు సీత, లక్ష్మణుడు, గుహునితో గూడి ప్రయాణ మయ్యెను.

బయలుదేరుటకు ముందు శ్రీరాముడు మునితో మేము ఏ మార్గము అనుసరించవలెనో తెలియజేయుమని కోరెను. అందుకు భరద్వాజుడు మీ కన్ని మార్గములు సుగమములే అని పలికి సాభిప్రాయముగ మందహాసము చేసెను. మహర్షి వద్ద సెలవు తీసుకొని వారు ముందుకు సాగిరి.

## య ము నా తీ ర ము

రామాదులు ప్రయాగ నుండి యమునానది వద్దకు వచ్చిరి. ఘనశ్యాముడైన శ్రీరాముడు తన వారితో కలసి సూర్యకుమారి యమున యొక్క చల్లని నీటిలో స్నానపానములు చేసి సంప్రీతుడయ్యెను.

ఇంతలో యమునాతీర వాసులైన స్త్రీ పురుషులు ఆ ముగ్గురు మూర్తులను చూచుటకు పరుగులెత్తుకొని వచ్చిరి. వారు సీతారాముల దివ్య మంగళ విగ్రహములను నేత్రపర్వముగ తిలకించి ముగ్ధులైరి.

ఆ సమయమున లఘు వయస్కుడు, తేజోవంతుడైన ఒక తపస్వి అచటికి వచ్చి, శ్రీరాముని పాదములకు సాష్టాంగ నమస్కారము చేసెను. త్రికరణశుద్ధిగ సేవించుచున్న తన ఇష్టదేవుని జూచి ఆ యువమునికి కన్నుల నుండి బాష్పములు రాలి ఆనందముచే దేహము పులకరించెను. శ్రీరాముడు ఆ తాపసిని హృదయమునకు హత్తుకొని ఆలింగనము చేసుకొనెను. పరమతత్త్వము, ప్రేమ పరస్పరము కలుసుకున్నట్లు వారుభయులూ ఒకరినొకరు చూచుకొని సంతుష్టాంతరంగులైపోయిరి. అతడు సీతాదేవికి, లక్ష్మణస్వామికి నిషాదపతికి సాష్టాంగ నమస్కారములు చేసి, వారి దివ్యదర్శనమైనందుకు పెన్నిధి చూచిన పేద చందమున అమందానంద భరితుడాయెను. ఆ బాలయోగి పేరు, ఊరు, వృత్తి వ్యాపారములు ఎవ్వరికినీ తెలియవు.

తదుపరి భక్తవత్సలుడైన సీతానాథుడు నిషాదపతిని ఇంటికి వెళ్లుటకు సమ్మతింపజేసెను. గుహుడు వారికి నమస్కరించి సెలవు తీసుకొని గృహోన్ముఖుడై చనెను. సీతారామలక్ష్మణులు యమునకు ముకుళిత హస్తులై వందనమిడి ముందుకు సాగిరి.

## గ్రామప్రజల ప్రేమోత్కంఠత

దారిలో పోవుచున్నపుడు వీరికి అక్కడక్కడ బాటసారులు ఎదురుపడుచుండిరి. వారు ఈ మువ్వురు మూర్తులను చూచి [illegible] ఇట్లు ప్రసంగించుచుండిరి : "అయ్యలారా! చూచుటకు మీ రెవ్వరో రాజవంశీయులవలె కనబడుచున్నారు. ఎవ్విధమైన రక్షణలు లేక ఇట్టి స్థితిలో నికటమున దుర్గమారణ్యములందు సంచరించు చుంటిరి. అయ్యో మీవెంట ఒక సుకుమారి కూడ నడచుచున్నదే! క్రూర మృగములు సంచరించు ఘోరారణ్య మార్గములు మీకు సుపరిచితములు కాదు. మీరిచ్చగించినచో మేము మీకు తోడుగా కొంత దూరము రాగలము." అని చెప్పుచుండిరి. శ్రీరాముడు వారి ప్రేమానురాగములకు ఆనందించి మంచి మాటలతో ఆ బాటసారులను వెనుకకు బంపుచుండెను.

ఆ పుణ్య పురుషులు పయనించుచున్న పథములు, ఆ మార్గములందలి జనపదములు, ఆ గ్రామములలో నివసించుచుండిన ప్రజలు ఎంత సుకృతముచేసి అక్కడ నివసించుచుండిరో చెప్పజాలము. శ్రీ సీతారాముల చరణ స్పర్శచే పునీతములైన ఆ పుణ్య భూముల అదృష్టమునకు దేవలోక, నాగలోకములు గూడ నోచుకొనలేదు. రఘుకుల మణి రామచంద్రుడు స్నానముచేసిన నదులకు, ఆ మహాత్ముడు విశ్రమించిన తరుచ్ఛాయలకు మానస సరోవరము, కల్పవృక్షములు సమానము కావు. మేఘములు నీడ నిచ్చుచుండ దేవతలు పుష్పములు జల్లుచుండ గిరులను, వనములను, విహంగములను, మృగములను వనతరులతా వితాన వైభవములను తిలకించుచూ ఆహ్లాదముతో ఆ ప్రభువు ముందు కడుగిడుచూ నడచు చుండెను.

విపిన మార్గమున వెళ్ళుచున్నపుడు, అక్కడక్కడ గ్రామములలోని స్త్రీ పురుషులు వీరిని దర్శించుటకై గుంపులు గుంపులుగా పరుగెత్తుచుండిరి. సీతారాములను దర్శించి, స్పర్శించి ఆదరించుటకై ఆ గ్రామస్థులు చూపిన ఆతురత, ఆప్యాయత అవర్ణనీయమైనది. ఒకడు శ్రీరాముని దివ్య విగ్రహము చూచుచూ ఒళ్లు మరచి అతని వెంటనే నడచిపోవుచుండును. మరొకడు మార్గమందు దృష్టి ప్రసరించి చూపుల కందునంత వరకూ ఆ జగన్మోహనుని తిలకించుచూ నిలబడియుండును. ఇంకొకడు దారిలో చల్లని మఱ్ఱి నీడలో తృణపల్లవములతో పాన్పు అమర్చి, వారు సమీపమునకు వచ్చినపుడు విశ్రమించి పోవలసినదిగా కోరును. ఒకడు చల్లని జలము పుచ్చుకొని వచ్చి వాటిని త్రాగవలసినదిగా ప్రార్థించును. పరమ కృపాలుడగు శ్రీరాముడు ఆ గ్రామస్థుల తియ్యని మాటలు, నిర్మల ప్రేమను చూచి ముగ్ధుడగుచుండెను.

జానకి అలసియున్నందున వారు ఒక వట వృక్ష చ్ఛాయలో కొంచెము విశ్రమించుటకు కూర్చొనిరి. సమీప గ్రామస్థులు పరుగెత్తుకొని వచ్చి శ్రీ సీతారాముల సౌందర్యశోభను నేత్ర పర్వముగ చూడసాగిరి. ప్రభువు తన ముఖము నాల్గు వైపుల నున్నవారికి ఏకకాలమున కనబడుచుండునట్లు చేసెను. శ్యామల గౌర వర్ణములచే శోభించుచున్న ఆ సోదరుల శరీర సౌందర్యము అంగాంగముల సౌష్ఠవత చూపరులను భ్రమింపజేసెను. నడుముకు తూణీరము, కరకమలములందు ధనుర్బాణములు, శిరమున జటామకుటము ముంచి వారు నారగుడ్డలు ధరించియుండిరి. విశాలనేత్రములతో శరత్కాల చంద్రుని బోలు వారి ముఖములందు స్వేద బిందువులు శోభించుచుండెను. పల్లె ప్రజలకు సీతారామ లక్ష్మణుల రూపలావణ్యములను తృషితనేత్రులై యెంత జూచినను తృప్తి లేకుండెను. గ్రామ స్త్రీలు సీతను సమీపించి మొదట యేదో అడుగవలెనని కుతూహల పడుదురు, పిమ్మట బిడియపడి ఊరకుందురు. తుదకు సరళ స్వభావులైన ఆ గ్రామ కాంతలు వైదేహి నిట్లు ప్రశ్నించిరి—

"రాకుమారీ! ఈ రాజకుమారుల చక్కదనము చూచుట కెంత ముచ్చటగ నున్నది. ఒకరి మేని కాంతి మరకతమువలె మరొకరి శరీర వర్ణము సువర్ణమువలె దీపించుచున్నది. శరత్కాలచంద్రుని వంటి ముఖ వర్చస్సు, పద్మదళముల బోలిన వారి నేత్రములు ఎంత ఆనందముగా నున్నవి. ఓ సుముఖీ! కోటి మన్మథుల ధిక్కరించు అంత చందములచే అలరారు ఈ వయ కిశోరులు నీకేమగుదురు? వారి నామధేయము లెయ్యవి?"

స్నేహశీలురై అడిగిన ఆ అమాయకుల ప్రియ వచనములకు సీత సిగ్గుపడి తనలో తాను చిన్నగ నవ్వుకొనెను. పిమ్మట ఆ బాలహరిణేక్షణ గ్రామ వనితలను రామలక్ష్మణులను ఒక్కసారి లజ్జా దృష్టులతో అవలోకించి తల వంచుకొని మధుర మంజుల వచనముల నిట్లనెను : "సఖులారా! సరళ స్వభావుడు, గౌరవర్ణము కలిగిన ఆ చిన్నతను నా మరది, పేరు లక్ష్మణమూర్తి" అని చెప్పెను. పిమ్మట జానకి నునుసిగ్గు దోప, తన వదన బింబము చేలాంచలముచే అడ్డుచేసుకొని లజ్జా నేత్రములతో రామునివైపు సౌంజ్ఞచేసి, 'అతను నా భర్త' యని సధర్మ గృహిణీ భావమున సూచించెను. మైథిలి మధురోక్తులు గ్రామ వనితల కర్ణములకు కమనీయముగా నుండెను. బద్ధానురాగులైన ఆ వనితలు "అమ్మా! శేషుని శిరముపై ఈ భూమి యున్నంతవరకూ నీ మాంగళ్యము నిత్య మంగళమై యుండుగాక, తల్లీ శివునికి పార్వతి వలె నీవు నీ భర్తకు ప్రియురాలివై వర్ధిల్లుము. మీరు తిరిగి ఈ దారిన వచ్చినపుడు మమ్ము మీ దాసులుగా భావించి దర్శన మీయవలెను" అని వినయోక్తుల పలికిరి.

లక్ష్మణుడు ఆ గ్రామస్థులను మార్గ మడిగి తెలుసుకొనెను. ఇట్లు కొంతకాలము ఆ గ్రామస్థులతో గడపి, వారిదగ్గర సెలవు తీసుకొని సీతారామలక్ష్మణులు అచ్చోటు వీడి అగ్రగాములైరి. (సశేషం)



అర్థంకావు చిట్టీ !"

"నన్నా పేరుతో పిలవద్దని చాలాసార్లు చెప్పాను."

"మరెలా పిలవమంటావ్ ?"

"నా పేరుతో పిలువు, చక్కగా మృణాళినీ అంటూ !"

"హు .... నీకే నువ్వు బాగావే చెప్పావ్. ఆ పేరు సరిగ్గా పలకలేక నా తాడు తెగుతోంది. నోటికీ, నాలిక్కీ పెద్ద ఎక్సర్‌సైజ్ అవుతుంది. అయినా దేశంలో యింకా ఏ పేరూ దొరకనట్టు ఈ పేరే పెట్టాలా మావయ్య. చక్కగా వసంతా, మాధవీ, రాధా—ఎన్ని ? ఎన్ని పేర్లు లేవు ? అంత చక్కటి సరళమైన పేర్లు వొదిలి కంకర పోసిన రోడ్డు లాగా మృ .... ణా .... ళి ....నీ, ఏవిటి నా బొంద?"

"అంత కష్టమైతే అసలు పిలవకు అంతే." అంది మృణాళిని రుస రుస చూస్తూ.

"తప్పుతుందా మరి. మానవుడై పుట్టిన తర్వాత ఎన్నో కష్టాల్ని ఎదుర్కొనవలసి వస్తుంది. అలాటిది .... "

"బావా ! నిజం చెప్పు. ఉదయం వరకూ విక్షేపంలా ఉన్నవాడివి యిప్పుడిలా మారిపోయావే.."

"అదేం ప్రశ్న.?"

"లేకపోతే ఏవిటి వరస ? మానవుడు జీవితం, దృక్పథం, దేశం, అప్పారావుగారు—చాలా పెద్దమాట లుపయోగిస్తున్నావ్."

"నా గురించి నీకేం తెలీదసలు" అన్నాడు సీరియస్‌గా.

ఈమాట విని పకపకా నవ్వేసింది మృణాళిని.

"ఎందుకలా పగలబడి నవ్వుతావ్ ?" విసుక్కున్నాడు ప్రసాదం.

"నిన్ను చూస్తూంటే నవ్వాలనిపిస్తూంటుంది బావా !"

"ఈ మాట డెబ్భైమూడోసారి అంటున్నావ్ చిట్టీ, కాదు మృణా ! నువ్వు కాబట్టి విని సహిస్తున్నాగాని—లేకపోతే ఏమిటి నీ ఉద్దేశ్యం—నా మొహంలో ఏవైనా కోతు లాడుతున్నాయా నువ్వు నవ్వటానికి ?

"అవి వేరే ఎందుకులే బావా ?"

"వాట్ .... నేను కోతినా ?"

"అని ఎవరన్నారూ ?"

"మృణా .... నువ్వొక్కదానివే తెలివైనదానివని మురిసిపోకు. ఇవతలవాళ్ల గొప్పతనాన్ని గౌరవించడం నేర్చుకో."

అంతలో వంటగదిలోంచి మృణాళినిని పిలిచింది వాళ్లమ్మ.

"అమ్మ పిలుస్తోంది. వస్తా" అన్నది మృణాళిని.

"కూర్చో .... అని డెప్పుడూ యింతే. గొప్ప పవేదో అవతల తగలడిపోతున్నట్టు గావుకేకలు. మనకి తెలియంది కాదుగదా."

"అసలు సంగతేవిటో కనుక్కువస్తాగా" అన్నది మృణాళిని.

"ఊఁ .... అయితే వెళ్లు. మళ్లా వెంటనే రావాలిసుమా. మనం యివ్వాళ అలా బరేజీవైపు వెళ్లాలి." అన్నాడు ప్రసాదం.

మృణాళిని నవ్వుకుంటూ వంట గదిలోకి వెళ్లింది.

ప్రసాదం ఆలోచనల్లో మునిగిపోయేడు. మృణా

# మనిషి - మిథ్య

27 వ పేజీ తరువాయి

ళిని కీవేళ తన గొప్పదనం ఏమిటో చాటి చెప్పాలి. ఈ దెబ్బతో బావా ! నువ్వింతటి వాడివా' అని ఆశ్చర్యపోవాలి. హు .... ఏవిటనుకుంటుందో మరి.

తను చదివిన త్వమేవాహమ్‌లోని నాలుగు ముక్కలూ మృణాళినికి ఎలా చెపుతే, అపిల్ల ఎలా రియాక్ట్ అవుతుందీ ఊహిస్తున్నాడు. అందుకు అవసరమైన రిహార్సలూ మనసులో చేసుకుంటున్నాడు.

కాసేపటికి మృణాళిని కాఫీ తీసుకొచ్చింది.

"ఇదిగో ముందీ కాఫీ తాగు .... నీ మాటలన్నీ మా అమ్మ విన్నదట, 'గొప్ప కష్టపడిపోయాడూ, పాపం—యీ కాఫీ యిచ్చిరావే పిల్లా !' అని నన్ను పంపింది." అన్నది.

"ఏమిటీ! అత్తయ్యా, నా మాటలన్నీ విన్నదా? అయినా ఆవిడ కదేం బుద్ధి ? మనం పిల్లలం కాబట్టి, అదీగాక .... "

"ఊఁ ... అదీగాక."

కొత్తగా ఆపరేషన్ చెయ్యడానికి వెళ్లిన డాక్టర్ గారికి భార్య ఫోన్ చేసింది: "హలో! ఆపరేషన్ సక్సెసా?"

డాక్టర్ : "ఆ! ఆపరేషన్ జయప్రదంగా జరిగింది. కాని, రోగి మరణించాడు సార్!"

రంగారావ్

ఇలా నిగ్గదీసి అడుగుతే తనేం చెప్పగలడు?

"పోదూ, ఏం తెలీనట్టు నటన—కాబట్టి మనం మనం అనేక విషయాలు మాటాడుకుంటాం అంతమాత్రంచేత ఆవిడ గోడచాటు నుండి వినాలేం ? నాన్సెన్స్. ఈ పద్ధతేం బాలేదు. అత్తయ్యకి ఎటికెట్ తెలీదు. చదువుకోలేదు కాబట్టే అవతలివాళ్ల నెలా .... "

"అవు బావా ! గుర్రాన్ని కట్టేయ్. నీ మాటలు గోడచాటున నిలబడి వినాల్సిన ఖర్మ మా అమ్మకేం పట్టిందని ? తమరిక్కడ మాటాడుతూంటే, అది సలక్షణంగా గవర్నర్‌పేట సెంటర్‌కి వినిపించగలదు. ముందు కాఫీ తాగు, చల్లారిపోతుం దవతల."

"మరి మన ప్రోగ్రాం మాటేంజేశావ్ ?"

"కాఫీ తాగిన తర్వాత ఆలోచిద్దాం."

"నో ఆలోచించే బిజినెస్. ఎస్ ఆర్ నో. ఏదో ఒకటి చెప్పు."

"పూ.... అలాగే."

"అంటే."

"ఎస్."

"గుడ్. థాంక్స్" అని గబగబా కాఫీ తాగేసి లేచి

"కమాన్" అన్నాడు.

"అమ్మతో చెప్పి వస్తా నుండు."

"నో అమ్మా నో నాన్నా ! మనకు [illegible] అని [illegible]

స్వాతంత్ర్య మున్నదన్న మాట మరిచిపోవద్దు కమాన్...."

"పోదూ నీ బడాయి ! ఉండు అమ్మతో ఒక మాట చెప్పొస్తా."

"ఏంమాట" అన్నాడు ఉలిక్కిపడి.

"అదే మన ప్రోగ్రాం."

మృణాళిని ఈమాట అంటూండగానే, అత్తయ్యగారు గుమ్మం దగ్గర నిలబడ్డారు. ఆమెను చూచిన వెంటనే తల వంచుకున్నాడు ప్రసాదం. అతనికి భయంగా ఉన్నమాట నిజం.

"వెళ్లిరా తల్లీ .... పాపం .... సరదాపడుతున్నాడాయే. ఇప్పుడు కాదు అల్లుడూ యీ సరదాలు, నలుగురు పిల్లలు పుట్టిం తర్వాతా ఉండాలి. మరి" అన్న దావిడ నవ్వుతూ.

గతుక్కుమన్నాడు ప్రసాదం. మృణాళినితోపాటు బయట కొచ్చేడు. చాలాదూరం నడిచా రిద్దరూ. అతని కిప్పుడు పంజరం నుంచి బయటపడినంత సరదాగా ఉంది.

"మా అమ్మ అన్నమాటకి సిగ్గుపడ్డావా బావా" అని అడిగింది మృణాళిని దారి మధ్యలో.

"గొప్పమాటన్నావ్. నాకు సిగ్గెందుకు ? ఆవిడన్న మాటలో తప్పేముంది గనుకా ? అవును. మరి—ప్రేమా, పెళ్లి అనేది అంత పవిత్రంగా చూచుకోవాలి. ఇది శాశ్వతమైన బంధం నాలుగు రోజుల ముచ్చట కాదు. ఈనాడు జరిగే వివాహాలు, సాగే ప్రేమ కలాపాలూ—"

"హెవీ డైలాగ్సు .... ఫుల్‌స్టాప్."

ప్రసాదం విసుక్కున్నాడు.

"ఎప్పట్నుంచో చూస్తున్నాను, నీ వరస. ఏం బాగోలేదు సుమా ! ఒకళ్ల అభిప్రాయాలు మరొకళ్లు తెలుసుకోవలసిన అవసరం యిప్పుడు ఎంతైనా ఉంది. మరి అలాంటిది నీకు బొత్తిగా సరిపడటంలేదంటే నాకేం నచ్చలేదు."

"క్షమించు. నువ్వు మాటాడే విషయానికి ఇక నేను అడ్డు చెప్పను. సరేనా ?"

"అంత కోపమైతే ఎలా మృణా .... నన్నూ అర్థంచేసుకో."

ఇద్దరూ బేరేజీ దగ్గర కొచ్చారు. ఒకచోటనే కూర్చున్నారు.

"చక్కటి సాయంత్రమన్నా, అందమైన సాహిత్యమన్నా నాకు చాలా యిష్టం" అన్నాడు ప్రసాదం.

"మంచిదేగా."

"నేను కాలేజిలో చదువుతూండగా, సాహిత్య సభలకి హాజరవుతూండేవాడిని. ఒకసారి శ్రీ శ్రీ మా కాలేజీకి వచ్చారు. ఉపన్యాసం యిచ్చారు. సభ ముగిసిన తర్వాత నేనాయన్ను అడిగేను. 'శ్రీ శ్రీ గారూ ! ఈనాడు వొచ్చే రచనలమీద మీ ఖచ్చితమైన అభిప్రాయ మేమిటండీ ?' అని. అప్పుడాయన నా భుజం తట్టి, కళ్ల జోడు చేతులో ఉంచుకొని 'నాయనా ప్రసాదం ! రత్నాలూ, రాళ్లూ మునుపూ ఉన్నాయి, ఇప్పుడూ ఉన్నాయి, ఎప్పుడూ ఉంటాయి !' అని చెప్పేరు. అలాగే ఒకసారి ఆరుద్రగారితో మాటాడటం జరిగింది. 'గేయ కవిత పట్ల మీ అమూల్యాభిప్రాయం ఏమిటని' అడిగేను. ఆయన నావైపు తీక్షణంగా చూస్తూ సిగరెట్టు పొగ నా తలమీంచి వదులుతూ 'మహాప్రస్థానం, త్వమేవాహమ్ చదివావా ప్రసాదం!'

"అన్నట్టు కృష్ణశాస్త్రిగారి పైన నీ అభిప్రాయం ఏమిటి బావా !" మధ్యలో అడిగింది మృణాళిని.

ప్రసాదానికి పచ్చి వెలక్కాయ గొంతులో ఇరుక్కున్నట్టయింది. పతి, కృష్ణశాస్త్రి గురించేమీ చెప్పలేదు. అందుచేతనే తన బుర్ర ఉపయోగించి,

"ఆయన తెలుగు సాహిత్యాని కొక మణిపూస" అన్నాడు.

"మరి విశ్వనాథవారో."

"ధ్రువతార." అనేసి తన సమయస్ఫూర్తికీ, చక్కటి పోలికకీ మురిసిపోయాడు ప్రసాదం.

"అయితే నువ్వు చాలా చదివావూ !"

"హు .... చదవడం! నేనూ మరో వెంగళప్పయ్యా చదువుతారు. అదికాదు గొప్పతనం. ఆ మహానుభావులేం చెప్పారనేది ఆకళింపు చేసుకోవాలి, అది ముఖ్యం. చూడరాదూ—ఆరుద్ర త్వమేవాహమ్ చదివి శ్రీ శ్రీ లాటివారు 'నేనిహ పద్యాలు రాయకపోయినా పర్వాలేదు' అన్నారంటె"

"అవునుగానీ త్వమేవాహమ్ నీకు నచ్చిన పుస్తకాల్లో ఒకటా బావా ?"

"నాకు నచ్చిందే త్వమేవాహమ్. అది మామూలు పుస్తకం కాదు. మహా కావ్యం. ఎంత చక్కటి అభిప్రాయా లున్నాయి దాన్లో. జీవితాన్ని ఆరుద్ర ఎంత బాగా అర్థం చేసుకున్నాడనుకున్నావ్. ఒకచోట జీవితం గురించి అంటాడు.

'జీవితం తిరనాళ్లలో ఖర్చుపెట్టుకోమని
పెదనాన్నగారు ఇచ్చిన డబ్బులు కాలం
చరాచర జీవకోటిని శ్రీమంతులైన బంధువర్గం
మానవుడు మానవుడి కిచ్చిన వారసత్వం కాలం'
అనీ.

ఆరుద్ర తన చమత్కారంతో పాఠకుణ్ణి చప్పున ఆకర్షిస్తాడు. కవిత్వంలో టెక్నిక్ కావాలన్న వాళ్లలో ఆరుద్ర ఒకడు. ఆయన కవిత్వంలో పాత్రోచిత ఛందస్సు వాడారు. ఆయనే అంటారు. గిరీశంచేత 'రిషణోద్భాసితస్త విష్ణానవిష్వపచయమ్ము' అని ఎలా అనిపించలేరో అలాగే అగ్నిహోత్రావధాన్ల చేత 'షి లీవ్స్ ది బెడ్ ఏ ఎమ్ ఫోర్' అనిపించలేరూ అని. ఆవిధంగా—'' అని ఆపేశాడు. తర్వాత ఏం చెప్పాలో గుర్తుకురాక.

మృణాళిని అతనిపైన దండయాత్ర సాగించింది. చకచకా చదివినట్టు.

"బ్రెయిన్‌లో బ్రెన్‌గన్
రెయిన్‌లా ఆలోచనల బ్రెయిన్
స్ప్రయిన్‌లా కార్డులో స్ప్రెయిన్ .....
.... .... .... ....

చదివి ఆగి "ఇక్కడ కవి హృదయం ఏమిటో చెప్పు బావా! వినాలని ఉంది" అని అడిగింది.

ప్రసాదం బిక్కమొహం పెట్టేడు.

"నువ్వు చదివావా త్వమేవాహమ్" అని అడిగేడు నెమ్మదిగా.

"చదివాను కాని యిక్కడ కవి హృదయం..."

'పోనిద్దూ. కొన్ని కవి హృదయాలు మనకి అర్థంకావు. వాటి మానాన వాటి నొదిలిపెట్టడం మన ధర్మం.''

ఆరుద్రని చదివినట్టు గానీ, ఇలా అడుగుతుందనిగానీ ముందే తెలుస్తే కాస్త జాగ్రత్త పడేవాడు ప్రసాదం. ఇప్పుడు జరగవలసిన ప్రమాదం జరగనే జరిగింది.

మృణాళిని పకపకా నవ్వేసి అన్నది.

"నువ్వే అన్నావుగా బావా ! మహానుభావులేం చెప్పారో చదివి అర్థం చేసుకోవాలని. అప్పుడే ఆ మాట కాస్తా మార్చేస్తే ఎలా ?"

బావకి దడ పట్టుకుంది. మృణాళినికి 'సాహిత్యం' లో ఈమాత్రం ప్రవేశ ముందని తెలుస్తే ఆ జోలికి పోయేవాడే గాదు. ఇప్పుడు కొంపమీదికి తెచ్చుకున్నట్టయింది.

"కాబట్టి మై డియర్ ప్రసాదం ! ఆచరించడం చెప్పినంత సులభం కాదు."

ప్రసాదం ఏమీ మాటాడలేదు.

"ఊం .... పోనీలే .... ఏదైనా కొత్త విషయం చెప్పుదూ."

"నీకు నేను చెప్పవలసిన వాడినా" అన్నాడు బాధగా, నిష్ఠూరంగాను.

మృణాళినికి బావపైన జాలి కలిగింది..

"నిన్ను కించపరచాలని నా కెప్పుడూ లేదు బావా. మీదు మిక్కిలి నువ్వంటే నాకు విపరీతమైన గౌరవం" అన్నది సూటిగా.

"నిజమా." అడిగాడు.

తలూపింది మృణాళిని.

"నేను చాలా అదృష్టవంతుడ్ని చిట్టీ !" అన్నాడు ఆనందంగా.

"అబ్బ మళ్లా ఆ పేరేనా. పిలుస్తే .... "

"ఆల్‌రైట్ కరెక్ట్ మృణాళిని ! నిన్ను మృ .... ణా .... ళి .... ని అనే పిలుస్తాను." అన్నాడు ప్రసాదం.

అప్పటికే బాగా చీకటి పడింది. ఇద్దరూ లేచారు యింటికి వెళ్లడానికి. అనుకోకుండా చిన్న వర్షపుజల్లు రావడం ప్రారంభమైంది. గబగబా నడిచి ఓ రిక్షాలో ఎక్కారు యిద్దరూ.

రిక్షా కదిలింది. దారి మధ్యలో ....

"ఇలాగే నీ పక్కన కూర్చుని జీవితమంతా గడపాలని ఉంది మృణా !" అన్నాడు ఆమె చేతిని తీసుకుంటూ.

"దూరం . దూరం .... కాస్త ఓపికపట్టు బావా !" అన్నది మృణాళిని చిలిపిగా.

ఈమాట రిక్షావాడూ విన్నాడు. వెనక్కి తిరిగి ఆ జంటవైపు చూశాడు. అతనలా చూడగానే ఇద్దరూ సిగ్గుపడిపోయారు. రిక్షావాడు మళ్లా మామూలు స్థితికొచ్చి 'మేరా నామ్ రాజూ ఘరానా అనాం ....' పాడుకుంటూ రిక్షా వేగాన్ని పెంచాడు.

* * *

ఆఫీసులో పతి ఒక చిన్న ప్రతిపాదన తీసుకొచ్చాడు.

"రేపు శనివారం గనుక ఆదివారం ఎలాగో కలిసి వస్తుంది. కాబట్టి మనం చిన్న టూర్ వేద్దామని ఉంది. శంకరం భద్రాచలం వెళ్లేడు. మనం అంత దూరం వెళ్లకపోయినా, మనకి దగ్గర్లో ఉన్న అమరావతికి వెడదామని ఉంది." అన్నాడు.

"ష్యూర్" అన్నాడు ప్రసాదం.

"మరి నీ మాటేమిటి పతి."

"అలాగే."

"అయితే రేపు అమరావతి వెళ్లడమనేది సెటిల్డ్. రేపు ఈవినింగ్ యిక్కడ లాంచీ ఎక్కితే రాత్రికి

# మనిషి - మిథ్య

అమరావతి చేరుకుంటాం. అక్కడ మనకావలసిన తిండి గట్రా ఏర్పాటులన్నీ ప్రసాదం చూడాలి. ఎంచేతంటే—యిల్లంటూ ఒకటి అతనికక్కడ ఉన్నది గనుక."

ప్రసాదం వప్పుకున్నాడు. ఆ రాత్రికి అన్నీ సమకూర్చుకున్నారు. శనివారం ఒక పూట మాత్రమే ఆఫీసుంటుంది. మధ్యాహ్నం కాఫీలు తాగిన తరువాత రేవు దగ్గరికి వెళ్లేరు.

అమరావతికి వెళ్లే 3 గంటల లాంచీ మీద ఎక్కారు.

లాంచీ ప్రయాణం సరదాగా ఉంటుందనడంలో సందేహంలేదు. పాదరసంలా పారే నీటిపైన లాంచీ నడక మెత్తగా సాగుతుంది. అసలు కదులుతుందా అనే భ్రమా కలిగిస్తుంది.

లాంచీ నది మధ్యకి వచ్చింది.

డబ్ డబ్ మోతతో నీటిపైన పరుగెడుతోంది లాంచి. పైన నిర్మలమైన ఆకాశం, చుట్టూ గట్టులూ, పొదలూ, దూరాన అందమైన కొండలూను.

వాసుదేవరావు 'విమెన్ ఆఫ్ రోమ్' చదువుతున్నాడు. తమకి ఎదటి సీట్లో ఇద్దరు రమ్మాయిలు కూర్చున్నారు. ఇద్దరూ నవనాగరికంగా, అందంగా ఉన్నారు.

ప్రసాదం గుడ్లప్పగించి వాళ్లవంకే చూడటం మొదలుపెట్టాడు. అతని వాలకాన్ని గమనించిన పతి అతన్ని హెచ్చరించేడు మోచేత్తో కుదిపి.

ప్రసాదం తెప్పరిల్లాడు. పతివైపు చూశాడు. పతి కళ్లద్వారా అన్నాడు :"అలా వెర్రిమొహం వేసి చూస్తే ఏం బావుంది చెప్ప" అని.

ప్రసాదం నాలుక్కరుచుకుని సర్దుకు కూర్చున్నాడు.

వాసుదేవరావు విమెన్ ఆఫ్ రోమ్‌లో పూర్తిగా మునిగిపోయేడు. పతి దూరంగా కనిపిస్తున్న కొండలవైపూ, అప్పుడప్పుడూ లాంచీ నడకలో చెల్లాచెద రవుతున్న నీటివైపూ చూస్తున్నాడు.

ప్రసాదానికి పిచ్చెత్తినట్టయింది. అతనికేమీ తోచడంలేదు.

తమ ముందు కూర్చున్న ఇద్దరమ్మాయిల్లో ఒకరు అన్నారు.

"నీకేం తక్కువని యీ బాధ! నన్ను అర్థం చేసుకో."

"వొద్దు లక్ష్మీ అది గుర్తుచేసి నా మనసు పాడుచెయ్యకు" అన్నది, చేతితో నీళ్లని అందుకోడానికి ప్రయత్నిస్తో.

ఆవిడ గొంతు విని వాసు ఉలిక్కిపడ్డాడు. పుస్తకంలోనుంచి తల బయటకు పెట్టి ఆవైపు చూశాడు. ఆమె నీటిని అందుకోడానికి ఇంకా ప్రయత్నాలు చేస్తూనే ఉంది.

**మళ్లీ పుస్తకంలో తల దూర్చాడు వాసు.**

**(ఇంకా వుంది**

వాతావరణం రవంతయినా చెదరకుండా, పూర్తిగా ఉండటంవలన యుద్ధరంగానికి పనికివచ్చే కొన్ని దృశ్యాలను లాల్‌బజార్, గోలకొండ మొదలైన ప్రాంతాలలో షూటింగు జరిపారు.

ఈ చిత్రానికి వస్త్రాదులను రావించవలసిన అవసరం కలిగింది. ప్రధాన పాత్రధారులైన ప్రదీప్ కుమార్, ముంతాజ్, విజయా చౌధురి మొదలగువారంతా ఔట్‌డోర్ షూటింగులో పాల్గొన్నారు.

ప్రత్యేకాహ్వానంమీద మీ విలేఖరి ఒకరోజున షూటింగు ప్రాంతానికి వెళ్లాడు. జూనియర్ ఆర్టిస్టులు ఎక్కువ సంఖ్యలో ఉండటంవల్ల, పాత్రధారులంతా రంగు రంగుల దుస్తులను ధరించి

## హైదరాబాద్ సినిమా

11 వ పేజీ తరువాయి

ఉండటంవలన ఆ ప్రదేశమంతా ఒక తిరునాళ్ళగా కనుపించింది.

నాయికా, నాయక పాత్రలను ప్రదీప్‌కుమార్, శీలానాయుడు పోషిస్తున్నారు. శ్రీ చిత్రగుప్త సంగీతం నిర్వహిస్తున్నారు. నిర్మాత: శ్రీ ఆర్. ఎస్. సూరి.

దాదాపు ఏడు రీళ్లకు పైగా ఇంతవరకు నిర్మించటం జరిగిందని దర్శకులు శ్రీ యాందళ్ మీ విలేఖరితో అన్నారు.

* * *

చిత్రసీమలో అగ్రగణ్యులుగా పేరొందిన కొందరు ప్రముఖులను ఆహ్వానించి రాష్ట్ర ప్రభుత్వ ఉపసంఘం రాజధానిలో సినిమా పరిశ్రమను అభివృద్ధిచేసే విషయమై ఇటీవలనే చర్చలు జరిపిందన్న వార్త ప్రేక్షకుల ఆశలకు కొన్ని కొత్త చిగుళ్లను వేస్తుంది.

ఈ ఉపసంఘంలో మంత్రులు శ్రీ బ్రహ్మానంద రెడ్డి, డా. చెన్నారెడ్డి, శ్రీ పి. వి. నరసింహారావు గారలున్నారు. కళాకారులను, సాంకేతిక నిపుణులను ఆహ్వానించి, చర్చలు జరపటం ఇదే ప్రథమం అని భావించవచ్చు. చర్చలలో పాల్గొన్నవారిలో శ్రీయుతులు అక్కినేని నాగేశ్వరరావు, జగ్గయ్య, పి. పుల్లయ్య, ఫిలిం వాణిజ్యమండలి ప్రతినిధులు,

## ఆడంబరాలను విడనాడండి
## దేశసంపదను వృథా కానీయకండి

### డాక్టర్ వృత్తి చేయండి

విరామకాలంలో ఇంటిలో పోస్టల్ ట్యూషన్ ద్వారా హోమియోపతి చదివి, గవర్నమెంటు రిజిష్టర్డు కాలేజిద్వారా డిప్లొమా పొందండి. ప్రాస్పెక్టస్ ఉచితం. వెంటనే వ్రాయండి.

**Indian Homoeopathic College,**
**(APW), JULLUNDUR CITY**

పండిత
డి. గోపాలాచార్యులవారి

# జీవామృతం

ఆరోగ్యానికి బలానికి
ఆయుర్వేదాశ్రమం
(ప్రైవేట్) లిమిటెడ్
మదరాను-17

### తెల్లమచ్చలు

తెల్ల మచ్చలకు 'స్వేతరి' ఉత్తమ ఔషధము (బొల్లి) ప్రచార నిమిత్తం 15 దినముల మందు ఉచితముగా పంప బడును. వ్యాధి పూర్తి వివరాలతో యింగ్లీషు లేక హిందీలో వ్రాయండి.

Sri Krishna Chandra Vaidya,
(A.P.) P. O. Katrisarai (Gaya).

### జోగి సోమయాజిపురం

పంచకావ్య పరీక్షలు & బహుమతులు. పండిత ప్రకాండులచే ప్రశంసల నందుకొన్న పద్యకావ్యాలు. 1 గోముఖవ్యాఘ్రరావుగారు. 2 కామోపాలంభనము. 3 కలగూరగంప. 4 కామాక్షీస్తోత్రము. 5 నీతికథాస్తబకము. అర్హతనుబట్టి 62 ప్రైజులు యివ్వబడును. పూర్తి వివరములకు నేడే వ్రాయుడు:—

శ్రీ అయ్యగారి జోగిసోమయాజి, జోగి పురం, అంబాజీపేట P.O. (తూ. గోదావరి)

సరిక్రొత్తది పుష్టికరమైనది-గ్రాన్యులేటెడ్

# ఓవోమాల్ట్

శక్తినీ, ఆరోగ్యాన్నీ ప్రసాదించే పానీయం.
ప్రకృతిసిద్ధమైన ఆహారం

Ovomalt

కోకో
విటమిన్లు
బార్లీమాల్ట్
తాజా మీగడపాలు

ఓవోమాల్ట్ ఇప్పుడు సరిక్రొత్త పద్ధతిలో తయారై వస్తోంది.
కంటికింపై, చక్కని రుచితో, కమ్మని వాసన కలది.
కష్టపడి పనిచేసిన శ్రమనంతా పోగొట్టి సత్తువ నిస్తుంది.
పేదదేర్పే గాఢనిద్రను కలిగించడంలో తోడ్పడుతుంది.

ఓవోమాల్ట్ వంటి ఆహారపానీయం వేరొకటి లేదు.
కమ్మని వాసన గలది శరీర పోషకమైనది
సులభముగా జీర్ణమయ్యేది.

**ఫుడ్స్ ఫ్యాట్స్ & ఫెర్టిలైజర్స్**
**ప్రైవేట్ లిమిటెడ్**
67, గొడౌన్ వీధి, మద్రాస్-1.
తణుకు రోడ్, తాడేపల్లిగూడెం, ఆంధ్రప్రదేశ్

మీ వ్రాతకు ప్రత్యేకత నిచ్చుటకు

# కృష్ణవేణి

"సూపర్-ట్రయో"

లేక్ బ్లూ
లారెల్ రోజ్
లాక్ బ్లాక్

krishnaveni
"SUPER"

సోల్ సెల్లింగ్ ఏజంట్లు:
నేషనల్ ప్రొడక్ట్స్ సిండికేట్
292, టి. హెచ్. రోడ్, మద్రాసు-21
ఫోన్: 51569

రాష్ట్రీ స్టూడియోవారు ఉన్నారు

ఈ చర్చలు రహస్యంగా జరిగాయి. కనీసం విలేఖరుల కయినా ప్రవేశం లేదు. అందువల్ల సమావేశం వివరాలన్నీ తెలియలేదు. కాని, మీ విలేఖరితో సన్నిహిత పరిచయం కలిగిన ఒక ప్రభుత్వ అధికారి ఈ చర్చల వివరాలన్నీ తెలిపారు.

సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ బ్రహ్మానందరెడ్డి కొంతసేపు ప్రసంగించారు. మొత్తం ఒకటిన్నర గంటలసేపు అసెంబ్లీ భవనం వద్ద ఈ సమావేశం జరిగింది.

ఆహ్వానితులైన కళాకారులు, సాంకేతిక నిపుణుల తరఫున నటులు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రభుత్వంవారికి ఒక 'మెమొరాండం' సమర్పిస్తూ, ఇక్కడ సినిమా పరిశ్రమను అభివృద్ధి చేసే విషయమై కొన్ని సూచనలను చేశారు.

కొన్ని ముఖ్య సూచనలు : నగరంలో స్టూడియో నిర్మించ దలచినవారికి నూరు ఎకరాల స్థలం మంజూరు చేయటం, కళాకారులకు ప్రత్యేకంగా ఒక కాలనీ నిర్మించటం, మద్రాసు నుంచి వ్యయ ప్రయాసల కోర్చి, ఇంతదూరం వచ్చేవారికిగాను 'ఆర్థిక చేయూత' నివ్వటం, ఉత్తమ చిత్రాలకు, ఉత్తమ కళాకారులకు రాష్ట్ర ప్రభుత్వం బహుమతులను ఇచ్చే పద్ధతులను ప్రారంభించటం (ఇదే పద్ధతి ప్రస్తుతం మహారాష్ట్రలో అమలులో ఉంది), పిల్లలకు చిత్రాలు నిర్మించటం, డాక్యుమెంటరీలు నిర్మించటం మొదలైనవి ఉన్నాయట.

* * *

సారథీ స్టూడియోస్‌లో శరవేగంతో నిర్మించబడుతున్న జగపతివారి నూతన చిత్రానికి 'ఆత్మబలం' అని నామకరణం చేశారు. బి. సరోజాదేవి యీ చిత్రంలో ముఖ్యమైన ఆకర్షణ. ఊటీ దృశ్యాలు కూడా ప్రేక్షకుల హృదయాలపైన శాశ్వతమైన ముద్రలు వేయొచ్చు.

వాశిరాజు ప్రకాశం. ★

# మద్రాస్ సినీమా వార్తలు

## సెట్టుమీద "గుడిగంటలు"

"నీలో ఇంకో ప్రాణి ఉందని తెలిసి కూడా ఇలాటి పనికి పూనుకుంటావా?"

"చేసేదేముంది! వాళ్ళింటికి వెళ్ళాను. లాభం లేకపోయింది. నా వల్ల అందరికీ బాధ! ఇది నాన్నకు తెలిస్తే!"

సుబ్బయ్య కత్తితో కోపంగా ప్రవేశిస్తాడు.

"కళ్యాణీ!"

"నాన్నా!"

"ఛీ! నేను నీకు నాన్ననుగాను! నీ పాలిటి యముణ్ణి. దౌర్భాగ్యురాలా నా కడుపున చెడ పుట్టావ్!"

"నాన్నా! ఏమిటిది నువ్వు కూడా!"

"ఛీ! ఛీ! నా కడ్డురాకు. నువ్వూ, నువ్వూ, ఆ భద్రయ్య కొడుకుతో తిరుగుతున్నావ్! నాకు తెలియకుండా వాణ్ణి పెళ్ళాడావ్! ఎందుకు! ఎందు



"అదృష్టవతి" చిత్రంలో ఒక దృశ్యం.



'కలవారి కోడలు' చిత్రంలో పద్మనాభం, గీతాంజలి.



'చిత్తూరు రాణి పద్మిని' చిత్రంలో రాగిణి.

కని? నీ తండ్రి కూడా చచ్చాడనుకున్నావా? ఛీ! ఆ భద్రయ్య ఏమి కూశాడో తెలుసా? గుమస్తా గాడివి. నీకు మాన మర్యాద లేమిటీ అన్నాడు. నా కొడుకు కొక్కడేకాదు. ఊరంతా నీకు అల్లుళ్ళే అన్నాడు. ఛీ! ఛీ! నీ పరువేమిటన్నాడు, తల కొట్టేసినంత పనైంది. రా నిన్ను చంపి...... చంపి......నే చస్తాను. పీడ విరగడై పోతుంది"

అంటూ సుబ్బయ్య అడ్డు వస్తున్న కస్తూరిని ప్రక్కకునెట్టి కళ్యాణి జుట్టు పట్టుకుంటాడు. కస్తూరి కొడవలి వంటి కత్తిని అందుకుంటుంది.

# సినిమా వార్తలు

"చంపునాన్నా—ఇదిగో చంపు—ముందు నన్ను. తర్వాత అక్కనీ చంపు. మమ్మల్ని నీ కప్పగించిన అమ్మ సంతోషిస్తుంది. పీడ విరగడైందని నువ్వూ సంతోషిద్దువుగాని—"

"కస్తూరీ!"

"జరిగిన మోసానికి కుళ్ళి కుళ్ళి ఏడ్చి, అక్కయ్య ఇప్పుడే నూతిలో పడబోయింది. నేనేదో కాపాడా లనుకున్నాను. పరవాలేదు. నువ్వొచ్చావ్. కానీ—"



శ్రీవాణి ఫిలింస్ ప్రొడక్షన్ నెం 1. లో జగ్గయ్య, రామారావు.

"రా! పాపిష్టిదానా, నిన్ను చంపి నేనూ చస్తాను"

సుబ్బయ్య కత్తి ఎత్తి పొడుచుకో బోతాడు.

"సుబ్బయ్యగారూ!"

వాసూ కంఠం వినిపిస్తుంది. సుబ్బయ్య వెనక్కు చూస్తాడు. కస్తూరీ, కళ్యాణీ తెల్ల బోతారు.

"దొరగారు........నమస్కారం బాబూ!"

"ఆ!"

"మీకేం పిశాచం పట్టిందా!"

"పిశాచమే పట్టింది బాబూ! నా బ్రతుకూ, నా పరువూ బూడిద పాలయ్యాయి. నాకున్న దొక్కటే బాబూ—అది పోయాక, ఇంక నా బ్రతు కెందుకూ!"

"ఆవేశపడకండి. ఈమేనా మీ పెద్దమ్మాయి?"

"ఔను బాబూ! భద్రయ్య కొడుకు దీన్ని రహస్యంగా పెళ్ళి చేసుకున్నాడు. ఇప్పు డాయన పాతికవేలు తీసుకొస్తేనేగాని కొంపకు రానీయ నంటున్నాడు."

సుబ్బయ్య చేతిలో కత్తి వాసు లాక్కుంటాడు.

"అది కనిపిస్తూనేఉంది. ముందీ కత్తి పారేయ్! హు! పాతికవేలు! జస్టు ట్వంటీఫైవ్ పీసెస్ ఆఫ్ పేపర్స్. ఇరవై అయిదు కాగితం ముక్కలు. అవి నీ దగ్గర లేనందువల్ల పసుపు కుంకాలతో వర్ధిల్ల వలసిన ఈ అమాయకురాలి బ్రతుకు నాశనం కావాలా? భగవంతుడా! ఇది నీకే చిత్రంగా ఉంది కదూ! నువ్వు సృష్టించిన మనిషికన్నా—మనిషి సృష్టించిన కాగితాలకే విలువ ఎక్కువ ఈ లోకంలో సుబ్బయ్యగారూ! చూడండి—మీకు కావలసిన, కాయిత ముక్కలు నా దగ్గర ఉన్నాయ్! కట్టలు కట్టలుగా ఉన్నాయ్— నే నిస్తాను. రండి!"

"బాబుగారూ—పాతికవేలే!"

"డబ్బివ్వడమే కాదు! మీ అమ్మాయి కాపురం నిలబెట్టే భారం నాది. మువ్వేం బాధపడకు. రేపు బంగళాకు రా. డబ్బిస్తాను."

కస్తూరి అతనివంక సంభ్రమ మాశ్చర్యాలతో భయంతో, భక్తితో చూస్తుంది.

"బాబుగారూ! మీరే మా పాలిట దైవం. జన్మ జన్మాలకి మీ ఋణం తీర్చుకోలేం!"

కస్తూరి భక్తి గౌరవాలతో అప్రయత్నంగా అతనికి నమస్కరిస్తుంది.

"సుబ్బయ్యగారూ—ఋణాల సంగతి ఎందుకు లెండి. ఎవరు ఎవరికి ఋణపడి ఉన్నారో ఎవరి కెరుక? అమ్మాయి అత్తగారింటికి వెళ్ళి సుఖంగా ఉండాలి. అదే మనకు ముఖ్యం. వస్తా!"

వాసూ ఠీవిగా బయటకు నడుస్తాడు. సుబ్బయ్య కళ్యాణిని దగ్గరకు తీసుకుంటాడు. కస్తూరి, వాసూవెంట పరుగెడుతుంది.

ఈ సన్నివేశం రాజలక్ష్మీ వారి "గుడి గంటలు" చిత్రంలోనిది. ఈ సన్నివేశంలో వాసూగా యన్. టి. రామారావు, సుబ్బయ్యగా నాగయ్య, కస్తూరిగా కృష్ణకుమారి, కళ్యాణిగా గిరిజ పాల్గొన్నారు. వీరు గాక, ఇంకా ఈ చిత్రంలో జగ్గయ్య రేలంగి, రమణారెడ్డి కె. వి. యస్. శర్మ, సీతాదేవి, వాసంతి, శాంతకుమారి మొదలగువారు నటిస్తున్నారు.

ఈ చిత్రానికి మాటలు—ముళ్ళపూడి వెంకట రమణ, పాటలు—ఆరుద్ర, ఆత్రేయ, సి. నారాయణ రెడ్డి, నార్ల చిరంజీవి, ఛాయ—సి. నాగేశ్వరరావు, సంగీతం—ఘంటసాల, కళ—కృష్ణారావు, నృత్యం—

వసుమర్తి, కూర్పు—ప్రకాష్, దర్శకుడు—వి. మధుసూధనరావు నిర్మాతలు—సుందరలాల్ నహతా అండ్ డూండీ.

## "రాముడూ-భీముడూ" ప్రారంభోత్సవం

సురేష్ ప్రొడక్షన్స్ వారు తమ తొలి చిత్రం "రాముడూ—భీముడూ" వాహినీ స్టూడియోలో 7వ ఫ్లోర్‌లో నవంబరు 16వ తేదీ ఉదయం 11—45 నిముషములకు ప్రారంభోత్సవం జరిగింది. శాస్త్ర యుక్తమైన వేద మంత్రాలతో లాంఛనంగా అన్నీ జరిపించేరు. శ్రీ నాగిరెడ్డిగారు క్లాప్ కొట్టారు. మాష్టర్ సురేష్ బాబు (నిర్మాత డి. రామయ్య నాయుడుగారి చిరంజీవి) స్విచ్ ఆన్ చేశారు. శ్రీ నాగిరెడ్డిగారికి విజయా డిస్ట్రిబ్యూటర్స్‌లో ఒకరైన శ్రీ సత్యంగారు పూల మాలాలంకృతుల్ని చేశారు. ప్రథమ చిత్రీకరణ యన్. టి. రామారావుగారితో చేశారు. ఆ రోజు షూటింగ్‌లో బుష్యేంద్రమణి, యన్. టి. రామారావు పాల్గొన్నారు.

కుమారి జమున, శాంతకుమారి, గిరిజ, చక్రపాణి, కె. వి. రెడ్డి, డి. వి. నరసరాజు వగైరా పెద్దలు చాలామంది ప్రారంభోత్సవానికి హాజరైనారు.

## కోటే ఫిలింస్ "ముళ్ళకిరీటం"

కోటే ఫిలింస్‌వారు "ముళ్ళకిరీటం" చిత్రాన్ని

...టింసెంటర్‌లో త్వరితగతిని పూర్తి చేస్తున్నారు. ఈ చిత్రానికి మాటలు : పాటలు రాజశ్రీ, నిర్మాత, సంగీతదర్శకుడు : దేవదాసు.

## నాగేశ్వరి మూవీస్ "నిజరూపాలు"

నాగేశ్వరి మూవీస్ అనే నూతన సంస్థ "నిజ



'గురువును మించిన శిష్యుడు' రాజశ్రీ.

రూపాలు" అనే సాంఘిక చిత్రాన్ని తీయడానికి సర్వ సన్నాహాలు చేస్తున్నారు. ఈ చిత్రానికి దర్శకుడు : వి. శ్రీనివాసరావు, రచన : కొండేపూడి, సంగీత దర్శకుడు : రఘునాథ్ పాణిగ్రాహి. నిర్మాతలు ఈ చిత్రంలో క్రొత్త నటీనటులను కూడ



పరిచయం చేయనున్నట్లు తెలుస్తుంది.

## రతీమన్మథ

నవంబరు 27వ, తేదీని మెజస్టిక్ స్టూడియోలో లాంఛనప్రాయమైన పూజతో షూటింగ్



'పూ ఫలములో' జమున.

పై సంస్థవారు ప్రారంభించారు. నూతన పద్ధతిన ఆ స్టూడియో పాత సాంకేతిక నిపుణునిచే కెమెరా స్విచ్ ఆన్ చేయించారు. స్టూడియో జనరల్ మేనేజరు శ్రీ హిప్రోల్ క్నాన్ కొట్టారు. ఆ సెట్టులో హరనాథ్, రఘురామయ్య, అదోని లక్ష్మి, శారద, అల్లురామలింగయ్య, జ్ఞానలోకనరావు, విజయ పాల్గొన్నారు.

వీరుగాక ఇంకా యస్. వి. రంగారావు, జి. వరలక్ష్మి, ఛాయాదేవి, ప్రభాకరరెడ్డి, ఏడిద నాగేశ్వరరావు, షాబ్‌జాన్ మొదలగువారు ఉన్నారు. జమున, రేలంగి, గిరిజ, కూడా ఉన్నట్లు తెలుస్తుంది.

రచన : పరుశరాం, ఛాయ : మల్లి ఇరానీ, కెమేరా ఆపరేటివ్ : మీనాక్షి సుందరం, కళ: కుమార్. జి, సంగీతం : ఘంటసాల, అసోసియేట్ దర్శకుడు : నల్లపరెడ్డి ప్రసాద్, దర్శకుడు : వి. నాగయ్య నాయుడు, నిర్మాతలు : నాగయ్య నాయుడు అండ్ చంద్రశేఖర్.

## విఠల్ ప్రొడక్షన్సు నూతన చిత్రం ప్రారంభోత్సవం

డిసెంబరు 1వ, తేదీన ఉదయం ఆరు గంటలకు విఠల్ ప్రొడక్షన్సు నూతన చిత్రం గోల్డెన్ స్టూడియోలో ప్రారంభమయింది. కెమెరా స్విచ్ పూర్ణా పిక్చర్సు అధినేత శ్రీ జి. కామరాజు ఆన్ చేశారు. మొదటి రోజు షూటింగ్‌లో కాంతారావు, నాగయ్య, రాజనాల, బాలకృష్ణ, వాసంతి పాల్గొన్నారు.

## కలవారి కోడలు

"దొంగ చూపులు చూచి. . . . .
దోర వయసు దోచి. . . . . .
కొత్త వలపులు చిలికితివా. . . . .
మత్తు కనుల చినదానా. . . . . ."
"దొంగ చూపులు చూచి. . . .
దోర వయసు దోచి. . . .
మత్తు మందు చిలికితివా. . . . .
మనసు పడిన చినవాడా. . . . . ."

పై పాటను ఆరుద్ర వ్రాశారు. ఘంటసాల, జిక్కి పాడగా రికార్డు చేయబడింది. సంగీత దర్శకుడు : టి. చలపతిరావు. పై పాటను రామారావు, కృష్ణకుమారిలతో చిత్రీకరిస్తారు.

## దేశద్రోహులు

ఈ మధ్య వాహినీ స్టూడియోలో శ్రీ రామా పిక్చర్సు వారు తాము నిర్మిస్తున్న "దేశద్రోహులు" చిత్రంనకు క్లైమాక్సులో చిత్రీకరించుటకు భారతదేశ ప్రతిభ పరదేశీయుల నగ ఇమిడ్చిన ఒక పాటను రారికార్డు చేశారు.

"మన స్వతంత్ర భారతం— మహామహుల
త్యాగఫలం. . . .
మాన ధనుల శౌర్యఫలం— నవ స్వతంత్ర
భారతం. . . .
మన స్వతంత్ర భారతమ్మొహో
జయహో ! జయహో !
కాకతి రుద్రమదేవి— కరవాలం తళ
తళలో. . . .
కదం త్రొక్కు పరాక్రమం— కలకాలం
మనదీ. . . .
మన కన్నెంది మన!!
తరతరాల స్వతంత్రేచ్ఛ— తనకు ధర్మ
దత్తమైన
ప్రతిభావణి మహామంత్రి—కంఠీక సౌహో
వెహ్రహో
జయహో ! జయహో !



హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్‌వారి సన్‌లైట్ సబ్బు 75వ జన్మదినోత్సవ సందర్భంలో వారి సీనియర్ సేల్సుమన్ పెద్ద సన్‌లైట్ (నమూనా) కేకును కోస్తున్న దృశ్యం. కన్నెమెరా హోటల్‌లో జరిగిన పార్టీకి శ్రీ డి. జి. షాఫర్డ్ (మార్కెటింగ్ డైరెక్టరు) శ్రీ వి. పి. పటేల్, ఇతర మేనేజర్లు, మద్రాసు బ్రాంచిలోని ఫీల్డు ఉద్యోగులూ, డీలర్లు మొదలగు వారు హాజరైయ్యారు.

అందరి కృషి ఫలితంగా— జనం మెచ్చ—
జగం మెచ్చ !
అవతరించె— అతిశయించె— మన॥
పచ్చని పైరుల పండుగచేసే— భాక్రానంగల్
పెన్నిధి వచ్చని॥
గనిలో దాగిన ఖనిజ సంపదల— వెలుగుకు
దెచ్చే నెయివేల్లి మన॥
యంత్ర యుగానికి విజయపతాకం భిలాయి
కర్మాగారం మన॥
సాగర యానం సలిపెడు నౌకల— నిర్మా
ణించే వైశాఖీ మన॥
ఇదేరీతిగా— ఇదే తీరుగా
పలు మూలల సిరిసంపద చెలిగే భారత
దేశంలో మన॥
పున్నమికే మెయిలుసోకి— వెన్నెల చిరు
చీకట్లై

పగవాడిక నగుబాటుపాలె — ఆహాజం సాగ
దోయి.
ఆజాలుం సాగదోయి
లోకానికే ధర్మ జ్యోతిగా వెలుగొందు
గాంధీ దేవుని నీతి మార్గమే మనము!
మన మంచి దేశానికే మంచి— అనిపించి
కష్టించు వారె నాయకులు మనకు
ఆత్మీయతా—ఐకమత్యమూ—అనురాగమును
త్రివేణి సంగమమ్మె మనమూ !
పరపీడన లేని భారత స్వతంత్ర—
పరిపూర్ణ రూపమే మనమూ !
శాంతియే మన సామ్రాజ్యం—ధర్మమే మన
శాశ్వత సంపద— సత్యమేవ జయతి
ధర్మమేవ జయతి — ఓం తత్సత్ ! ! !

ఈ పైపాటను మల్లాది రామకృష్ణశాస్త్రి వ్రాశారు. ఘంటసాల ఇతర బృందం పాడగా

ఒంటరిగా సాగలేవు— కలిసి మెలిసి
సాధామా...."

ఈ పై పాటను ఆరుద్ర వ్రాశారు. ఏమదాను పాడగా రికార్డు చేయబడింది. కాంతారావు, అనూరాధలతో చిత్రీకరించారు.

2. సుప్రభాతం : "శ్రీమన్న భీష్టవరదా
ఖిల లోకబంధో
శ్రీ శ్రీనివాస జగదేక దయైక సింధో.."

పై సుప్రభాతాన్ని శ్రీ పి. బి. శ్రీనివాసన్ అండ్ శ్రీమతి వైదేహి పాడగా రికార్డు చేయబడింది. ప్రభాకరరెడ్డి, మాలతితో చిత్రీకరించారు.

3. "శ్రీకర నీ పదాబ్జముల సేవలు జేయుచు
నెల్లకాలమున్
నీ కరుణామృతాన దరహిత భక్తు
మోలలాడగా"



'పూజాఫలము'లో సావిత్రి.

మంచు కొండ చాటునుండి— చలి పిడుగులు
కురిసెనే !
దారుణం ! దారుణం !. . . .
మనవాడనుకొన్నవాడే— భాయి భాయి అన్న
వాడె
వేల కొరకు పూరి కరచి— దురాక్రమణ
చేసెనే—
దొంగ ప్రేటు వేసెనే !. . . .
దారుణం— దారుణం— అకారణం—
పచ్చని దేశం చూసి సహించక— పై వాడె
వడో ఎగిరేనా !
హద్దుమీరి పరిహద్దు మీరగా— పరాయి
వాడికి తరమా !
ధర్మం మనదీ— న్యాయం మనదీ— దైవం
మెచ్చిన శౌర్యం మనదీ
విశ్వ దేశముల శాంతికాముకుల— చల్లని
స్నేహం మనదోయి

రికార్డు చేయబ. డిందియన్. టి. తదితరులతో చిత్రీకరిస్తారు. ఈ చిత్రానికి సంగీత దర్శకుడు. యస్. రాజేశ్వరరావు, నిర్మాత: దర్శకుడు: బోళ్ళ సుబ్బారావు, బి. ఏ.

## "బంగారు తిమ్మరాజు"

గౌరి ప్రొడక్షన్సువారు నిర్మిస్తున్న పై చిత్రం ఇప్పటికి 7 రీళ్లు చిత్రం పూర్తి అయింది. 6 పాటలను రికార్డుచేసి చిత్రీకరించారు. వీటిలో 3 పద్యాలు సుప్రభాతం కూడా ఉన్నవి. ఇంకా రెండు పాటలను రికార్డు చేసినవి చిత్రీకరించాలి. త్వరలో చిత్రాన్ని పూర్తిచేసి ఫిబ్రవరిలో విడుదల చేయాలని ఉన్నట్టు ప్రొడక్షన్సువారు తెలియజేశారు.

1. "ఓ విందు చందమామా — నిగనిగలా
రామా. . .

పై పద్యాన్ని ఆరుద్ర వ్రాశారు. పి. బి. శ్రీనివాస్ పాడగా రికార్డు చేశారు. ప్రభాకర రెడ్డితో చిత్రీకరించారు.

4. "చూడని భూమిలేదు— కనుచూపుల
కందని తావులేదు నా
వేడుక తీరగా విపుల విశ్వములోన
చరించు చుందు.."

పై పద్యాన్ని కూడా ఆరుద్ర వ్రాశారు. పి. బి. శ్రీనివాస్ పాడగా రికార్డు చేయబడింది. రామ శర్మతో చిత్రీకరించారు.

5. "రాగ భోగాల తేలించు దొరవనీ. . ."
కోరి పిలిచేనురా సురభామినీ. . .".

పై పాటను పీటూరి వ్రాశారు. పి. సుశీల మరికొంత మంది బృందంతో పాడగా రికార్డు చేయబడింది. గీతాంజలి, చెలికత్తెల నృత్య ప్రదర్శనతో చిత్రీకరించారు.

5. "స్వైరమై ముక్తికి మార్గ దర్శకరమై
శ్రీ మన్మహాలక్ష్మి కా
కరమై మామక పూర్వ పుణ్య వరమై
కాపాడు"

పై పద్యాన్ని వీటూరి వ్రాశారు. మాధవ పెద్ది పాడగా రికార్డు చేశారు. ప్రభాకరరెడ్డి, రామకృష్ణ, మాలతితో చిత్రీకరించారు.

7. "నాగమల్లి కోనలోనా— నక్కింది లేడి
కూనా
ఎరవేసి, గురిచూసి— పట్టాలి మావా"

పై పాటను వీటూరి వ్రాశారు. జమునా రాణి పాడగా రికార్డు చేయబడింది. గీతాంజలి, రాములతో నృత్యంగా చిత్రీకరించారు.

8. "ఈ వింత పులకింత
నాలోన కలిగేను— నిను కనినంత...."

పై పాటను వీటూరి వ్రాశారు. జానకి పాడగా రికార్డు చేయబడింది.



కుమారి గీత (హైదరాబాదు) శ్రీ పి. శేషాచలం బి. ఎ., శ్రీమతి సత్యవతీదేవి బి. ఎ, గార్లకు కుమారి గీత కూచిపూడి నాట్యంలో అందవేసిన చేయి. కీ. శే. డాక్టర్ రాజేంద్రప్రసాద్, మాజీ గవర్నరు భీమ్‌సేన్ సచార్, ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి మున్నగు వారి సమక్షంలో అనేకసార్లు నాట్య ప్రదర్శన లిచ్చి ప్రశంసల నందుకొన్నది. 1962లో అస్సాంలో ప్రదర్శన లిచ్చింది. నవంబరు 22వ తేదీ రవీంద్ర భారతిలో శ్రీమతి నంబియార్ ఆర్గనైజు చేస్తున్న ఒక నిధి సహాయార్థం నృత్య ప్రదర్శన యిచ్చినది.

'గౌతమ్' రచన చేసిన కీలర్ రియల్ రోమాన్స్ అనే పుస్తకం సుమారు 112 పుటలతో త్రివర్ణ ముఖచిత్రంతో ఉన్నది. మా కార్యాలయం చేరింది. ఇందులో అక్కడక్కడ ఫోటోలు కూడా ఉన్నాయి. వెల: రూపాయి. ప్రతులకు యువసాహితి మద్రాస్-17.

★

# రాజధాని కబుర్లు

10 వ పేజీ తరువాయి

చెయ్యక పోవటం. ఇట్లా కాదనుకున్నారు. ఒక్క పోరిగా టెలిఫోన్ తీగెలన్నీ వాటి స్థానాల్లోంచి ఊడలో తీవ్రమైన లోపం ఇవేకారణాలు. ప్రభుత్వ కార్యాలయాల్లో ఇలాంటి చర్యలకు గురియైన వాటిల్లో సమాచార శాఖ కార్యాలయం ఆకాశ వాణి కార్యాలయం కూడా ఉన్నాయి. కేవలం ఆర్టిస్టులకు చెక్కులు ఇవ్వటంలోనే ఆలస్యం గామాలు అనుకున్నా, ఆలిండియా రేడియో వారికి ఆ పక్షపాతం ఏమీ లేనట్టుంది. టెలి ఫోను బిల్లు చెల్లించాలన్నా అంతే!

* * *

ప్రభుత్వంవారి ప్రకటనల్లోనూ, విధానా ల్లోనూ, విశ్వాసంలేక, ప్రతిపక్ష పార్టీలు కొన్ని, తమ విధానాల్ని ప్రజలకు బాహాటంగా తెలియ చెయ్యటానికి, ప్రభుత్వం వారిమీద, ప్రజల కోరికల ముద్ర వెయ్యటానికిగాను సత్యాగ్రహం చెయ్యాలని తీర్మానించుకున్నారు. భారత రాజ్యాంగ, చట్టానికి 17వ సవరణ రూపంగా, రైతుయొక్క ప్రాథమిక సత్యాలను కబళించటానికి వేస్తున్న ప్రభుత్వంవారి పన్నాగాన్ని ఎదుర్కొనటానికి, తర్వాత అదనపు శిస్తు చట్టం వలన రైతుకు జరుగుతున్న తీవ్రమైన అన్యాయాన్ని అరికట్టటానికి సత్యాగ్రహం తప్ప వేరే గత్యంతరం లేదని, స్వతంత్ర పార్టీవారు రాజధాని నగరంలో జరిగిన రెండు రోజుల సమావేశాల్లోనూ పునరుద్ఘాటించారు. పన్ను వసూళ్ల సమయం వచ్చింది. అప్పటి కప్పుడే ప్రభుత్వంవారు పంటను జప్తు చెయ్యటం, శిస్తు కట్టటమైన బలమైన వత్తిడి తీసుకురావటం గ్రామాదుల్లో ప్రారంభ మయిందన్నారు. ఈ విషయాలే సమావేశాలకు వచ్చిన ప్రముఖులు తమ గ్రామాలలో జరుగుతున్న అత్యాచారాలను గురించి చెప్పుకున్నారు. ఇక కమ్యూనిస్టుపార్టీవారు కూడా సత్యాగ్రహం చెయ్యాలని ఆలోచనలు చేస్తున్నారు. పంచవర్ష ప్రణాళికలు ఇంత భారీ ఎత్తున సాగి తీరాలంటారు. భరించలేని పన్నులు విధిస్తున్నా, ప్రభుత్వం వారి విధానాన్ని సమర్థిస్తూనే ఉంటారు. అసలు ఈ అదనపు శిస్తు చట్టం అమలులోకి తీసుకు రావటానికి అవసరం కలిగింది, ప్రణాళికల నిర్వహణకు డబ్బు కోసమే అని ప్రభుత్వంవారు ఓ మూల చెపుతూనే ఉన్నారు. అయినా, కమ్యూనిస్టు పార్టీ వారు మాత్రం, అదనపు శిస్తు చట్టాన్ని వ్యతిరేకిస్తూ, ప్రభుత్వ విధానాన్ని మాత్రం బల పరచటం, విరుద్ధంగానూ, వింతగానూ ఉందని, వీరి వ్యతిరేకతలోని నిజాయితీని ఎంతవరకు ప్రజలు నమ్మాలో ఆలోచించాలసి ఉంటుందని కొంత మంది అంటున్నారు. అదిట్లా ఉండగా, కమ్యూనిస్టుపార్టీలోనే కొంతమంది సత్యాగ్రహం చెయ్యాలని, మరి కొంతమంది ప్రభుత్వంవారికి అండ దండలుగా ఉండాలని భేదాభిప్రాయాలు తెలియ పరుస్తున్నట్లు వినికిడి. ఏమయినా, ఈ రెండు ప్రతిపక్ష పార్టీలు, సత్యాగ్రహాలు మొదలు పెట్టితే ప్రజల్లో ఓవిధమైన అలజడి, ఏది సత్యం, ఏదసత్యం అనే స్పర్థ రాక మానవు. ప్రజల ముందర ఈ రెండు విభేదాలను స్పష్టంగా పెట్టే బాధ్యత ప్రజాస్వామ్యంలో విశ్వాసం ఉన్న ప్రతిపక్ష పార్టీ వారు తీసుకోవలసి ఉంటుంది.

—ఐ. ఎల్. ఎన్ ★




Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchett
Madras-1. Chief Editor S. Sambhu Prasad.